# మణి మంజరి

వాఙ్మయ - యోగ - పరిశోధన పత్రిక

సంపుటి : 2. సంచిక : 1 ఫిబ్రవరి - 1982

సంపాదకులు

వేటూరి ఆనందమూర్తి

వేటూరి ఆంజనేయులు








శ్రీ ప్రభాకర పరిశోధక మండలి

'శ్రీనివాస్' - 6/2 ఆర్. టి. (న్యూ)

విజయనగర్ కాలనీ, హైదరాబాదు-500 457

ఆంధ్రప్రదేశ్

వాఙ్మయ - యోగ - పరిశోధన షాణ్మాసిక
మణిమంజరి
శ్రీ ప్రభాకర జయంతి సంచిక
ఫిబ్రవరి - 1982.

వార్షిక చందా : ఇరవై అయిదు రూపాయలు
వెనుకటి సంచిక : పదిహేను రూపాయలు

ప్రకాశకులు :
వేటూరి ఆనందమూర్తి
శ్రీ ప్రభాకర పరిశోధక మండలి
హైదరాబాదు - 500 457.

ముద్రణ :
అపేర్ ప్రింటింగ్ ప్రెస్
2-2-1167/8/9
తిలక్ నగర్,
హైదరాబాదు - 500 044.

# అధికారభాషా సంఘం

## ఆంధ్రప్రదేశ్

పద్మశ్రీ, కళాప్రపూర్ణ
**డా॥ సి. నారాయణరెడ్డి,**
ఎం. ఏ., పిహెచ్. డి., డి. లిట్
**అధ్యక్షుడు**

తేది 29. 1. 82

# అభినందన

మనీషి, మహర్షి, మానవోత్తముడు కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

జానపదం, జ్ఞానపథం—రెంటిలో తుల్యగవేషణ నెరపిన పరిశోధకు డాయన.

నేను బి. ఏ విద్యార్థిగా ఆయన 'మీగడ తరకలు' పాఠ్యగ్రంథంగా చదివాను. నాలో రవ్వంత పరిశోధన ప్రతిభ తళుక్కుమనడానికి ఆ గ్రంథమే మూలకందం.

కవిగా, విమర్శకుడుగా, పరిశోధకుడుగా, సహృదయుడుగా, స్వయంగా శ్రీ ప్రభాకర శాస్త్రిగారు తెలుగు సాహితీలోకంలో దీపస్తంభం లాంటివారు.

ఆ మహనీయుని 94వ జయంతి సందర్భంగా 'మణిమంజరి' ప్రత్యేక సంచికను వెలువరిస్తున్న మిత్రులు డా॥ వేటూరి ఆనందమూర్తి గారిని హార్దికంగా అభినందిస్తున్నాను.

**సి. నారాయణరెడ్డి**

# Message

P, V. R. K, Prasad. I. A. S.,

Executive Officer,

T. T. Devasthanams.

I am very glad to hear that you are bringing out the next issue of 'Manimanjari' proposing to release it as 94th Prabhakara Jayanti issue during the first week of February, 1982. I should congratulate you on your wonderful work in bringing out this as a journal comitted to project the devoted Service rendered by Sri Veturi Prabhakara Sastri garu there by upon holding the spiritual values and Hindu Dharma.

TIRUPATI

P. V. R. K. Prasad.

6-1-1982.

# Message

Late Veturi Prabhakara Sastry was one of the outstanding literary figures in our State. His invaluable services to Telugu literature and his deep knowledge in various fields like research, philology, epigraphy and archaeology earned for him a place of permanence in the Telugu Literary World. He was indeed an Institution in himself.

I am very happy to learn that an attempt is being made to bring his literary contributions within the reach of the readers in the form of a bi-lingual bi-annual literary journal "Manimanjari". This is a welcome venture and deserves all support. I wish the journal all success.

V. V. Manikyala Rao,
Director, Information and
Public Relations.

బహు పరిశోధనాయత్త పరిష్కారమైన మీ వైదుష్యమును ఒక్కమారు సాధికారంగా వినిపించండి. తలాతోకా లేకుండా తికమకలౌతున్న పరిశోధనకు పంశోధకులకు చుక్కాణి త్రిప్పి త్రోవచూపండి.

చిరకాల సంపన్నమైన మైత్రీబాంధవమును పురస్కరించుకొని నేను స్వయంగా అభ్యర్థిస్తున్నాను. కులపతులను అప్పారావుగారిని కూడా పిలుస్తున్నాను.

భవదీయుడు

రాయప్రోలు సుబ్బారావు

# సంపాదకీయము

'మణిమంజరి' పత్రికా ప్రకటనం నిరంతరాయంగా కొనసాగాలని ఆశిస్తున్నది పతితృ లోకం. పత్రిక ఆగకుండా పనిచేయవలె ననీ, శ్రీవారి రచనలన్నీ అచ్చులోకి తెచ్చే యత్నం త్వరలో చేయవలె ననీ తొందరిస్తున్నది పండితలోకం.

మా ఆసక్తీ ఆశయమూ కూడా అదే. అందుకు తగిన శక్తిప్రపత్తులు మాకు సమకూడును గాకనియే మేము వేడుకొంటున్నాము.

ఈ కృషిలో అనేక విధాల తోడుపడుతున్న వారికి కృతజ్ఞత లర్పిస్తున్నాము. తోడుపడతా మున్న వారినీ కృతజ్ఞతతో స్మరిస్తున్నాము.

మణిమంజరి చేస్తున్న ఈ అక్షరార్చనకి సహృదయులు పలువు రుత్సాహంతో రచనా రూపాన సహకారి మందిస్తున్నారు. వారి కైసేతనుకూడా వెనువెంటనే పత్రికలో సమకూర్చు కోడానికి మా షాణ్మాసిక త్రైమాసికగా మారితేనే గాని సాధ్యంకాని పరిస్థితికూడా కలుగు చున్నది.

ఈశ్వరేచ్ఛ దీని నెట్లా నిర్వహింపనున్నదో పరికింతము గాక!

మాటల్లోనూ చేతల్లోనూ వ్యక్తమవుతున్న మా పూన్కి ఈ మూడవ సంచికగా మీ ముందున్నది. అందుకొని ఆనందించండి. మీ ఆనందాన్ని వెలకట్టి మమ్మ పంచుకో నివ్వండి.

ఇట్లు

సంపాదకులు.

# స్వవిషయము

"రవికి దీపమున నర్చ లిచ్చు పగిదివోలె"

(నన్నిచోడుని కుమారసంభవము 1-49)

శ్రీ ప్రభాకర పరిశోధక మండలి (హైదరాబాదు) వారు ప్రచురిస్తున్న ఈ షాణ్మాసిక 'మణి మంజరి' వాఙ్మయ - యోగ - పరిశోధన పత్రికగా రూపుదిద్దుకొన్నది. గురుదేవులు స్వర్గీయ శ్రీ ప్రభాకరశాస్త్రిగారి దివ్యస్మృతి కంకితమై మా యీ 'మణిమంజరి' శ్రీవారి జయంతి-వర్ధంతి సందర్భాలను పురస్కరించుకొని ఏడాదికి రెండుసార్లు ఫిబ్రవరిలోను-ఆగస్టులోను వెలువడుతుంది. గురుదేవుల 94వ జయంతిని పురస్కరించుకొని 'ప్రభాకరజయంతి సంచిక' ప్రస్తుతం మీ ముందున్నది.

విడిపత్రిక-వెనుకటి సంచిక-వెల (స్వదేశంలో) రూ. 15/- (పోస్టేజి ఉచితము, రిజిస్ట్రేషను ఖర్చులు అదనము)

సంవత్సర చందా ,, రూ.25/ - ( )

సంవత్సరచందా (విదేశాలకు) 8 డాలర్లు ( )

కొద్ది ప్రతులు మాత్రమే అచ్చయినవి. వలసినవారు ముందుగానే సొమ్మును మనియార్డరు ద్వారాగాని, డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగాని క్రింది విలాసమునకు పంపి చందాదారులు కావచ్చును. మణిమంజరి హైదరాబాదు పేరున చెక్కులు పంపగోరేవారు బ్యాంకుచార్జీల నిమిత్తం అదనంగా రూ. 2/-పంపవలెను.

ముందుముందు 'మణిమంజరి' కొత్త శీర్షికలను సంతరించుకొనబోతున్నది. గురుదేవుల మౌలిక రచనలెన్నో పరంపరగ వెలువడనున్నని.

సంపాదకులు – మణిమంజరి
6/2RT (New) విజయనగర్ కాలనీ,
హైదరాబాదు-500 457. ఆంధ్రప్రదేశ్.

# విషయ సూచిక

# Tirumala Tirupati Devasthanams
# Tirupati

## Would you like to feed the poor among the Lord's Devotees at Tirumala ?

The Hindu religious literature is replete with legends about the sanctity of poor feeding. Feeding the poor devotees of the Lord, in a holy place like Tirumala is particularly propitious. Equally auspicious and popular is the custom of distribution of the Lord's prasadams to his devotees.

The Tirumala Tirupathi Devasthanams have introduced a Scheme–Sri Venkateswara Nitya Prasada Dana Endowment Scheme by which you can distribute either food packets or laddus or Vadas to Pilgrims to Tirumala.

You make an endowment of Rs. 500/- to the T. T. D. The annual interest on it will be utilised either to feed 20 poor pilgrims or distribute 15 laddus, or 15 Vadas to pilgrims in the queue lines once in every year.

The distribution will be done as desired by you on any day of the year, as specified by you–your birthday, wedding anniversary day, your son's or daughter's birthday, your father's or mother's Sraadha day, or any day of other sentimental value to you.

Any number of endowments can be made by a donor and each endowment can be on a different day, as desired. Those who make a minimum of 10 endowments will be provided free darsan for a family of five persons on the notified day (value Rs. 125/- per year on the basis of the present cost of five special Darsan Tickets).

The name and gotra of every donor will be read out at the Koluvu (daily ritual of notification to the Lord) on the day of distribution.

Your contribution to this also earns exemption from Income–Tax and you may kindly quote this while claiming Income–Tax relief in your assessment.

Donations may please be sent through the branches of ANDHRA BANK all over India, or by D.D's. of any Bank, in favour of the Executive Officer T. T. Devasthanams, Tirupati / The Manager, Andhra Bank, T. T. D. Administrative Building, Tirupati–517501.

*EXECUTIVE OFFICER.*

# శరణార్థి
(జగద్గురువు)

—వేటూరి ప్రభాకరశాస్త్రి

మీరితిమి మీ యాజ్ఞ లోకో
ద్ధారకులమని పొంగితిమి పై
బోరగిలఁబడు టెఱుఁగ మైతిమి
ప్రోవుమా తండ్రీ—దయతోఁ
గావుమా తండ్రీ! ॥త్రాహి॥ ౧

అధికులము మే మనియు వేతొక
రథములని దంభోక్తులాడితి
మధఃపతనం బెఱుఁగమైతిమి
ఆదుకొను తండ్రీ — దరికిని
జేదుకొను తండ్రీ! ॥ ॥ ౨

నీటిమీఁదను నేలమీఁదను
నింగిమీదఁను వెలయగంటిమి
చేటు నెఱుఁగకపోతి మిఁక ర
క్షింపుమో తండ్రీ—దయ వీ
క్షింపుమో తండ్రీ! ॥త్రాహి॥ ౩

పూనితిమి విశ్వాధిపత్యము
పొంగిపోయితి మంతెకానీ!
మానవుల మనుమాట మఱచితి
మౌను మాతండ్రీ—తప్పిద
మౌను మాతండ్రీ! ॥త్రాహి॥ ౪

సత్యమెఱుఁగము నిత్యమెఱుఁగము
కృత్యమెఱుఁగము వ్యత్యయంబుల
నత్యయంబులఁ దీరుచుంటిమి
యరయుమో తండ్రీ — మాలో
మెఱయుమో తండ్రీ! ॥త్రాహి॥ ౫

క్రమము తెలియదు, తెలుపగలమొన
గాఁడు లేఁడిటు నట్టుపడుచుం
బ్రమయు చుంటిమి కటికచీకటిఁ
బాపుమో తండ్రీ-వెల్తురు
చూపుమో తండ్రీ! ॥త్రాహి॥ ౬

యుద్ధమునను జపాను గాంచిన
వృద్ధి భూకంపమునఁ గూలెను
బుద్ధివచ్చెను వలదు మా కీ-
బులుపు మా తండ్రీ!- ధర్మము
నిలుపుమా తండ్రీ! ॥త్రాహి॥ ౭

ఆయె నింతకు; దుర్వివేక
చ్ఛాయలోఁబడి కొట్టుకాడఁగ
మాయపెందెర గప్పె తది పెడ
ద్రోయుమో తండ్రీ-యిట దయ
చేయుమో తండ్రీ! ॥త్రాహి॥ ౮

ఈ వ్యథలు భూకంపములు మ
ర్త్యవ్యవస్థల దాఁటినవి, మీ
దివ్యదర్శన మిచ్చి వీనిం
దీర్చుమోతండ్రీ!- మముఁ గడ
తేర్చుమో తండ్రీ! ॥త్రాహి॥ ౯

త్రాహిలోకమశేష మేత
న్మోహ మపనయ, నిత్యశుభమా
దేహి, పాహి, జగద్గురో! ఇత
ఏహి భోస్స్వామిన్!—అభయం
దేహి భోస్స్వామిన్!- ॥త్రాహి॥ ౧౦

# నేటి తెలుగు - నోటి తెలుగు

వేటూరి ప్రభాకరశా

వెలయగలదు, నేడు కాకపోతే రేపు-వేరుగా ఆంధ్ర రాష్ట్రం తప్పక వెలయగలదు.

అప్పటి నుండీ ఆంధ్ర రాష్ట్ర పరిపాలనా తంత్రమంతా, భాషా ప్రయోజనములన్నీ ఆంధ్ర భాషా మూలకములుగానే సాగగలవు. లేఖన మూలముననే కాక వాఙ్మూలమునకూడా తెలుగురచన చాలా పెంపొందగలదు.

పరిపాలనా తంత్రమునకు ముఖ్యమైన కౌన్సిళ్లు, డిస్ట్రిక్టు బోర్డులు, మునిసిపాలిటీలు, కలెక్టరు మొదలగు వారి ఆఫీసులు, కోర్టులు, విద్యాశాలలు, అక్కడి పాఠ ప్రవచనములు అన్నీ తెలుగుతో సాగితే, ఆయా చోట్ల ఉద్యోగులు, సదస్యులు తెలుగుతోనే చర్చలు సాగిస్తే, ఆంధ్రదేశము నలుమూలలవారు, నానా జాతులవారు, సమాన స్వాతంత్ర్యముతో వాగ్వ్యవహారములు ఆయా చోట్ల సాగిస్తే, వాటిని షార్టుహాండు రిపోర్టర్లు అట్లట్లే పత్రికలకు పంపితే, వారి భాషితములు మార్చవీలులేదు గనుక వాటిని అట్లట్లే పత్రికలవారు ప్రకటిస్తే, చాలామట్టుకు నేటిది కాకపోయినా రేపటిదయినా తెలుగు భాష 'నోటి తెలుగు' కాక తప్పదు.

మాట్లాడే భాషకూ, వ్రాసేభాషకూ ఐక్యమో, కాకపోతే సాన్నిధ్యమో అనివార్యం అవుతుంది. ఈ మార్పు రాకతప్పదు.

తెలుగు పుట్టిన నాటినుండి నేటిదాకా తెలుగు వారు భాషాప్రయోజనాలను పెక్కింటిని పరభాషల ద్వారానే పడయడం సంభవిస్తూ వచ్చింది.

ఆదికాలంలో సంస్కృత ప్రాకృతములు, తర్వాత తురక, ఇంగ్లీషు భాషలు తెలుగుప్రజలమీద వెల్లివిరిసి తెలుగుకు రూపేర్పఱిచి, పెంపొందించి, భాషా ప్రయోజనములను పెక్కింటిని తమ మూలాన తెలుగు ప్రజలకు ప్రసాదిస్తూ వచ్చినవి.

ఆయా కాలములలో భాషా ప్రయోజనాలలో ఒక్కటయిన సాహిత్య ప్రయోజనానికి మాత్రమే తెలుగు కొంత ఉపయోగపడుతూ వచ్చింది. కాని అందులో కూడా ఆయా కాలాలలో సంస్కృత ప్రాకృతములయు, తురుష్కాంగ్లములయు తాకిడి తెలుగు రచనలకు తగులుతూనే వచ్చినది. సర్వస్వతంత్రత తెలుగుకు పూర్వం కలుగనేలేదు.

అయిపోయిం దేదో అయిపోయింది. ఇప్పుడు దేశకాలముల తీరులు మాఱినవి. ఎప్పుడూ చవిచూచి యెఱుగని మార్పులు సమకూరినవి.

భారతదేశానికంతా ఏకమొత్తాన రాజ్యాంగ భాషగా, నవ్యనాగరకభాషగా నూరేండ్లపాటు తెగ వెలిగి వెలిగి అనేకాపూర్వప్రయోజనములను సాధించి పెట్టిన ఆంగ్లభాష ఇక క్రమక్రమంగా తెరమరుగు కావలసిన స్థితికి వచ్చినది. దాని స్థానమును కొంతవరకైనా హిందీ ఆక్రమించుకొనబోతున్నది.

అయినా అది సర్వభారతదేశ సామాన్యవ్యవహారమునకే పనిగొంటుంది. కాని నేటిదాకా ఇంగ్లీషు పట్టినట్టు దేశభాషావ్యవహారాలపై కత్తిక పట్టు పట్టదట!

రాష్ట్రపాలనవ్యవహారాలన్నీ దేశభాషలలోనే జరుగును గనుక దేశభాషలకిక కత్తికోతలు కలుగవు.

కౌన్సిళ్ళలో, స్కూళ్ళలో, ఇళ్ళలో, వాకిళ్ళలో, రోడ్లలో, రికార్డులలో, కోర్టులలో, ఉపన్యాసాలలో, రాజ్యశాసనాలలో, గ్రంథపఠనరచనలలో తెలుగు దేశంవారు సర్వే సర్వత్రా తెలుగువాడుకనే సాగించ గలిగినారంటే—అహోహో! తెలుగుకు పలుకుబడీ చెల్లుబడీయెంతో సర్వోదయంగాసాగుతుందన్నమాట!

తెలుగు వెలుగు లెంతో దేదీప్యమానంగా వెలయగల వన్నమాట!

ఇది సర్వోదయమే: సంతోషకరమే కాని తీవ్రయోచన గొల్పుతూ కొన్ని చిక్కులు దీనినుండీ యెగరేగుతున్నవి.

గ్రాంథికభాషనూ, ఇంకా ఇటీవల ప్రబలిన వ్యావహారికభాషనూకూడా ఇప్పటిదాకా ఏవోహద్దు పద్దులలో కొంతవరకైనా ఆచిపట్టుకుంటూ వస్తున్నారు—యూనివర్సిటీలవారు, గ్రంథరచయితలు, పత్రికారచయితలు, మఠీ పండితులూను.

ఇక దేశం నాలుగంచులవారిదాకా సర్వతోముఖమయిన స్వాతంత్ర్యం చెలరేగినదంటే హరిజనుల దగ్గఱనుండి భూసురజనులదాకా సర్వప్రజలూ సర్వ స్వదేశవ్యవహారములలో సమానస్వతంత్రులూ, సమాన భాగస్వాములూనయి బుజాలు కలుపుకొని వర్తిల్లనూ వర్ధిల్లనూ సాగించినారంటే, వారివారి భాషలు మాత్రం కలగాపులగములు కాకుండా దూరదూరములుగానే ఉండిపోగలవా! 'మీజాతి తక్కువది, మాజాతి యెక్కువది' అనరానట్టే, 'మీ పలుకుబడి తక్కువది, మా పలుకుబడి యెక్కువది' అని యిక అన వీలుండదు.

కుల్లూక భట్టీయాన్ని బట్టి వర్ణాశ్రమ ధర్మాలనూ నన్నయభట్టీయాన్ని బట్టి ఆంధ్రభాషావ్యవహారాలనూ ఆచిపట్టవలె ననేవారు నాలుకలు కఱచుకోవలసిన స్థితి వస్తుంది, తప్పదు.

ఇది పెద్ద యుగపరిణామం వంటిది.

భాషావిషయంలోనే ఆయెను....ఈ మహత్తర పరిణామంలో రేపు ఇటువంటి స్థితి యేర్పడుతుందని నిస్సంశయంగా నిరూపించడం ఎవరితరమూ కాదు. అసలు ఆంధ్రభాషావృక్షం ఎన్ని చిలవలు పలవలు వేస్తూ పెరుగుతూ వచ్చిందో, యే కొంతయినా దాని విజృంభణ పూర్వం యెట్లా వుండేదో, ఇప్పుడెంత వుందో పరిశీలించి గుర్తించి చూచినవారెవ్వరున్నారు?

పైపై జాతులవారి తేరుకొన్న భాషల మెఱుగులే ఇంతదాక సారస్వతరచనలలో సాగుతున్నవిగాని దేశంనాలుగంచులా తిరిగి భాషను పర్వేచేసి దాని సర్వాంగసౌందర్యమును గుర్తించినవారెవరున్నారు?

జరిగితే ఇకమీదనే ఆపని జరుగవలెను, ఆంధ్రులే ఆంధ్రదేశాన్ని పాలిస్తారు గనుక!

నాళ్ళు, ఊళ్ళు, గుళ్ళు, కొండలు, నదులు, చెరువులు మొదలగువాని పేర్లు, వాని పుట్టుపూర్వోత్తరాలు, తచ్చరిత్రలు, జాతులు—తచ్చరిత్రలు, ఆయా నాళ్ళలో ఊళ్ళలో ప్రఖ్యాతులైనవారి చరిత్రలు, గ్రంథాలు, శాసనాలు, విగ్రహాలు—వాటి కథలు, నోటిపాటలు, పద్యాలు, నానుళ్లు, పలుకుబళ్లు అపూర్వ పదాలు, వాక్యవిన్యాసాలు వగైరాలు,

బహుజాతుల వారి, బహుదేశభాగములవారి భాషా భేదములు, ఆచారవ్యవహారములు--అన్నీ సమాకలనం చేసి సముద్ధరిస్తూ వాటిలోని గుణాలను గుర్తించి నిరూపిస్తూ ఉంటే సర్వప్రజలలోనుండీ, వారిభాషల నుండీ సారాంశములనదగినట్లు ప్రజలూ, వారి భాషలూ మెఱుగులు దేరితేరి బహుముఖముల, బహువిధముల భాషారచన స్వాతంత్ర్యంతో సాగిసాగి కొంతకాలంగడిస్తే ఆ బహుత్వంలోనుండి సారభూతమైన యేకత్వము నెలకొనగలుగుతుందేమో ముందు ముందు కాని, అట్టి స్థితి యేర్పడక పూర్వం, అంటే యిప్పుడే, ఇటువంటి భాషనే 'ఈ విధంగానే వాడవలసింది' అని శాసించడం కూడా ఎవరికీ తరముగాదు.

పుఱ్ఱెకో బుద్ధీ, నోటి కో మాటా; మాటాడే భాషకు విలువ యేర్పడ్డప్పుడు మనిషి మనిషికీ భాషా భేదాలు మఱీ యేర్పడగలవు.

ఒక్కడేకూడా విషయభేదాలనుబట్టీ, సమయ సందర్భాలను బట్టీ, గ్రాంథికవ్యావహారిక రూపద్వయంలో కూడా అనేకాంతరాంతర భేదములను వాడుక చేస్తూ ఉంటాడు.

నామట్టుకు నేనే యెఱిగి యెఱిగి అనేకసందర్భాలలో అనేకవిధభాషలను వాడేస్థితిలో ఉంటాను. వీటి పరిణామాలన్నీ శుభపర్యవసాయులు కాగలవనే ఆశిస్తున్నాను గాని, కొన్ని సందర్భములలో దిగ్భ్రమ కూడా చెందుతూ ఉంటాను.

ఇప్పటికే పంస్కృతసమాసాడంబరంబుల డంబులతో పరమచ్ఛాందసముగా వచనరచన చేసే వారు కొందరు---

ముద్దులుగొలిపే పలుకులతో ఇది గ్రాంథికమని కాని, వ్యావహారికమని కాని నిరూపింప వీలులేనంత సున్నితముగా, సులభముగా వచనరచన చేసేవారు కొందరు---

ఒడుపులు, ఒయ్యారములు గల వాడుకభాషలో బొంగరమును త్రిప్పినట్లు పొంకముగా వచనరచన చేసే వారు కొందరు---

మాటాడేటప్పటికంటేకూడా పలుకులను అరగరాచి గాలికి తూలిపోయేటంత తేలికగా వచనరచన చేసే వారు కొందరూ ఉన్నారు.

కాని వ్యావహారికరచన పెంపొందసాగినకొద్దీ నుడికారములు, నానుళ్ళు, పలుకుపొంకములు, కాకువులు తెలుగురచనలో వెల్లివిరియ సాగినవి.

హృదయములకు హత్తుకోజాలనివి, వ్యవహారానుసరణము లేనివి, సంస్కృతపదాడంబర రచనలు సన్నగిల్లిపో జొచ్చినవి.

పుట్టుకతోనే సంగీతవాసనతో కొందరు పొలుపొందుతూ ఉండేటట్టు సరసాంధ్రరచనాస్వభావంతోనే జన్మించి, చదువుసందెలంతగా లేకపోయినా అతి మనోజ్ఞరచనలు సాగిస్తున్నవారనేకులున్నారు. తెలుగు తియ్యదన మట్టిది!

కష్టపడి గట్టిగా విద్యాభ్యాసాదికము కావించి కూడా, పద్యరచన లేవో పరగిస్తూకూడా, విద్వాంసులే కొందరు అందమయిన వచనరచనల నలవరచుకో జాలక పోతున్నారు

'పత్రికావిలేఖరుల', 'ప్రాముఖ్యతను,' 'విభాగిత భారతదేశమును,' హిందూ మహమ్మదీయ 'సఖ్యతను'---ఇక కాదన వీలులేదు కాబోలును.

ఇట్టి పదాలను పత్రికలే కొంతవరకు పుట్టించి పోషిస్తున్నవి. 'లోకవాడుక'లో నుండి వచ్చినవి కావు పయిపలుకులు.

శయ్యలో వైవిధ్య ముండుగాక! గ్రాంథికమున గాని, వ్యావహారికమునగాని పదముల నుపయోగించుటలో భాషాలోకజ్ఞుల ననువర్తించు టావశ్యకము గాదా! ఆచిపట్టువా రెవ్వరు?

వివిధత యింత వింతగా విజృంభిస్తున్నా, కొన్నాళ్ళకు దీనిలోనుండి యింకా నిద్దమయిన రచనపు సరకు నెగడగలదు.

వైవిధ్యమే మెరుగులు దేరితేరి తనలోనుండి హార్దమహితమయిన యైకవిధ్యము నవతరింపజేయగలదు.

[గురుదేవులు రచించిన ఈ వ్యాసం ఆంధ్రపత్రిక సర్వధారి సంవత్సరాది సంచిక (1948)లో ప్రకటింపబడింది. గ్రాంధిక వ్యావహారిక రూపద్వయాన్ని గూర్చిన శ్రీవారి అభిప్రాయాలెట్టివో ఇందులో విశదమవుతున్నవి. "నామట్టుకు నేనే యెరిగి యెరిగి అనేక సందర్భాలలో అనేక విదభాషలను వాడేస్థితిలో ఉంటాను."

"కుల్లూక భట్టీయాన్ని బట్టి వర్ణాశ్రమధర్మాలనూ, నన్నయభట్టీయాన్ని బట్టి ఆంధ్ర భాషా వ్యవహారాలనూ, ఆచి పట్టవలెననేవారు నాలుకలు కరచుకోవలసిన స్థితి వస్తుంది. తప్పదు." ఇట్టిది శ్రీవారి నిశ్చయము. 'నోటితో బల్క వినదగు నుడుగు లెట్లు-కాగితముపయి వ్రాయంగ గర్హ్యములగు?'. శ్రీవారికామధేనువుకథ (1912), రూపకానువాదాలు, వ్యాసాలూ, ఉపన్యాసాలూ, అన్నీకూడా ఇట్టి నిశ్చయాన్ని అక్షరరూపాన ఆవిష్కరించుకొన్న తార్కాణలే.

శ్రీవారి చివరిరోజుల్లో పిలుపిచ్చి ఈ వ్యాసాన్ని వ్రాయించుకొన్న వారు శివలెంక వారే. —సం॥ ]

## లేఖ

ఆంధ్రపత్రిక

24-1-1948

శ్రీ ప్రభాకరశాస్త్రి గారికి,

నమస్కారములు

ఉగాది సంచికకు 'నేటి తెలుగు' అన్న శీర్షికతో ఒక వ్యాసమును రాసి పంపగోరెదను. అది కొంత చర్చకు దారితీసినను ఇబ్బందిలేదు. నిజమునకు కొంత చర్చజరుగవలసి యున్నదనే నా అభిప్రాయము. వ్యాసము సాధ్యమైనంతత్వరలో పంపగోరెదను. అంతాక్షేమం.

చిత్తగించవలెను.

(సం) శి. శంభుప్రసాద్

# నవ్యసాహిత్యపరిషత్తు

(పదకొండవ వార్షికోత్సవము - ఉపక్రమోపన్యాసము)

[ నవ్యసాహిత్య పరిషత్తువారి పదకొండవ వార్షికోత్సవము ముక్త్యాలలో 1946 జనవరి నెలలో అతి వైభవంగా జరిగినది. ప్రముఖ రచయితలూ, పండితులూ, కవులూ, కళాకారులూ ఆ సమావేశాలలో పాల్గొన్నారు. మల్లంపల్లివారు అధ్యక్షత వహించారు. వేటూరివారు ఉపక్రమోపన్యాసం గావించారు. నవ్యసాహిత్యపరిషత్తు చరిత్రలోనే అదొక అపూర్వ సన్నివేశం. ఆతిథ్యమిచ్చి ఈ సమావేశాల్ని అక్కడ వైభవోపేతంగా సాగించిన ముక్త్యాల ప్రభువుల వాఙ్మయాభిరుచి కొనియాడదగినది—సం॥ ]

—వేటూరి ప్రభాకరశాస్త్రి

శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల సన్నిధిని విద్యా జీవనము కూర్చుకొని ఎట్లో ఏకాంతంగా కాలక్షేపం చేస్తూ ఉన్న నన్ను ఈ నాడు నవ్యసాహిత్యపరిషత్తు వార్షికోత్సవమునకు వచ్చి ఆహ్వానసంఘాధ్యక్షుల యొక్కా, సభాధ్యక్షులయొక్కా, ఇంకా అనేక కవివర్యులయొక్కా మనోజ్ఞరచనలను విని ఆనందింప గలిగేటట్లు చేసిన గురుదేవుల దివ్యానుగ్రహమునకు నమస్కారము! అపూర్వమే నాకీ అనుగ్రహము!

మిత్రులారా! సాహితీకవితావిశారదులారా!

నవ్యసాహిత్యపరిషత్తు బాల్యదశదాటి ఈ పదకొండో వార్షికోత్సవమును ఇక్కడ ముక్త్యాలలో రాజాస్థానమున జరుపుకోవడం చాలా సంతోష విషయము. కవిత్రయమువలెనే ఆంధ్రదేశమును వైభవాన్వితము కావించిన నదీత్రయములో నడిమిదైన "కృష్ణవేణ్ణా" మహానది రెండువేలేండ్లక్రిందట శ్రీశైలమునకు దిగువను సముద్ర సంగమము దాకా ఉన్న తన ఉభయతీరములనూ బౌద్ధధర్మోద్బోధములతో దివ్యశిల్పకవితాకళా విలాసములతో విరాజిల్ల జేసికొని సర్వప్రపంచవాసులకూ తీర్థయాత్రాస్థలమై ప్రఖ్యాతికెక్కి ఉండడము ఈనాటి చరిత్రజ్ఞులకు సువిదితవిషయమే. కానీ, ఈ ముక్త్యాల ప్రాంతము ఆది తెలియనికాలపు చరిత్రచిహ్నములుగా కానవచ్చు సమాధులు గల ప్రదేశమవడము మాత్రము చరిత్రజ్ఞు లింతకుముందు గుర్తించిరో లేదో నే నెఱుగను. కొన్ని యేండ్లకుముందు నేనీయూరిప్రక్కనే అట్టి సమాధి నొకదానిని త్రవ్వించితిని. అందు అజ్ఞాతయుగపు సమాధి వస్తువులుగా మదరాసు మ్యూజియములో సేకరించి యుంచబడిన వస్తువుల వంటి వస్తువులే కానవచ్చినవి. అట్టివీ చుట్టుపట్టులలో పందలకొలదిగా ఉన్నవి.

శ్రీశైలప్రత్యంతపర్వతమైన నాగార్జునునికొండ దగ్గిర మహాయానబౌద్ధ శాఖాప్రవర్తకుడైన నాగార్జునుడు నివసించి అనేక బౌద్ధగ్రంథములను రచించినాడనీ, అంతేకాక శ్రీశైలప్రాంతపు దివ్యౌషధులను పరీక్షించి వాని మూలమున రసవాదవిద్యను వెలయించి రససిద్ధుడై బంగారు చేసినాడనీ చరిత్రజ్ఞులు చెపుతున్నారు. శ్రీశైలవాసి, నిత్యనాథుడనే సిద్ధుడు రసరత్నాకరమనే వైద్యగ్రంథంలో రసవాద ఖండంలో చాలాచోట నాగార్జునుని పేర్కొన్నాడు.*

*శిగ్రుపత్రసమైః పత్రైః మూలైః ప్రావాళ
సన్నిభైః
జ్ఞేయా దివ్యౌషధీ సిద్ధా నామ్నా తక్కిటకారిణీ
తద్ద్రవైః పారదం మర్ద్యం యావత్సప్తదినావధి
తేనైవ తారపత్రాణి ప్రలిప్తాని విశోషయేత్
రుధ్వా గజపుటే పశ్చాత్ ఏవం కుర్యాత్త్రిస
సప్తధా
జాయతే కనకం దివ్యం పురా నాగార్జునోదితమ్.

నాగార్జునునికొండ దగ్గిర ఇక్ష్వాకురాజులు అనేక బౌద్ధ నిర్మాణములను వెలయించినారు. ఆ రాజుల శాసనములతోనే ఇక్కడికి చేరువనేవున్న జగ్గయ్యపేట స్తూపముకూడా వెలసి ఉన్నది. ఆనాటి శాసనములలో అపరశైలసంఘారామమనీ, పూర్వశైలసంఘారామమనీ రెండు బౌద్ధసంఘారామముల ప్రశంసఉన్నది. అవి నాగార్జునునికొండ, దరణికోట సంఘారామములకు వర్తించేవిగా గుర్తింపబడుతూ ఉన్నవి. చంద్రకీర్త్యాచార్యుని మధ్యమకావతార సూత్ర వ్యాఖ్యానంలో పూర్వశైల గాథలలోనివని కొన్ని శ్లోకములు ఉదాహరింపబడి ఉన్నవి.* ఈ మధ్యమకావతార సూత్రగ్రంధము చైనాభాషలో ఉండగా దానిని మన్మిత్రులు శ్రీ అయ్యాస్వామి శాస్త్రిగారు సంస్కృతీకరించినారు. ఈ దేశము వాడైన నాగార్జునుని బౌద్ధగ్రంథములూ, ఈ దేశపు బౌద్ధాచార్యులింకెవరో రచించిన గ్రంథములయిన పూర్వశైలగాథలూ ఈ దేశంలో అంతరించినా వాని ఉనికి అయినా చైనాదేశబౌద్ధ గ్రంధముల మూలాన గుర్తింపగల్గడం నా కత్యంతానందము గొల్పినది. ఆనాడా గ్రంధముల మహిమ ఎంత దూరదేశములకు గూడ ఎగబ్రాకినదో చూడండి!

రెండువేలేండ్ల నాటిదైన సాతవాహనసప్తశతిలో ఈ ముక్త్యాలప్రాంత ప్రదేశమును గూర్చి వర్ణన గాథలు కొన్ని ఉన్నవి. సహృదయులారా! మీరు జగ్గయ్యపేటనుండి ఇక్కడికి వచ్చేటప్పుడు రోడ్డు ఎడమవైపు కొండమీద పాలేటిప్రక్కగా బౌద్ధ స్తూపమును చూచి ఉంటారు. అక్కడినుండి ముక్త్యాలవచ్చే దాకా రోడ్డుకు రెండు ప్రక్కలా దట్టముగా మోదుగుచెట్లు వ్యాపించి ఉండడముకూడా చూచి ఉంటారు. జగ్గయ్యపేట బౌద్ధస్తూపమున బుద్ధవిగ్రహమునకు సాష్టాంగనమస్కృతి చేస్తూ ఉన్న అక్కడి బౌద్ధసన్యాసులను చూచీ, ఎఱ్ఱని పూవులు క్రిందరాలియున్న ఇక్కడి మోదుగుచెట్లను చూచీ సూరన్న అనే కవి సంధానించిన గాథ ఇది

"కీరముహ సచ్ఛహేహిం రేహఇ వసుహా
పలాసకుసుమేహిం
బుద్ధస్స చలణ వందన పడియేహివ భిక్ఖు
సంఘేహిం"

జీబుగా నేలపై రాలెఁ జిల్కముక్కు
లట్లు పూవులు మోదుగుఁజెట్లక్రింద;
బుద్ధపాదాంబుజములకుఁ బుడమి వ్రాలి
వందనము సేయు భిక్షుకవర్గ మనఁగ.

ఈ వర్ణన మిక్కడికే చెల్లుతుంది.

నాగార్జునుని కొండనుండి గంటసాలదాకా ఉన్న బౌద్ధ స్తూపములు అద్భుతములయిన శిలాశిల్పములు గలవి. శిలాశిల్పమునకు గండరుపు అని పేరు. ఈ పదము గంధారి పదమునుండి పుట్టినదని నేను గుర్తిస్తున్నాను. గంధారపదము ప్రాకృతమున 'గండారో' అగును. అదే మన తెలుగున గండా

*యథోక్తం పూర్వశైల గాథాసు—
యది లోకవినేతౄణాం నహి లోకానువర్తనా
కా బుద్ధా ధర్మతా స్యాచ్ఛ బుద్ధం కశ్చి న్న
వేత్స్యతి
స్కంధా ధాతూ నాయతన మేకరూపాణి భాషతే
ధాతుత్రయంచ దేశేతి ఏషా లోకాను వర్తనా
ధర్మా ననామకా నేవ అచిన్త్యైః కిల నామభిః
సత్త్వాన్ హి పరిభాషేతి ఏషా లోకానువర్తనా
అభావ ముపదేశేతి బుద్ధప్రకృతి నిష్ఠయా
అభావః కోఽపి నా స్తీహ ఏషా లోకానువర్తనా
అర్థానర్థదర్శనంచ నిరోధః పరమార్థికః
వదతాం వచ ఉత్కృష్టం ఏషా లోకానువర్తనా
అవినాశ మనుత్పన్నం ధర్మధాతు సమం జగత్
సత్త్వధాతుంచ దేశేతి ఏషా లోకానువర్తనా
త్రిషు ఆధ్వసు సత్త్వానాం ప్రకృతిం నోపలభ్యతి
సత్త్వధాతుంచ దేశేతి ఏషా లోకానువర్తనా-
ఇతి విస్తరః

రువు ఆయినది. నాగార్జునకొండ స్తూపశిల్పములలో ఈ గాంధారశిల్పరచనలు విస్పష్టముగాకానవస్తున్నవి. ప్రఖ్యాతమయిన ఆంధ్ర శిలాశిల్పము గ్రీకుగాంధార షులనుండి ఇచ్చి ఇక్కడివారిచేతులలో వన్నెహెచ్చి జగజ్జేగీయమాన మగుటను ఈ గండరువు పదమూ ఇక్కడ కానవచ్చే గ్రీకు గాంధారశిల్పరచనాసామ్యములూ నిరూపిస్తున్నవి. అయినా ఈ ఆంధ్రశిల్పము గ్రీకు గాంధారశిల్పముల కంటె చాలా వైలక్ష ణ్యమూ, సౌందర్యవిశేషమూ స్వతంత్రముగా సంపాదించుకొన్నదన్నసంగతిని అందరూ అంగీక రిస్తున్నారు. ఈ విషయమును శ్రీ బాపిరాజుగారు వంటి శిల్పకళాకుశలులు విస్పష్టముగా వివరించి చెప్పదగ్గవారు. ఆయాస్తూపములలోని గండరువులను గండరించడమనేది కొన్ని శతాబ్దుల కాలములో సాగి ఉంటుంది కాని అది అంతలో ఇంతలో అవదగిన పనికాదు. ఆ శిల్పవిద్యను నేర్చుకుని గండరించిన వారు ఆనాటి కర్మరాష్ట్రీయులేననీ వారే నేటి 'కమ్మ వా'రనీ నా అభ్యూహము!

ఇంతవఱకూ నేను చెప్పినవి ఇక్ష్వాకులనాటీ, బౌద్ధులనాటీ గాథలు. అవి పదిహేనువందలయేండ్ల కింకా పూర్వకాలపువి. కాకతీయు లకు తర్వాత ఈ ప్రాంతమున సాగివారి పాలనము సాగినది. క్రమముగా నీ ప్రాంతము వాసిరెడ్డి కమ్మ ప్రభువుల పాలనమునకు వచ్చినది. శ్రీ చంద్ర మౌళీశ్వరప్రసాద బహద్దరుగారు వెలయించిన ఈ రమణీయ రాజప్రసాదమున కెదురుగా దివ్య ప్రవాహమై మలకలు తిరిగి పాఱుతూ ఉన్న కృష్ణా స్రవంతికి అద్దరినున్న కొండ 'భారద్వాజాశ్రమము' అని ప్రఖ్యాతి గన్నది. విఖ్యాత పుణ్యయాత్రాస్థల మగు వేదాద్రి ఇక్కడికి చేరువనే ఈ సంస్థాన పాలకులచేతనే సమారాధితసంరక్షితమవుతూ విల సిల్లుతున్నది. కృష్ణానది మిక్కిలి లోతుగానూ, గ్రామము మిక్కిలి ఎత్తుగానూ ఉండడము చేత కృష్ణోదకము మీదికి కొని తెచ్చుకోవడంలో ఇక్కడి ప్రజలు చాలా ఇబ్బంది పడుతూ ఉంటారు. దీనిని గుర్తించి శ్రీ రాజాగారు మిక్కిలి సొమ్ము వెచ్చించి మీదికి నీరు తెప్పించే యేర్పాటు చేస్తున్నారు. నీటి యెద్దడి యిక తీరుతుంది. పట్టణాలకూ, పల్లెలకూ ఈనాడు కానవచ్చే సౌకర్యాసౌకర్యముల తార తమ్యము భారతదేశ రాజ్యతంత్రపరిణామము మూల మున కొలదికాలంలోనే తొలగిపొయ్యేటట్టు తోస్తు న్నది. ఇటువంటి సభలు ఇటువంటి ప్రకృతి సౌందర్యముగల పల్లెటూళ్లల్లో జరగడమే హాయిగా ఉంటుంది. ఎప్పుడో శ్రీ నాగేశ్వరరావుగారు కాంగ్రెసు పనిమీద ఈ ముక్త్యాలవచ్చి కృష్ణానదీ సౌభాగ్యమునూ, స్థల రమణీయతనూ దర్శించి తనిసి ఇక్కడి ఫోటోలను కొనివచ్చి భారతిలో ప్రకటించినారు. నాతో ఒకనాడు "ముక్త్యాలవెళ్లి ఆ స్థలసౌందర్యమునూ, నిర్మల నదీప్రవాహమునూ చూడగా అక్కడే ఉండిపోతే బాగుంటుందని పించింది నాకు. అక్కడ ఉన్నంత సేపూ ఆనంద మయుడనై ఉన్నాను" అన్నారు.

మనలను నేడిక్కడి కాహ్వానించిన శ్రీ ముక్త్యాల రాజాగారు నాకు అత్యంతాప్తులు! వీరి వంశము ఏడెన్మిదివందల యేండ్లుగా ప్రాభవవాసితమై వెలసి ఉన్నట్లు శాసనాదుల మూలమున గుర్తింపబడు తున్నది. అనవేమారెడ్డిగారి పాలనకాలంలో రాజ్య వైభవము వీరికి కల్గినట్లు 'గంధవహము' అనే గ్రంథంలో ఉన్నది. ఇటీవల ఈ వంశమున వెంక టాద్రినాయనింగారు విఖ్యాతిగన్న మహాపురుషులు! జ్ఞానవయోవృద్ధులై రాజ్యనిర్వాహమును చిరంజీవి కుమారునికి శ్రీ రామగోపాలకృష్ణప్రసాద బహద్దరు గారికి అప్పగించి వారివలని రాజ్యవంశప్రాభవాభ్యు దయములను తిలకిస్తూ వానప్రస్థులై ఈశ్వరారాధన ముతో వినోదిస్తూ ఉన్న శ్రీ రాజాచంద్రమౌళీశ్వర ప్రసాదబహద్దరుగారు జనకుని వంటి రాజర్షిసత్త

షులు! సాహిత్యశిల్పకళాభిరతులు! శ్రీ ఆత్మకూరి జగన్మోహనరావుగారిచే వారు వ్రాయించిన భారత కథా తైలవర్ణ చిత్రలేఖనములను ఈ హర్మ్యమున మీరు చూచి ఆనందింపగలరు. ప్రఖ్యాత కవీశ్వరులైన శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే నవ్యాంధ్ర మహాభారతమునూ, శ్రీ కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణగారిచే రామాయణ కల్పతరువునూ కృతులందినారు. ఇంకా ఎన్నో వైద్యజ్యోతిషధర్మ శాస్త్రకవితా విషయకములైన సంస్కృతాంధ్ర గ్రంథములను ముద్రింపించినారు. పెక్కేండ్లనుండి 'ఆర్షరసాయనశాల' అని గొప్ప ఔషధాలయమునూ చికిత్సాలయమునూ వెలయించి ప్రజాక్షేమమునకు మిక్కిలి తోడ్పడుతున్నారు. వారి ధర్మప్రవర్తనము ననుకరిస్తూ శ్రీ రామగోపాలకృష్ణప్రసాదబహద్దరు గారు వారి సత్కార్యములను సమధికాభ్యుదయములతో సంరక్షిస్తున్నారు వీరు వయసులో చాలా చిన్నవారైనా దూరదర్శిత్వమూ, కార్యనిర్వహణమున జాగ్రత్తా, కవితా వినోదమూ, త్యాగమూ, దైవభక్తీ కలిగి రాజ్యమునకు సర్వతోముఖమయిన అభ్యుదయమును సమకూర్ప యత్నిస్తున్నారు. ఇట్టి వారు ఆహ్వాన సంఘాధ్యక్షులు కావడమూ సంతోషావహము!

సభాధ్యక్షులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు నాకు ఆబాల్యమిత్రులు. ఇరువైయైదు యేండ్లకు మునుపు పసిప్రాయములోనే వారు మదరాసు వచ్చి చరిత్ర పరిశోధనము కావింప మొదలు పెట్టినారు. ఏండ్లతరబడిగా తిరువల్లిక్కేణినుండి మ్యూజియము దాక కలిసి నడచి రాకపోకలు జరపడంలో మా కాళ్లూ, రోడ్లూ కూడా అరిగినవి! ఓరియంటల్ లైబ్రరీ, కానిమరా లైబ్రరీ, యూనివర్సిటీ లైబ్రరీలలోని గ్రంథము లనేకములు ప్రధానముగా చరిత్ర విషయములు శ్రీ శర్మగారు కడుపారగా ఆరగించి జీర్ణించుకొన్నారు. భారతదేశ శిలాతామ్రశాసన పరిశీలనమున శ్రీ శర్మగారు అందె వేసిన చేయి! అనేక శిలాతామ్రశాసనములను వారు సవ్యాఖ్యానముగా ప్రకటించినారు. భారతదేశ చరిత్రవిద్వాంసులలో పలువురు ఏదో ఒక వంశచరిత్రమునో ఒక కాల ఖండ చరిత్రమునో వేఱుపఱచుకొని దాని గూర్చి ప్రత్యేక పరిశీలనము గావించి గ్రంథముల రచించుచుండుట కలదు. శ్రీ శర్మగారు రెండు వేలేండ్ల నాటినుండి నేటిదాక భారతదేశమున గల సర్వరాజ వంశ చరిత్రలను ఎక్కువతక్కువలు లేకుండా సంపూర్ణముగా పరిశీలించి యనేకాపూర్వవిషయముల సేకరించి వ్యాసములనూ, గ్రంథములనూ రచించుచున్నారు. వీరి సేకరము ముద్రిత గ్రంథముల నుండి మాత్రమే కాక, అప్రకటితములయిన శిలాతామ్రశాసనాదుల నుండియు చాల హెచ్చుగా ఉంటుంది. వ్యాపకులు కాగోరేవారూ, అవుతూ ఉన్న వారూ పలువురు విద్వాంసులు తమలో ఉన్నది కుండంత, పయికి కానవచ్చునది కొండంత— అన్నట్టు ఉంటారు. శ్రీ శర్మగారిలో ఉన్నది కొండంత—వారు పయికి కానవచ్చునది కుండంత. నవ్యసాహిత్యవర్ధనులై వాసికెక్కుతూ ఉన్న నవ కవీశ్వరులనూ, వారి రచనలనూ శర్మగారు బాగా యెఱుగున్నారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ మహాకవి అన్నట్లు 'డిగ్రీలులేని పాండిత్యము' పరిగణనకురాని యీ కాలమున దానిని కొఱతగా భావింపక శ్రీ శర్మగారిని ఆంధ్రాయూనివర్సిటీవారు వారి యోగ్యతా విశేషములను గుర్తించి ఆచార్యపదవికి గ్రహించుట అసాధారణ కార్యము! ఇందుకా యూనివర్సిటీ వారినిమెచ్చవలెను.

ఇట్టి శ్రీ శర్మగారి యాధ్యక్ష్యమున నీ వార్షికోత్సవము అభ్యుదయోత్తరముగా నెఱవేఱగలదనీ వారి యాధ్యక్ష్యోపన్యాసాదికము పరిషత్తు పురోభ్యుదయమునకు దారిదివ్వెగా వెలయగలదనీ నా విశ్వాసము!

ఇది సరేగానీ, ఉత్సవోపక్రమోపన్యాసకునిగా నన్ను నిర్ణయించడం కొంత వింత విషయమే. ఇప్పటి కిర్వదియేండ్లకు పూర్వము భారతీ పత్రికలో 'వాఙ్మయపరిణామము' అని యొక వ్యాసము వ్రాసి నేనిక వాఙ్మయచర్చలలో పాల్గొనకుందునుగాక యని నిశ్చయించుకొని ఆయా చర్చలకును, రచనకును వైదొలగి యేకాంతంగా కాలక్షేపం చేస్తూ ఉన్న నన్ను—ఈ యిర్వదియేండ్లుగా ఒక నాటకము కాని, ఒక సినిమా కాని, ఒక నవలకాని చూచి చదివి యెఱుగని నన్ను ఉపక్రమోపన్యాసకునిగా నేడిక్కడికి కొనితేవడమూ, ఉపన్యసింపుమనడమూ అడవి మనిషిని సభకు కొనితేవడము, ఉపన్యసింపు మనడము వంటిది! అయినా ఈ నవ్యసాహిత్య రచనా శుభోత్సవమునకు మంగళతోరణము గట్టి ధ్వజారోహణము కావించినవారు శ్రీ గురుజాడ అప్పారావుగారు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గారు నా కాప్తమిత్రులు కావడము, ఆనాడు నేను వారితో కలిసి యిప్పుడు మీరందఱూ నిర్వహిస్తూ ఉన్న సాహిత్యాభ్యుదయము నభ్యూహించి యపేక్షించి యుండినవాడను కావడము నన్ను మీరు వరించడానికి ఒక కారణమయి యుంటుందను కొంటున్నాను. శ్రీ గురుజాడ అప్పారావుగారికీ, నాకూ ఆనాడెటువంటి మైత్రి ఉండేదో సాక్షాత్తుగా ఎఱిగినవారు ఇప్పుడు ఇక్కడ ఎవ్వరూ ఉండరను కుంటాను. ఎందుకనగా అది ముప్పదియేండ్ల క్రిందటి నాటి మాట! వారి పూర్ణిమ్మ, కన్యక రచనలకు ఆనాడు విజయసంకీర్తనము కావించినవాడను నేను. వారి రచనను గూర్చి నే నెఱిగిన విశేషములు చాలా ఉన్నవి. శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గారి నిదేశము చొప్పున అప్పారావుగారి కుమారుడు చి॥ రామదాసుగారు అప్పారావుగారి రచనలను ప్రకటించేటప్పుడు నన్నాయా విశేషములతో పీఠిక వ్రాయగోరిరి. నేను వ్రాయుదునని మాట యిచ్చితివి. అది యట్లు జరుగకే ప్రకటితమయ్యెను. వారి రచనలు సరిగా నేడుకూడా ముద్రితములు కాలేదు. అప్రకటితములగు వారి రచనలు ఇంకా ఉండడము నే నెఱుగుదును.

శ్రీరామమూర్తిపంతులుగారి వాదముతో నేను సంపూర్ణముగా ఏకీభవించినవాడను. 1912—13 ప్రాంతములలో వాడుక భాషలోనే నేను కొన్ని గ్రంథములను ప్రకటించినాను. సభలో వాడుక భాషలో మాట్లాడడం, పత్రికలలో వ్యాసాలు వ్రాయడం కూడా తప్పుగా భావించేకాలమది! శ్రీ గురుజాడ అప్పారావుగారు చిరకాలము క్రిందటనే కీర్తిశేషులయినా ఏకవీరుడై మొనగాడై నిలిచి శ్రీరామమూర్తిపంతులుగారు డక్కామొక్కీలు తిని తన మహోద్యమ విజయమును తిలకించి నేటి మహా సంగ్రామావసానమున రాజువెల్లువలె నిర్యాణము చెందినారు. బాణభట్టునకు భూషణభట్టువలె పంతులుగారి కుమారుడు సీతాపతిగారు తమ తండ్రి గారి రచనోపక్రమములను పూరించి వెల్లడింపగల సమర్థులు. శ్రీరామమూర్తిపంతులుగారు సాధించిన కార్యమును క్రమపద్ధతులలో నడుపుకొనవలసిన భారము నవ్యసాహిత్య పరిషత్తువారిమీద నున్నది.

మీరు నన్నిక్కడికి తోడ్తెచ్చుటకు నా యీ నవ్య సాహిత్యాదరమే కాక ఆహ్వాన సంఘాధ్యక్షులైన శ్రీ రాజాగారికి నాపైగల గాఢాదరముకూడా ప్రధాన కారణమనుకొంటాను. కొలదికాలము క్రిందట ప్రతిభాపత్రిక సంచిక యొకటి నాకు వచ్చినది. దానిని చదివి నేడు ఉన్నజగురుతూ నవ్యసాహిత్య వికాసమునకు అచ్చెరువు చెందినాను. అది చూడడంచేత నాలో పొంగారిన నవ్యసాహిత్య రచనాపరితోషము, శ్రీ రాజాగారి గాఢాదరకలిత మైన ఆహ్వానము, నన్ను రెండు రెక్కలుపట్టి లాగికొనిరాగా శ్రీ గురుదేవుల అనుగ్రహోద్బోధముతో నేనిక్కడికి రాగల్గినాను. ఇన్నాళ్ళుగా నేనీ మహోద్యమమునకు వైదొలగి యుండుటకు

గల కారణముల నిక్కడ వెల్లడించడం సప్రయోజనము, కనుక, ఉచితమూ అవుతుందను కొంటాను,

ఇప్పటికి ముప్పదియేండ్లకు ముందు 1914లో ఐరోపా మహాసంగ్రామ మారంభించినది. ఆనాడే నా కనారోగ్య మారంభించినది. ఏ చికిత్సలకూ అది కుదురలేదు. మూడేండ్లు సెలవు తీసికొని స్వగ్రామమున నుంటిని. యుద్ధమున మృతిచెందిన సైనికుల వార్తలుచదివి కంపించిపోతూ ఉండేవాణ్ణి. ప్రతిదినమూ నాకుమరణయాతనే. అందరి చావులూ నా చావులుగా ఉండేవి. 1916లో నిర్బంధము మీద మరల నౌకరీలో చేరినాను. పదిహేనురోజులు పని చేసినాను. అందులో పదిరోజులు సెలవు తీసికొన్నాను. పైయధికారులు నన్ను పనినుండి తొలగిపోవలసి ఉంటుందన్నారు. నేను రిజిగ్నేషను వ్రాసి యివ్వదలచితిని. చేత ఇరవైయ్యో ముప్పైయ్యో రూపాయ లున్నవి. వానితో హరిద్వారమునకు టికెట్టు తీసికొని వెళ్ళి అక్కడి వినిర్మల గంగాప్రవాహములో ఐక్యమందుదును గాక అని నిశ్చయించుకొంటిని.

[ఈ వాక్యము వ్రాసేటప్పుడు పవిత్రవర్తనులూ, గొప్ప కవీశ్వరులూ, గోదావరీ పుణ్యస్రవంతిలో దేహమును గోల్పోయిన వారూ నాకు చిరపరిచితులూ అయిన చెన్నాప్రెగడ భానుమూర్తి పంతులుగారు స్మృతిపథములో స్ఫురించినారు. వారు సచ్చిదానందమయమయిన స్థానమున వెలయుచుందురుగాక!]

జనార్దన్ అను పుణ్యపురుషుని హోటలులో భోజనముచేసి తిరువల్లిక్కేణి అక్బరుసాహెబు వీథిలో రిజిగ్నేషన్ కాగితముతో వస్తూ ఉండగా గురుజాడ అప్పారావుగారి బంధువూ, వారి మూలమున నాకాప్తమిత్రమూ అయిన పో. నరసింహము యమ్. ఏ. (ప్రెసిడెన్సీకాలేజీ ఫిలాసఫీ ప్రొఫెసరు)గారు ఉన్న యింటిలోనికి ఆహూతుడనై వెళ్ళితిని. అక్కడి మిత్రగోష్ఠిలో నా విషయమెల్ల వెల్లడించుటయ్యెను. మిత్రులు ప్రోత్సహించుటచే అనాడే నేను కుంభకోణము వెళ్ళితిని. అక్కడ శ్రీ గురుదేవుల దర్శించుటతోడనే నా జీవితము మారెను. శ్రీవారి యనుగ్రహమున, ఆనాడే నా వ్యాధి కుదిరినట్లయ్యెను.

దుర్వ్యాధిఖిన్నే శరణం ప్రపన్నే
మయి ప్రసాదాదయిః మాస్మభైషీః
త్రాతాహ మస్మీతి దదా వభీతిం
యస్తం గురుం మస్తకతో నమామి.

అక్కడ జరిగిన అద్భుత సంఘటనలెల్ల వెల్లడించుట గ్రంథిమగును. వచ్చి సరిగా డ్యూటీలో చేరినాను. తదాది ప్రాచీన గ్రంథార్జనముకై దేశాటనము చేయజొచ్చినాను. ఆ దేశాటనమున అనేక విచిత్ర సంఘటనలప్పుడప్పుడు జరిగేవి. ఆర్తులను చూచినప్పుడు నేను అవశుడనై పరితపించడము, వారికారోగ్యము కలగడము, జరుగుతూ ఉండేది. కాని వాని కానాడు ఏమాత్రమూ నేను విలువ గుర్తించి యెఱుగను. గ్రంథార్జనము మీదా, సాహిత్య వినోదము మీదా నా బుద్ధి ఉండేది. కాని నా ఆధ్యాత్మిక సాధన సాగుతూనేఉండేది. ఏటేటా రెండుతూర్లు కుంభకోణము వెళ్ళడము మామూలు. 1921లో కాటూరు నేనూ మరికొందఱము మిత్రులమూ కుంభకోణము వెళ్ళినప్పుడు భాషలను గూర్చి ఫైలాలజీని గూర్చీ తీవ్రముగా చర్చించుకొంటున్నాము. గురుదేవు లది విని నన్ను మందలించినారు. "అస్పష్టముగా ఉన్న యెఱుకతో లోకసామాన్యముతోపాటుగా ఈ వాదాభినివేశములు నీకు ఉండరాదు. వీనిని విడనాడుము" అని. అప్పుడు ఊఁకొట్టి ఊరకుంటిని. పదకొండు గంటలవేళ మరల భోజన శాలలో నేనున్నూ ఒక హైస్కూలు

హెడ్మాష్టరున్నూ కలిసి నాగరి తెల్గు [దవిడ లిపులను గూర్చి చర్చించుకొనుచుండగా గురుదేవులు మరల అక్కడకు వచ్చి ఆ చర్చను గు_ర్తించి నవ్వి వెళ్ళిపోయిరి. సాయంకాలము దివ్యోపన్యాసమున [ప్రత్యేకముగా అందరముందూ నాపేరె_త్తి "ఈతడు వాఙ్మయ విషయములందు తీవ్రాభినివేశముతో నున్నాడు. ఇది యీతనిని చాలా చిక్కులలోనికి దింపగలదు. చాలా ఇబ్బందులు పడగలడు. అటు తరవాతగాని, గు_ర్తింపవలసిన విషయములగు_ర్తింప బూనడు." ఇత్యాదిగా ఇంకా మరికొన్ని విషయములు కూడా అనిరి. తలవంచుకొంటిని. దేశాటనమూ, పు_స్తకార్జనమూ జరుపుతూ అటుపై ఐదా తేండ్లదాకా నేను మామూలు స్థితిలోనే ఉన్నాను. గురుదేవుల ఆనాటి దివ్యాజ్ఞ నాలో ఎక్కడ అడగి ఉన్నదోగాని ఆ స్మరణమే నాకు మరల కలుగలేదు. కాని యోగసాధన జరుపుతూనే ఉన్నాను. కొన్నాళ్ళకు గ్రంథార్జన పర్యటనోద్యమము ముగిసినది. వాఙ్మయాది పరిశ్రమములలో నేను అనేక విధములయిన తగాయిదాలలో తగుల్కొన్నాను. ఆ తగాయిదాలనేకులతో. అవి శ్రుతిమించినవి.

ఒకనాడు మదరాసు తంబుచెట్టి వీధిలో నేను వెళ్ళుతూ నాతో వివదిస్తూ ఉన్న మిత్రులిద్దఱు ఎదురుగా వస్తూ ఉండగా చూచితిని. ఆకస్మికముగా ఆనాటి గురుదేవుల గంభీరాదేశము మెఱపు మెఱసినట్లు నాకు గోచరించినది.

"త్రికరణశుద్ధిగా భవదధీనుఁడనై యితర
ప్రవృ_త్తి పీ
డికొని.పరార్థలాభమొకటే గమనించెద
నింకమీఁద"

నని శపథము అప్పుడే చేసికొంటిని. నాటితోనే వాఙ్మయ విషయ చర్చలనుండి నేను నిష్క్రమించితిని. నాటినుండి శ్రీ గురుదేవుల ఆజ్ఞచొప్పున శత్రువులనుకూడా మిత్రీకరించుకొనుటకే, గాఢముగా ప్రేమించుటకే సాధన సాగించితిని.

అటుపై కొద్ది దినములకే ఒకనాటి రాత్రి మిత్రులము కొందఱము కూడి మాటలాడుటలో జీవుని శరీరానంతరస్థితులూ వానిని గూర్చిన అనుభవములూ ప్రసంగించడము జరిగింది. ఆ రాత్రి నాకు సరిగా నిద్రపట్టక వెరపుగా నుండెను. ఉదయము నాలో ఈక్రింది ప్రశ్నో_త్తరచర్చ జరిగెను.

[ప్రశ్న. రా[త్రి చీకాకు పడితి వేల?
ఉ_త్త. ఆవిషయము నాకు భీతి కలిగించెను.
[ప్రశ్న. ఎందుచేత?
ఉ_త్త. అపరిచిత మగుటచేత నేమో!

"అంతే. ఇక నీకు వానినిగూర్చి అపూర్వానుభవములు కలుగును. అవే కాదు. ఇంకా ఎన్నో వింత విషయములు తెలియును. వెఱవకుము."

భోజనానంతరము శయనించి యుండగా మధ్యాహ్నము ఒంటిగంటవేళ ని[ద్రలోసంక్షోభము కలిగెను. ఎటుపైపుకూ నేను వెళ్ల వీలులేకుండా నాకు నిర్బంధములు కలిగినట్లయినది. ఒక[ప్రక్క ముళ్లకంచె, ఒక[ప్రక్క పెద్దపులులు, ఒక[ప్రక్క తేళ్లూ పాములూ, ఒక[ప్రక్క ఒడ్డొఱకపు గోయి. ఇట్లున్నవి. ఎటూకదలి వెడల వీలులేదయ్యెను. దద్దరిల్లి లేచితిని. బిగ్గరిగా "Go to inner" అని వినబడెను. నన్నెవరో లోనికి ఈడ్చుకొనుచున్నట్లయ్యెను. Levels అని లోలో తోచుచుండెను. కంపించితిని. 'Don't worry your mind'అని మరల బిగ్గఱగా వినబడెను. కుమ్మరి కుండను చేయునప్పుడు కొయ్యదిమ్మతో నలుతట్టుల చఱచుచున్నట్టు, శరీరమంతా లోనికి నొక్కివేయుచున్నట్టుండెను. ఆనాటిరా[త్రి మరీ తీ[వానుభవములు జరిగెను.

ఇదిమొదలుగా ఎన్నెని లోనికోశముల వింత యనుభూతులు తీవ్రముగా నాకు లభింప సాగినవి. కాని లౌకికముగా అన్నీ చిక్కులే. అంతకు పూర్వమూ, తర్వాతాకూడా ఎన్నో తడవలు ఉద్యోగ యత్నములు చెడినవి. దారిద్ర్యము చుట్టుముట్టినది. శైవమత విరోధినని కొందఱూ, వ్యవహారభాషా వాదినని కొందఱూ, తొలుత వ్యవహారభాషావాదినై యుండి తరువాత పప్పులో అడుగు వేసితి నని కొందఱూ, అబ్రాహ్మణకవితాద్వేషినని కొందఱూ, బ్రాహ్మణాచారద్వేషినని కొందఱూ, శాసన, భాషా, చరిత్రాదులలో తప్పులు చేసితినని కొందఱూ, తమ యుద్యోగాదిప్రయత్నముల చెఱచితినని కొందఱూ- పరిపరివిధముల నన్ను ద్వేషించుటయ్యెను. నిజ ముగా కొన్నితప్పిదములు నావల్ల జరిగికూడా ఉండ వచ్చును. అందు బుద్ధిపూర్వకముగా నా పూన్కి ఏమీలేదని నే నెఱుగుదును. వారందఱూ నాకు నాటికీ నేటికీ మిత్రులే. వారికి నేనేమీ బదులు చెప్పబూనలేదు. వారిలో గుప్తముగా నా ప్రేమము ప్రవేశము కల్గించుకొని నెలకొనుటలో అక్కడ కుదుర్కొనియున్న విద్వేషస్వభావము పొంగిపొరల సాగినది. దానికి అలజడి యెవరివల్లకలుగుతుందో వారి మీదికే అది దూకుతుంది. మళ్ళీ వారిదగ్గఱ నుండి ప్రతికృతి లేకపోతే అది క్రమముగా చల్ల నారి తీరవలసిందే అవుతుంది. అలాగే జరుగుతూ వచ్చింది. బాహ్యముగా చిక్కులు పెరుగుచున్నకొద్ది నా కంతరుద్బోధములు అధికము కాజొచ్చినవి. వాఙ్మయాదివ్యవహారము సంపూర్ణముగా కట్టి పెట్టితిని. జీవిక యెట్లో సాగుచుండెను. ప్రేమించు టకే నేను సాధన చేయుచుండుటచే పలుతెఱ గులవారైన నామిత్రుల ననేకులను జీవితక్లేశములు కలిగిన సందర్భములలో ఎన్ని తూర్లో నే నాదుకొన గల్గితిని.

ఈ స్వీయకథ నే నిప్పుడు ప్రధానముగా రెండు ప్రయోజనములకై వెల్లడించితిని. వాఙ్మయ విష యము లంటించుకొనక పరాఙ్ముఖుడనై నేనుండుట వానియెడ వైరస్యముచేగాదని విన్నవించుకొనుట ఒక ప్రయోజనము. మిత్రులయిన మీ యెదుట నే ననుభవించిన ప్రేమమాహాత్మ్యానుభవములను సూచనగానైనా విన్నవించుకొనుట రెండవ ప్రయో జనము.

నేటి నవకవుల రచనలలో కొన్నింట దారిద్ర్య సంక్షోభపు బొబ్బరింతలూ, ధనిక ప్రాభవవిధ్వంస నపు పలవరింతలూ అల్లకల్లోలముగా కానవచ్చు చున్నవి. భగవంతుడు కలడనీ, ఆయన కరుణా సముద్రమనీ, మనకు ఇప్పుడు క్లేశములుగా తోచు నవికూడా మనక్షేమమునకే భగవంతు డనుగ్రహించె ననీ గుర్తింపనిచో మనము త్రాడుతెగిన గాలి పటమువంటి వాళ్లము కాకతప్పదు. భారతదేశమున దారిద్ర్యసాగరము పొంగులువారుటలోనే మోహన దాసకరుణాసాంద్రు డను చంద్రు డుదయించినాడు. ఈ దారిద్ర్యసంక్షోభము లేకున్నచో భారతవర్షము సత్యాహింసాత్మకమైన మహాతపస్సు చేయదు. సంపన్నుడై యుండదగిన మహాత్ముడు లోకము నకై సర్వస్వమూ త్యజించి దారిద్ర్యమును వరించి నాడు. ఇప్పుడు సంపన్నుల ఐశ్వర్యమంతా ఆయ నదే. ఆయన కావలెనంటే కనకవర్షం కురుస్తుంది! ఆయనవలె మనము కోరితెచ్చుకోజాలక పోయినప్ప టికీ లభించిన దారిద్ర్యములో గుర్తింపదగిన గుణ విశేషముల గుర్తింతము గాక! నేను గుర్తించిన మనస్తత్వ శాస్త్రమున ఒక ముఖ్యవిషయము చెప్పు తున్నాను. ఇతరులమీద గుణదోషములు నిర్ణయించే టప్పుడు ఆ గుణదోషములు, మనపేయేమో ముందు పరిపరివిధముల యోచించి చూచు కొనవలెను. తరువాత నిర్ణయమునకు రావలెను. ఇతరుల సంపన్నతను గర్హించి మనదారిద్ర్యమునకు క్షోభ చెందు మనమే యే జన్మలోనో పిల్లికి భిక్షము పెట్టక, ఎదిరి కష్టముల గుర్తింపక, మన కాయు 'ష్యము మనకారోగ్యము అన్న తీరున జీవితము

గడిపినామేమో! నేటి భాగ్యభరితు లొకప్పుడు దరి(దులైయుండి సంపన్నుల తోడ్పాటు పొంద జాలక (కుంగిపోయినవారేమో! వారే నేడు దరి(దు లను ద్వేషిస్తున్నారేమో! పూర్వజన్మమున సంప న్నులై ఉండి పరోపకారముచేసినవారే ఇప్పుడున్నూ సంపన్నులై పరోపకారము చేస్తున్నారేమో. ద్వేష మెప్పటికీ పీడాకరమే. (పేమ యెప్పటికి క్షేమకరమే. అణుమా(తముకూడా ద్వేషము లేకుండా చేసికొంటిమా మనకు మృత్యువే లేక పోవచ్చును. సంపన్నులను తమకంటెతక్కువ వారికి ఉపకరింపవలసినదిగా కోరుకుంటూఉందాము. మనము మనకంటె తక్కువవారికి మనచేతనైన ఉపకారము చేతాము. ఎవరినీ ద్వేషింపకుండా (పేమింతాము. నేనీ వాక్యములు (వాస్తున్నప్పుడు ఇంటివాకిట్లో బిచ్చగాళ్ల యీ పాట పలుకులు విన బడుతున్నవి.

> "బిచ్చగాళ్లా మండినారాయణా, కాశిని
> బియ్యం పెట్టించండి నారాయణా
> పట్టెడన్నంలేదు నారాయణా! మాకు
> కట్ట గుడ్డాలేదు నారాయణా!
> కొంప గోడూ లేదు నారాయణా! చింపి
> గుడ్డ లిప్పించండి నారాయణా! ఆ
> కలికి చస్తున్నాము నారాయణా! మేము
> చలికి నొస్తున్నాము నారాయణా!
> లేని వాళ్లమండి నారాయణా! మాకు
> లేదనబోకండి నారాయణా!"

ఇట్లు లోకసామాన్యమే దయామయమై ఉండ వలసినదై యుండగా లోకమును నడిపింపవలసిన కవులెట్టివారై యుండవలెనో గు ర్తించండి! భారతమున "రాజాకాలస్యకారణమ్" అని ఉన్నది. మంచికో, చెడ్డకో, సుఖమునకో, దుఃఖమునకో, జ్ఞానమునకో, అజ్ఞానమునకో, అభిముఖముగా లోకమును నడిపించువాడు రాజు అనిదానిఅర్థము. అది కొంత నిజమేకాని అట్టి రాజునుగూడా నడిపించు వాడు కవి కావున "కవిః కాలస్య కారణమ్" అనగూడు నని నాభావము.

ఎన్నడో వాల్మీకి రామాయణ మనుపేర సీతా చరి(తమును రచించి నాటికీ, నేటికీ, ఏనాటికీ కూడా తొలగని పాతి(వత్యముతో సీత లనదగిన స్త్రీలను భారతదేశములో సృష్టిస్తున్నాడు. ఈ పాతి (వత్యము భారతదేశమున ఉన్నంతపవి(తముగా ఏ యితరదేశమునాలేదేమో! దీనికి కారణము వాల్మీకి భవభూతులు నిర్మించిన సీత నిర్మలశీలమే అని నా తలపు. కాళిదాసు తన నాటక(తయము వలన అనేక రాజాస్థానములలో కాంతా వ్యామోహములూ, స్త్రీలకై వేటలాటలూ పెచ్చు పెరిగించినాడు. (పజారంక్షణముచేయవలసిన మహా రాజులలో కొందరు కాళిదాసుని అగ్నిమి(తులుగానూ, దుష్యంతులుగానూ, పురూరవులుగానూ తయారై తమకూ దేశానికి కూడా మహానర్థము తెస్తున్నారు. కాళిదాసనాటక(తయపు విదూషకులు (బాహ్మణ జాతిలో ఈనాటికీ తయారవుతూ తమ తీరును కాళిదాసాభ్యనుజ్ఞ కలదానినిగా పొగడుకొంటూ కూడా ఉన్నారు. కాళిదాసు నాటకములు పుట్టినతర్వాత సంస్కృతనాటకము లనేకములు శాకుంతల మాళవి"గ్నిమి(త వి(కమోర్వశీయ చ్ఛాయలతోనే వెల్లివిరియ జొచ్చినవి. అలంకారశాస్త్ర(గంథము లన్నీ శృంగారరస(పపంచనపరము లయినవి. శృంగారమొకటే రసమన్నస్థితీ కలిగింది. అలం కారికులు శృంగారరసమునే విపులీకరించి చూపినారు గాని వీరకరుణాది రసాంతరములనుగూర్చి అంత వివేచన జరపనేలేదు. ఇది అంతా కాళిదాస నాటకములలోని శృంగార రసవిలాసముల చెల్లుబడి వల్ల జరిగినదే.

భవభూతిమహాకవి "ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి" అనీ, "ఋషే

ప్రబుద్ధోసి వాగాత్మని బ్రహ్మణి, అవ్యాహతజ్యోతి రార్షంతే ప్రాతిభం చక్షుః" అనీ చెప్పి అందుకు తానే దృష్టాంతమై ఈనాటి మహాత్ముని సత్యాగ్రహమును పదమూడువందల యేండ్లనాడే అభ్యూహించి తన ఉత్తరరామచరిత్రములో సృష్టించినాడు. కొంచెము వివరిస్తాను. సీత పవిత్ర శీలయని రాము డెరుగును. అయినా కొంతకాలము పరమదుష్టుడైన రావణుని నగర నుండుటను లోకము కీడుగా భావించునని తమ దాంపత్యశీలము లోకమున కెల్ల మేలు బంతిగా వెలయవలసినది అని యెరిగి తత్కాలసన్నిహితులైన ప్రజల యెదుట అగ్ని పరీక్షజరిపి మరీ సీతను పరిగ్రహించినాడు. అయితే నేమి? పామరలోకమునోట నేదో వెలితిమాట వెడలి నది, దానికై రాముడు లోకమును నిందించలేదు. ఎప్పుడో ఏకొందర ముందో జరిగిన అగ్ని పరీక్ష లోకమంతా విశ్వసించకపోవడం తప్పుగాదు. లోకాని కంతకూ సీతయోగ్యతను ప్రత్యక్షీకరించక పోవడం తనదే తప్పు అనీ ఆతప్పు తీరేదాకా దంపతులము మేము సంతపింపవలసినదే అనీ నిశ్చయించు కొన్నాడు. సత్యము జయించి తీరు ననీ, సీతశీలము జగత్ప్రఖ్యాతమై తీరుతుందనీ, చనిపోదనీ నమ్మికతోనే ఆమెను అడవికి పంపినాడు. పండ్రెండేండ్ల పాటు సీతారాముల యంతరంగసంతాపజ్వాలలు ముల్లోకములా ముట్టి మహర్షులయొక్క, పుణ్యసాధ్వులయొక్క. హృదయములలో రంపపు కోతలు కోసినవి. సీతా రాములకు క్షేమములేనిచో లోకమున దాంపత్య ధర్మమే అడగారిపోవునని వారు వెరచిరి. దండ కారణ్యవనదేవత, భూదేవి, గంగ, తమస, కౌసల్య, అరుంధతి, లోపాముద్ర, వాల్మీకి, వసిష్ఠుడు ఆగస్త్యుడు, భరతుడు ఇత్యాదిమహనీయులు పని గొన్నారు. ప్రపంచమంతటిని విశ్వసింపించినారు. లోకకళ్యాణముగా సీతారాముల పునస్సమాగమము జరిగినది. పతివ్రతాధర్మమునూ, సత్యధర్మమునూ భవభూతి భారతవర్షమున నిలిపినాడు. ఉత్తరరామ చరిత్రలోని ఈ శ్లోకము చదివినప్పుడెల్లా నామేను పులకరిస్తుంది.

"ప్రియప్రాయావృత్తి ర్వినయమధురో వాచి
నియమః
ప్రకృత్యా కల్యాణీ మతి రనవగీతః పరిచయః
పురోవా పశ్చాద్వా తదిద మవిపర్యాసిత రసం
రహస్యం సాధూనా మనుపధి విశుద్ధం
విజయతే."

ఉత్తర రామచరిత్ర కథాచ్ఛాయనే నేటి మహాత్ముని సత్యాగ్రహములు సాగినవి. ఒకటి వివరిస్తాను. మహాత్ముడు నిష్కళంకుడయిన అహింసా తత్పరుడు. అయినా అజ్ఞహృదయము, ఆయన మూలముననే 1942 ఆగస్టు దౌర్జన్యము కలిగినదని తలచినది. ఆయనకు బంధనము కల్గించినది. తన నైర్మల్యమును విశ్వసింపని వారికై ఎగచి భగవదంకితముగా సత్యాహింసాధర్మ ప్రతిష్ఠలకై నిరశనవ్రతము సాగించినాడు. రాముడు సీతా త్యాగము చేసినట్లు మహాత్ముడు ఆహారత్యాగము చేసినాడు. ఉత్తర రామచరిత్రమున పండ్రెండేండ్లకు లోకము తత్తరించినట్లు ఆయన పండ్రెండు రోజుల ఉపవాసమునకే లోకము అట్లడికినట్లుడికి నది. ప్రపంచమానవ హృదయమెల్లా తత్ప్రాణ రక్షణకై పరితపించినది. భగవంతుని ప్రార్థించి నది. అతడే హింసాకారణమని ఆయనను హింసింపదలచినవారుకూడా ఆయన యపాయము వల్ల యేమి మూడుతుందో అని మరల ఆయన క్షేమమునే అర్థింపవలసిన వారైరి! మూడు నిమిష ముల పాటు ఊపిరికూడా నిలిచిపోయింది. విశ్వ మానవ ప్రార్థనమే, భగవదనుగ్రహమే, ఆయన సత్యాహింసా తపోబలమహిమే, ఈ యన్నింటి యైక్యమే ఆయన కుసురు పోసింది. మందా! మాకా! ఆహారమా! ఏమీలేదు. ఏమీ లేకపోయినా

ఆ భగవదనుగ్రహమే, ఆ ప్రజాప్రార్ధనమే, ఆ ఆత్మబలమే, ఆయన్నింటియైక్యమే మఱి పద కొండునాళ్ళు ప్రాణశక్తిని ప్రబలపఱుస్తూ ఆయనను మృత్యుంజయుని గావించినవి. మహత్తర కవితా రచనలు లోకమునకు మేలుగీళ్ళను గల్పించి నడిపింప గలుగుతవని చూపడానికే పై వాల్మీకి కాళిదాస భవభూతుల రచనలను పేర్కొన్నాను. లోకమింకా సరిగా గుర్తింపజాలకున్నది కాని మహాత్ముని అహింసా సత్యధర్మములే, ఆయన ప్రార్ధనమే విశ్వ ప్రపంచమంతా యికమీద వెల్లి విరియ నున్నవి! ప్రపంచ మానవ హృదయమత్స్యములమీద ఆయనద్వారా భగవంతుడు ప్రేమజాలమును వినరినాడు. సత్యమూ, అహింసా అన్న యీ రెండు సూత్రములనే ముడిచి ముడిచి తయారు చేసిన వల అది! మడుగులవంటీ, కాల్వలవంటీ, దేశ, జాతి, మతాది, పరిచ్ఛేదములలో ఇగిరి యెండిపోతూ ఉండే మానవహృదయ మత్స్యములను ఈవలతో పట్టి ఎత్తి ఎన్నటికీ ఎండిపోని సర్వప్రజా సామరస్య మహాసముద్రములో ఆయన చేరుస్తున్నాడు. మేమీ వలలో తగుల్కొనమనీ, తప్పించుకొంటామనీ, మమ్మేదీ పట్టజాలదనీ తొలగి, ఇంకా జాతిమతవర్ణ దేశాదిపరిచ్ఛేదము లనే మడుగులలోనే, కాల్వలలోనే, కొందఱు దాగికొని తప్పించుకొన జూచుచున్నారు. సహృదయ మానవ ప్రవాహమున్న చోట్ల నెల్లనూ ఈ వలవాటు తగిలియే యున్నది. ఎన్నటికయినా అందఱూ సహృదయులై అందులో చేరకతప్పదు. ఇప్పటికే దీని మాహాత్మ్యము ప్రపంచము నూగిస్తున్నది. ప్రపంచ ప్రజాహృదయ సముద్రమథనములో చెల రేగిన కాలకూటజ్వాల లన్నట్లు, "వి" బాంబులూ "ఆటం"బాంబులూ వగైరా మారణోపకరణములు చాలా లోకధ్వంసము సాగిస్తూ చెలరేగి ఉన్నా, వీని మూలమున ప్రళయమే వస్తుందేమో అని వెరపు కలుగుతూఉన్నా, మహాత్ముని సంకల్పదివ్యామృతము ప్రజాహృదయసముద్రమునుండియే సర్వతోముఖముగా పొడమి, పొంగారి, పొర్లువారి వస్తూఉన్నది. జాతిబంధములూ, దేశబంధములూ, మతబందములూ ఇక నిలువజాలవు. సీగ్‌ఫ్రీడ్ లైనులూ, మాగినోటు లైనులూ, చీనాగోడలూ, ఖండముల యెల్లలూ, రాజ్యముల హద్దులూ, సముద్రముల మేరలూ, కొన్ని తునాతునకలై పటాపంచలైపోయినవి. ఇంకా మిగిలినవి పోతున్నవి. స్వాతంత్ర్యకాంక్ష, సౌహార్దబంధమూ ప్రపంచ ప్రజాహృదయములలో ప్రబలమై రేగుతున్నవి. ఈ సందర్భములోనే భాషల హద్దులూ తొలగి పోతున్నవి.

ప్రపంచ ప్రజలెల్లా ఏక మయినట్టే, ప్రపంచ భాషలెల్లా ఏకము కాక తప్పదు. దేశభాషలన్నీ ప్రబలి రాష్ట్రభాషలలో చేరి, రాష్ట్రభాషలన్నీ ప్రపంచభాషలో మిశిత మవుతవి! ఇట్టి పరిణామము ఆధికారికులయిన మహాత్మునివంటి పురుషులే జరుపుతున్నారు. ఈ మార్పులో ప్రపంచ సమష్టి క్షేమమునకై కొంత వ్యష్టిక్షేమభంగము కలుగునట్లు, వ్యష్టిక్షేమమాత్ర దృష్టులకు తొలుత తోచవచ్చును. అది ప్రపంచ సామరస్య మహాప్రయోజనమునకై సహ్యమే కావలెను. తెలుగులో వడుకునూలు అనే పదము మృదూచ్చారము కలది ఉన్నది. కాని దేశమంతా సీమనూలుమయం కావడంచేత ఈ నడుమ ఆ పదమునకు ప్రయోగావశ్యకతయే లేనట్టేర్పడినది. గాంధిమహాత్ముని మూలమున ఒక పెట్టున ఇటీవల మరల వడుకునూలు ప్రబలినది, అయినా దానికి 'ఖద్దరు' అన్న పదము ప్రపంచ వ్యాపకమయి వెలసినది. కైనూల్, పడుకునూలు మొదలగునవి ఆయా భాషలపదము లనేకములను 'ఖద్దరు' మ్రింగివేసినది. ప్రపంచమునకంతకూ తెలిసేపదమై 'ఖద్దరు' సర్వభాషా. సర్వ ప్రజావ్యవహార రూఢమై వెలయడంచేత సుంద

రములే అయినా దేశభాషాపదములు వెనుకబడి పోయినవి. ఇక ఖద్దరు పదమును దిగద్రొక్కడము సాధ్యముకాదు. వడుకునూలు పదము నుద్ధరించడమూ సాధ్యముకాదు. అలాగే నాయా దేశభాషలలో మాలమాదిగలకు పలుతెఱగుల పేళ్ళు నిన్నటి వరకూ ఉండేవి. గాంధి మహాత్ముడు వారిని హరిజనులని పేర్కొన్నాడు. మాల, పరయన్, గోసంగి, దోహరి, ఇత్యాది పదము లడగారి పోయినవి. హరిజన పదము నిక దిగద్రొక్క తరముకాదు. దేశిపదముల లేవనెత్తనూ తరము కాదు. హరిజన పదము భారతదేశపు సర్వభాగముల దేశములలోని పంచములకూ ఏకనామ మయినది. ఋషీణాంపునరాద్యానాం వాచ మర్థోనుధావతి" అనుసూక్తి కిట్టి సందర్భములే తార్కాణ!

తీవ్రమయిన తపస్సుతో అంతరాత్మావలోకన సాధన చేసిన కాని సత్యజ్ఞానానందానుభూతి లభింప నారంభింపదు. దానిని కొంతైనా సాధించి, మానవ సంఘ సామాన్య ప్రజ్ఞకంటె అతీతమైన ప్రజ్ఞా చక్షుస్సును బడసినవాడు కాని కవి కాజాలడు. వాడే క్రాంతదర్శియై సామాన్య మానవ లోకమునకు మొనగాడై ముందునిలిచి భవిష్యదభ్యుదయముల నభ్యూహించి, కవిత రచించి, తన రచన అనే దారిదివ్వె మూలమున లోకమును అభ్యుదయమార్గమున నడిపింప గలుగును. పూర్వజన్మముననో, ఈ జన్మముననో తీవ్రమయిన ఆత్మోద్బోధము పడయనివాని రచన, తీవ్రమయిన ఆత్మావలోకన తపస్సు చేసి, తదేకచింతతో లోనికి లోనికి పోయి పరమార్థములను గుర్తించిన వాని రచనలాగా బాగా ప్రజల కుపకరింపజాలదు. లోతుగా ఊటపట్టుదాకా త్రవ్వుకుంటూ పోయి ఊరించిన నూతి నిర్మలోదకమువలె ఉంటుంది, ఆత్మద్రష్ట రచన; తక్కిన రచనలు తన చదివిన రచనల తలమార్పులై చుట్టుపట్టుల వాననీళ్లూ, మురికి నీళ్లూ పోయి నిలిచిన చెలమనీళ్ళవంటివి! కాకపోతే మూరెడు బారెడు లోతు నూతులలోని పైపొఱుడు ఊటనీళ్ళవంటివి అవుతవి. వాటివల్ల లోకమునకు అపూర్వజ్ఞానము గాని, అపూర్వానందముగాని, అననుభూతసత్యస్ఫూర్తిగాని కలుగజాలదు. ఋషులు తపోమహిమచే నిత్యయౌవనులై వర్ధిల్లుతూ ఉంటారన్నట్టు ఆత్మద్రష్ట ఉత్తమ కవితారచన, నిత్యసౌందర్యముతో నిత్యనవ్యమై ఎప్పటికీ నిలుస్తుంది. అట్టి కవికి భాషా, ఛందస్సూ, అలంకారములూ, వృత్తులూ, రీతులూ, గుణములూ, మొదలగు పరికరములు ఒదిగి ఒదిగి దాసులవలె వెంటాడుతూ పుష్పమునకు తొడిమవలె వెనుక నిలిచి మహనీయ భావము నాశ్రయించిన పొటచేత తమకు మహత్త్వమును సంపాదించుకొంటవి. సత్యద్రష్ట కల్పనల జోలికి పోడు. వానికి కల్పన నిస్సారముగా తోస్తుంది. వాని యెఱిగిన సత్యమును నిరూపించుటకే భాషకు బలము చాలదేమో అనదగినట్టుండగా వానికి కల్పనలూ, ఛందోలంకారాది పరికరమూ ఎందుకు? బంగారు కంటె వన్నె హెచ్చుగల మేనికి బంగారునగ లెందుకు? అట్టి రచనలు ప్రపంచమున ఇప్పటికి కడచిన కవికృతులలో అక్కడక్కడ అల్పాల్పముగా రేడియము వలె లభిస్తున్నవి. అట్టి రచనలికమీదనే పుట్టనున్నవని నా నమ్మకము! నిజముగా మహాత్ముడు అలౌకికానుభవములు గడించిన మహాకవి అని నేననుకొంటూ ఉంటాను. ఆయన కొన్ని కొన్ని సందర్భములలో సాధారణముగానే వ్యవహరించిన చిన్ని చిన్ని వాగ్వ్యవహారములే కూడా మహాకావ్యము లనదగినవిగా ఉంటవి! మచ్చుకు ఒక్కటి.

"జనరల్ డయరు నన్ను రాజద్రోహి యని చంపుటకు ఆత్రపాటున రివాల్వరు గురిచూచుకొంటూ దూకుడుతో అపమార్గమున వస్తూ ఉంచే- ఆ త్రోవలో పాము అతని కాలచుట్టుకొని కాటు

వేస్తూ ఉంటే-అతడు దానిని చూడనుగూడ జాలని స్థితిలో నా మీదికే దూకుతూ ఉంటే-అంతా చూస్తూ నేను నిర్భయముగా వాని దగ్గఱకు వెళ్ళి పాముకాటు విషమును నోటితో పీల్చి యుమిసి వాని ప్రాణముల కాపాడుదును. పామును చంపను. ఇది నా అహింసా సిద్ధాంతపు పరమలక్ష్యము." గాంధిగారి భావము గల వాక్యమును ఎప్పుడో వ్రాసినట్లు పత్రికలో చదివితిని.

ఇక్కడ నాయకప్రతినాయకులుగా గాంధి డయర్లు ఉన్నారు. నాయకు డెట్టివాడో ప్రతినాయకు డెట్టివాడో గుర్తించండి. శృంగార రసము తక్క తక్కిన రసములన్నీ ఈ వాక్యంలో ఉన్నవి. జనరల్ డయరు పేరెత్తగానే భయానక భీభత్సరసము లుప్పతిల్లును. వీరకరుణహాస్యాద్భుతశాంతరసాత్మకమై సత్యార్థమై తక్కిన వాక్యమంతా ఉన్నది. ఇది మనకందరకూ, అంతేకాదు, ప్రపంచానికంతకూ కూడా శీలము దిద్దుకోవడంలో మేలు బంతిగా హృదయములలో గోచరిస్తూ నెలకొనియుండవలసిన మహావాక్యము-వాక్యమేకాదు-మహాకావ్యము కూడాను. వాక్యమే రసాత్మకమైతే (తల్లక్రిందై) కావ్యమవుతుందని ఆలంకారికోక్తి. ఇట్టి యోగ్యతలను మనము వరవడి దిద్దుకోసాగితే, బ్రిటిషువారు ఇండియాకు స్వాతంత్ర్య మియ్యడము మాత్రముకాదు, మహాత్ముని వంటి అర్హులకు భగవంతుడే స్వాతంత్ర్య మనుగ్రహింపగలడు. స్వాతంత్ర్య మనగా సత్యజ్ఞానానందముల పూర్ణానుభూతి; ఇప్పుడు మానవ సామాన్యము గ్రుడ్డియెద్దు చేనబడి, నోటికందినది కబళిస్తూ ఉండేటట్లు జీవయాత్రను ఎఱుకలేని తనముతో ఎట్లోగడుపుతున్నది. అంతరంగానుభూతు లభివృద్ధిచెంది జాతిస్మరత్వము లభించి మన పూర్వజన్మ సంస్కారములు వ్యక్తములై, ఇతరులపై మనకూ, మనపై ఇతరులకూ కలిగే రాగద్వేషములకు కారణములూ, మన రోగారోగ్య కారణములూ మొదలయినవి స్పష్టముగా గోచరింపసాగితే వాని నిర్వచనమే, మనమిప్పుడు కల్పించే నవలల తలదన్ని ఉంటుంది. ఇప్పుడు మీరు, మీరు కల్పించే కథలలో, నవలలలో కూడా, మీ మీ పూర్వజన్మవాసనలెన్నో గుప్తములై ఉద్బుద్ధములవుతూనే ఉన్నవని నా నమ్మకము. అవి అన్నీగాని, కొన్నిగాని, ఎఱుక కంద జొచ్చినచో కల్పనలకు పనేలేకపోతుంది. కల్పనకంటె, సత్యార్థములే మహనీయములై, అచ్చెరువును కొల్పేవై ఉంటవి. ఇప్పుడు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ మహాకవి రచించిన ధర్మచక్రమూ, బద్దన్నసేనాని మొదలగు నవలలలో, ఎన్నో ఆయన పూర్వవాసనలు పరిస్ఫురిస్తూవున్నవన్ననమ్మకము నా కున్నది. ఆయనలో దివ్యభావజ్వాలలు తేజరిల్లుతూ ఉన్నవి. ఇట్టి భావోజ్జ్వలనము నేటి నవకవులలో ఇంకా ఎందరిలోనో చెలరేగుతూ ఉన్నది.

శ్రీ దామెర్ల రామారావుగారు చిత్రించిన, శ్రీ అడివి బాపిరాజుగారు చిత్రిస్తూ ఉన్న, చిత్రలేఖనములలో, వారిద్దరూ అప్పుడెప్పుడో అజంతా చిత్రలేఖకులలో ముఖ్యులవడము నాకు గోచరిస్తూ ఉంటుంది. ఇట్టివి నేను చెప్పుతూ ఉంటే మీలో కొందరకైనా విడ్డూరముగా తోస్తుంది.

ఈనాటి సభలో నాకు చిరమిత్రులయిన శ్రీ శివశంకరశాస్త్రిగారికీ, శివభారత కర్తలైన మహాకవులు శ్రీ గడియారము శేషశాస్త్రిగారికీ, సత్కారములు జరగడమూ; శ్రీ మాధవరామశర్మగారి ప్రతాపరుద్రీయము శ్రీ చల్లపల్లి రాజాగారు కృతిపొందడం; ఈ మహోత్సవ సందర్భములను నేను సందర్శించగలగడమూ, సంఘటిల్లినందుకు చాలా సంతోషిస్తున్నాను.

శ్రీ శివశంకర శాస్త్రిగారు వాక్శుద్ధిగల కవివరేణ్యులు; వారి రచనలన్నీ నాకు చాలా మనోహర

ములుగా ఉంటవి, కాళిదాసాది సంస్కృతకవులు సంస్కృత భాషలో వాడిన వృత్తాల నెన్నిటినో, తెలుగులో వారు తేటగా తియ్యగా దిప్యళయ్యలో దిద్ది తీర్చినారు. వారి రచనలన్నీ భావోదాత్తములు; వారి పద్యమయనాటికలు హృద్యంసనాటికలు. రచన ఎంత చిన్నదైతే నేమి? దానిలో ప్రజ్ఞ మెఱుపుతీగ లాగు మెఱవడంలో ఉంది మహిమ. శ్రీ శివశంకర శాస్త్రిగారి చిత్తకుబ్జ రచన చదివినప్పుడెల్లా నాకు ఆనందపారవశ్యం కలుగుతుంది. వారి రచనలన్నీ యేకీకరించి ప్రకటించవలసినదిగా మిమ్ము కోరుతున్నాను.

శ్రీ శేషశాస్త్రిగారూ, శ్రీ రాజశేఖర శతావధానిగారూ, ప్రొద్దుటూరులో పొడమిన సూర్య చంద్రులు! కల్క్యవతార మనదగిన శివాజీ చరిత్రమును శ్రీ శేషశాస్త్రిగారూ, యవనవాహినీ పర్వతమయిన ప్రతాపసింహ చరిత్రమును, శ్రీ రాజశేఖర శతావధానిగారూ రచించి, వ్యాసభారతమున కుత్తర భారతము పూరించిరి. వీరిర్వురూ ఒక యూరనే వర్తిల్లి, యొకపేరనే కవితలు రచిస్తూ శతావధానములు చేస్తూ కొంతకాల మైకమత్యముతో వర్తిల్లినారట! కావున ఈ రెండు గ్రంథములూ 'ఒక కొమ్మనే పూచిన రెండు పూవులు' అనదగినవి. కవితా రచనలో ఈ యిర్వురును కలసిన ఒక్కడయిన సవ్యసాచి! ఒకరు కుడిచెయ్యి! యింకొకరు ఎడమ చెయ్యి! ఇందులో కుడిచెయ్యి యెవరో నేను గుర్తింపజాలకున్నాను. సవ్యసాచి రెండు చేతులూ సమవాటము కలవేయటగదా! కుడిచేతి కంటె ఎడమచేయి మఱీవాటము కలదనీ ఒకభారత పాఠమున్నది. వీరిర్వురూ కలసిన ఒక సవ్యసాచి అవడము ఒక వింతకాదు. వీరిర్వురూ వేర్వేరుగా ఉన్నా సవ్యసాచులే అవడమును, వేర్వేరుగా రచించిన ఈ రెండు గ్రంథములూ సమర్థిస్తున్నవి. వీరిర్వురు కుడియెడమ చేతుల ప్రేల్మిడితో వడిపడిగా బొంగరములబోలె పద్యముల విసరగలరు. వీరి పద్యముల నడక బొంగరముల నడకవలె వాలు వాటములు గలది. మఱొక మాదిరిగా ఉల్లేఖిస్తే వీరి పద్యాలన్నీ, ఆస్వాద్యతలో ఉత్తర దేశపు రస గోళములు (రసగుల్లాలు). శ్రీ రాజశేఖర కవిగారి రచన అచ్చము బమ్మెర పోతరాజుగారి సరస రచనపు కమ్మదనపు సారాంశము. శ్రీ శేషశాస్త్రిగారి రచనము చిదిమిపుచ్చుకొన్న శ్రీనాథుని రచనపు జిగిబిగి. ఆంధ్ర వాఙ్మయమున వీరి కవనము అపూర్వగౌరవము గడించుకొన్నది. వీరి కవిత్వ మహత్వమునకు కైమోడ్పులు! వీరికి సత్కారము జరుగుట నాకు పరమానందప్రదము.

మహామహోపాధ్యాయులైన శ్రీ తాతా సుబ్బరాయ శాస్త్రిగారి ఆప్తశిష్యత్వము, నవరస గంగాధరము, శ్రీ మాధవ రామశర్మగారి ప్రజ్ఞావైభవమునకు ఇప్పటికే ప్రబలమైనతార్కాణములు. శ్రీశర్మగారికి వక్తృత్వము రచయితృత్వమూ,మంచి ప్రౌఢిమతో సమకూడినవి. పసితనములో నున్న వీరిపై ఆంధ్రి సరస్వతి గంపెడాస పెట్టికొన్నది. ప్రౌఢము లయిన సంస్కృతశాస్త్ర గ్రంథములను ఎడతెగక వీరు తెలుగుచేసి, ఆంధ్రివాణి నారాధింపగలుగుదురు గాక అని కోరుచున్నాను. ఇపుడు వీరు తెలిగించిన ప్రతాపరుద్రీయమును చల్లపల్లి రాజాగారు శ్రీ శివరామ ప్రసాద బహద్దరుగారు కృతినందుట ఉభయ శ్రేయస్కరము. భాషకు మహోపకారము. శ్రీ రాజాగారు రాజ్యమునకు వచ్చినదాదిగ వితరణ శీలులై విఖ్యాతిగాంచుచున్నారు.

కవివరేణ్యులారా ! సాహిత్య విశారదులారా ! మీరు నిర్వహింపవలసిన రచనా విశేషములు చాలా ఉన్నవి. విద్యకు తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము అని భేదములుండరాదు. ప్రాచ్యకళాశాలలనీ పాశ్చాత్య కళాశాలలనీ, భేదములు నమసిపోవలసి ఉన్నవి. ఇపుడు ఇంగ్లీషు కాలేజీలన్నీ

దేశభాషలతోనే వర్ధిల్లవలసి యున్నవి. సంగీతము, వేదాంతము తక్కతక్కిన విద్యలలో పాశ్చాత్యులు మనలను చాలా మించిపోయినారు. వారి ఆయా విద్యా విశేషముల నన్నింటిని దేశభాషలలోనికి దింపి సమంసీకరించుకోవలసి ఉన్నది. ప్రాచీనతర్కము నవీనతర్కము, బౌద్ధతర్కము, జైనతర్కము, ఇంగ్లీషులాజిక్, అన్నీ కలసి ఒక శాస్త్రముగా దేశ భాషలలోనే వెలయవలసి ఉన్నది. సర్వభాషాశాస్త్ర ములూ, సర్వభాషా సాహిత్యములూ, ఏకముఖమై దేశభాషల కాలేజీలలో ప్రత్యేకశాఖగా వెలయవలసి యున్నవి. అల్లోపతీ, హోమ్యోపతీ, ఆయుర్వే దము, సిద్ధవైద్యమూ. యునానీ వైద్యము, అన్ని వైద్యములూ ఒకటిగా అయి దేశభాషలలోనే వైద్య కళాశాలలు వర్ధిల్లవలసి ఉన్నవి. గ్రీకులా, రోమనులా, మహమ్మడెన్‌లా, హిందూలా, ఇంగ్లీ షులా. అన్నీకలసి, ఒక ధర్మశాస్త్రమై వెలయవలసి ఉన్నవి. గణితశాస్త్రము జ్యోతిశ్శాస్త్రము మొద లయిన శాస్త్రములన్నీ, నవ్య వికాసములతో దేశ భాషలలో వెలయవలసి ఉన్నవి, కోర్టులలో, ఆఫీసు లలో, అన్ని వ్యవహారములూ, దేశభాషలలో జరుగ వలసి ఉన్నవి. ఇవి అన్నీ ఈలాగే జరగడంలో, మీవంటివారి నిర్వాహము ఎటువంటిదై ఉండ వలెనో గుర్తించండి! ఇట్టి అభివృద్ధి దేశభాషలకు రావలెనంటే సర్వభాషా శబ్దజాలము, దాని పలుకు బడి, వింత వింతలుగా కొత్త కొత్త మార్పులతో కలగలుపులై పోక తప్పదు. దీనిలో ఇప్పుడు, స్వపరభేదము పరిగణిస్తే లాభములేదు. కాలము, ప్రజావ్యవహార రూఢీ పెచ్చుపెరుగుతూఉండే భాషా స్వరూప స్వభావములలో నిగ్గులను తేర్చగలవు. ఎన్నో మహత్తర పరిణామములు వడివడిగా సాగ వలసి ఉన్నవి. ఇప్పుడు జరుగబోయే పరిణామము లలోనుండి ఎన్నో మహత్తర కవితలు వెలయ నున్నవి. కవిత అనేది సర్వ విద్యానుభవముల సారోద్ధారము. అది పాలమీద మీగడవంటిది!

ఇప్పటికే భవిష్యదర్థముల నభ్యూహించి నవ్యకవితా నిర్వాహకులై ప్రఖ్యాతిగాంచుచున్న కవీశ్వరులు మీలో పలువురున్నారు.

ఇదివఅకు నేను పేర్కొన్నవారుగాక పూజ్యులు అనంత కృష్ణశర్మ, కృష్ణరావు, శివరామశాస్త్రి, సూర్యనారాయణశాస్త్రి, సూర్యప్రసాదరావు, వేంక టేశ్వరరావు, లక్ష్మీకాంతము, సీతారామమూర్తి చౌదరి, దీక్షితులు, కృష్ణశాస్త్రి, రామిరెడ్డి, జాషువా, సుందరరామశాస్త్రి, సత్యనారాయణశాస్త్రి, రాజశేఖర కవి, నారాయణాచార్యులు, నారాయణరావు, పిచ్చయ్యశాస్త్రి, నరసింహశాస్త్రి, మొదలయిన కవీ శ్వరుల రచనలు అప్పుడప్పుడు కొన్నికొన్ని నేను చదువుతూ సంతసిస్తూనే ఉన్నాను. శృంగగ్రాహికగా కొందరినే నేనిప్పుడు పేర్కొన్నాను. ఇంకా నవలలను, లఘుకథలను, పాటలను, పద్యాలను, చిటిపొటి పదాలను రచిస్తున్నవారు చాలామంది ఉన్నారు. ఈ నడుమ ప్రతిభలో 'కరుణశ్రీ' అనేపేరితో ప్రకటితములయిన పద్యాలు చదివి చాలా ఆనందించినాను.

మహాకవులందఱూ పూర్వే మెప్పుడో గడిచి పోయినారనీ, యిదేదో పిదపకాలం వచ్చిందనీ, వంకరమూతిపిందె కవిత్వాలు వచ్చినవనీ, అఘో రించే వాళ్ళలో వాణ్ణి కానునేను. మహనీయులని పొగడబడే మనపూర్వులే నేడూ రేపూ మనమై మన బిడ్డలై పరిపూర్ణతకై ముందుకు ముందుకు వస్తు న్నారని నమ్మకముతో ఉండేవాణ్ణి నేను. మన పరి పూర్ణత రేపటి రోజుల్లో ఉన్నదిగాని నిన్నటి రోజుల్లో కడవలేదు. నేటి నవ్యసాహిత్య విశారదుల నవ నవోజ్జృంభణలన్నీ నాకు పరమానందప్రదములే. నీటితో తామర అన్నట్లు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటేశ్వర గురువర్యులు నేటి రచయితలలో కూడా చేయికలిపి గ్రంథాలు రచించగల్గడము నాకు కవి నిత్యయౌవను

డన్న పలుకుకు తార్కాణంగా కనిపిస్తుంది. శ్రీ గురుజాడ అప్పారావుగారు, శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు మొదలుగా నేటి చిటి పొటి రచయితల దాకా వర్ధిల్లుతూ ఉన్న మీ మీ నవ్యకవితా రచనలలో పూర్వకవితలలో అసాధారణము లయిన పద్ధతులు కొన్ని కనుపడుతున్నవి. మీరెవరూ పాడిన పాటగా తాతలనాటి పాతతీరులను మళ్ళీ మళ్ళీ దొర్లించడం లేదు. మీ రచనలలోని వర్ణ్యవస్తువులు కొత్తవి. వాటిని తీర్చేతీరులు సరిక్రొత్తవి. కొందర రచనలలో భాష నవ్యవికాసముతో ఒప్పు లొలుకుతూ ఉండడం కానవస్తుంది. దేశిరచనలు, పాటలు, పదాలు, కొందరు చాలా అందంగా కూరుస్తున్నారు. అలంకారాల అలజడి మీ రచనలలో అంతగా లేదు. చిత్రచిత్రములయిన చిటిపొటి రచనలు మీరు చాలా చేస్తున్నారు. సుబ్బరావు, సత్యనారాయణ, శివశంకరిశాస్త్రి, శివరామశాస్త్రి, సీతారామమూర్తిచౌదరి, రామిరెడ్డి మొదలగు పెద్దల రచనలు ధర్మోద్బోధపరాయణములయి, ఉదాత్త వస్తుకవితాయోజనలు గలవయి అనేకుల రచనలకు మార్గోపదేశకములుగా ఆరాధింపబడుతున్నవి. అది ఆనందకరమే కాని కొందరు నీతినియమములు లక్ష్యము చేయకపోవడం దుఃఖకరమనక తప్పదు.

కులకాంతను గొంగళిపురుగులనుగాను, అన్యకాంతలను ఆకుజిలుకలనుగాను చూడడం శ్రేయస్కరము కాదు. కాలము గడచితే హృదయము చక్కబరచుకొని ప్రతీక్షించి చూస్తే గొంగళి పురుగులే ఆకుజిలుక లపడము తెలియ వస్తుంది. పూర్వం అష్టాదశ వర్ణనలలో సురాపానమృగయాద్యూతాదివర్ణను లుండేవని, నేడు చుట్టలు, సిగరెట్లు, చీట్లపేక, కాఫీక్లబ్బులను చేర్చడం ముల్లుదీసి కొర్రడుచుకోవడం వంటిది! మీ రచనలన్నీ మీ తల్లులూ, మీబిడ్డలూ, మీ కుటుంబినులూ, అయినవాళ్లూ కానివాళ్లూ కూడా కలిసి సవిమర్శముగా చదువుకొని సంతోషించదగ్గవిగా ఉండేటట్టు చూచుకోగోరుతున్నాను. సౌందర్యపతి అయినపర స్త్రీని చూస్తేతప్పేమి అని బాహాటంగా పత్రికలో ఒక నవకవి వ్రాయగా చదివాను. "ఆత్మాన ముపమాంకృత్వా" అని దీనికి వాల్మీకి ఎప్పుడో సమాధానం చెప్పినాడు.

ప్రపంచపు గమనమంతా సత్యముకోసమై, ఆనందముకోసమై సాగుతున్నది. ఈ మూడింటి ఆనంత్యమే ఈశ్వరుడు! కాబట్టి మీ రచనలన్నీ సత్యజ్ఞానానందసాధన పరాయణములై ఉంచే భగవత్ప్రాప్తిసాధనము లవుతవి-అన్న మాట. సత్యోద్బోధముకాని, జ్ఞానోద్బోధముకాని, ఆనందోద్బోధముకాని లేని రచనలు కాలప్రవాహములో రాలి పోతవి గాని నిలువజాలవు. శరీరమునకు వెన్నెముక, అందులో ఇడా, పింగళా, సుషుమ్నా నాడులు ప్రధానములయినట్లు కావ్యశరీరమునకు ధర్మోద్బోధమనే వెన్నెముక, అందులో సత్యజ్ఞానానందములనే మూడు జీవనాడులు ఉండవలెను. సత్యజ్ఞానానందాత్మకమైన అమృతము లభించడానికి హృదయసముద్రమును మథించండి. అందులో కుడియెడమలుగా మంచిచెడ్డలు రేగ గలవు. కీళ్లను ఉహ్వని ఊదివేస్తూ ఉండండి. మేళ్ళను ఏర్చుకొని అనుభవించండి! ఆ యనుభూతులతో కావ్యములు రచించండి! విద్వేషములు, మారణములు, కోపములు రేగించే రచనలవల్ల మనకూ లోకానికీ కూడా కీడే!

యుగయుగములనుండి నేటి దాకా వ్యక్తులు, జాతులు స్వార్థ పరాయణములై పరులను ద్వేషించి యుద్ధములు చేసి నాశమవుతూనే వచ్చినవి. దేవాసురయుద్ధమాదిగా నేటిదాకాజరుగుతూఉన్న యుద్ధతంత్రములలోసర్వత్రసత్యధర్మదయాదాక్షిణ్యముల విధ్వంసనమే కానవస్తున్నది కదా! మా

కారోగ్యా యుష్యైశ్వర్యముల వృద్ధి! మా ప్రత్యర్థికి తత్ప్రతికూలముల సిద్ధి! ఇదే యుద్ధనీతి! ఇందులో కూడా యుద్ధధర్మములని హద్దులు కొన్ని కల్పించు కొంటూ వచ్చారు. అవికూడ అన్ని యుద్ధకథలలోనూ అవకతవకలైనట్టే కన్పట్టుతున్నవి, దేవాసుర యుద్ధములో! రామరావణయుద్ధములో! భారత యుద్ధములో! హైందవపరస్పర యుద్ధములలో! హైందవమహమ్మదీయ యుద్ధములలో! ఐరోపీయుల యుద్ధములలో! నేటి ప్రపంచయుద్ధములలో! తెఱచి యెఱిగింపవలెనా? కంబళిలో అంబలి పోసికొని త్రాగేవానినోర వెంట్రుక లేరిజూచుటవంటిది. యుద్ధతంత్రనిర్వాహకులలో అధర్మముల వెదక బూనడం; ఇటువంటి యుద్ధాలను పొగడేటటువంటి గ్రంథాలూ, వీరస్వర్గాలనిప్పించే గ్రంథాలూ రచించినవారు దయనీయులు. యుద్ధములలో దభీలుమని చచ్చే నిండుజీవుల మహాసంక్షోభములు వారి అనుభవములో గోచరించి ఉంటే ఆగ్రంథాలు వారు రచించి ఉండరు. ఆ ఉద్బోధములు వారు చేసి ఉండరు.

మిత్రులారా! ఇదివఱకు నేను 1914లో యుద్ధ కాలమున చాలా జబ్బుపడితినని, అప్పుడు యుద్ధములో మృతిచెందుచున్న వారి చావులన్నీ నా చావులుగా ఉండేవనీ చెప్పినాను. అప్పుడంత బాధ నాకెందుకు కలుగవలసెనో, దాని ప్రయోజనమేమో, ఆ రహస్యమంతా నిన్నటి కడపటి మహాయుద్ధము ఇక కొన్నేళ్ళకు రాబోతుందనగా నాకు గోచరించినది. దానిచే ఈ యుద్ధకాలములో నేను చెందవలసిన జాగ్రత్త చెందగలిగినాను. ఆ రహస్యమంతా నేనిప్పుడు వెల్లడిస్తే విడ్డూరంగా ఉంటుంది. భగవంతుని దయవల్ల, గాంధిమహాత్ముని వంటి పుణ్యపురుషుల సంకల్పబలమువల్ల భారతదేశము యుద్ధజ్వాలలలో మాడిపోకుండా నిల్చినది. భారతదేశ ప్రధానప్రజాబలం అహింస అనే కల్పవృక్షపు కొమ్మనే పట్టుకొన్నది. ఈ పట్టునిక భారతదేశము విడువజాలదు. సరికదా ప్రపంచమంతటిచేతా కూడా ఈ పట్టునే పట్టించి తీరుతుంది. ఈ పట్టులో ఏకమై ఉత్తరధ్రువమునుండి దక్షిణ ధ్రువముదాకా ఇండియా నుండి అమెరికాదాకా లోకమంతా ఏక కుటుంబములాగా వర్ధిల్లనున్నది. అన్ని భేదములు అంతరింప నున్నవి. అటువంటి మహత్తర పరిణామానికి మీ రచనలన్నీ తోడ్పడవలెనని వేడుతున్నాను. సత్యజ్ఞానానందమయములయిన దివ్య రచన లికమీదనే పుట్టనున్నవని ఇదివరకే చెప్పినాను. ఇట్టిరచనలను మీరు రచించగల్గడానికి సాయం ప్రాతస్సమయములందు ఆర్ద్రార్ద్ర హృదయములతో అన్ని భేదములూ మరచిపోయి సహనీయులతో ఏకమై ఏకమనస్కులై భగవత్ప్రార్థన చేయబూనండి! గాంధి మహాత్ముడు ప్రార్థనమును గూర్చి పదేపదే చేస్తున్న ప్రబోధములను పాటించండి! ఆయన లోకము కన్నులు తెఱపించినాడు! పురుషోత్తముడైన మహాత్ముడు పుట్టినకాలమున మనము పుట్టినాము. ఈ గుణవిశేషమును మనము గుర్తించి వర్తింపగల్గుదుము గాక!

కవివర్యులారా! మిమ్ముగూర్చి "శుచి రగ్నిశ్శుచిః కవిః" అనీ "కవి ర్మనీషీ పరిభూస్స్వయంభూ ర్యాథాతథ్యతోర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యస్సమాభ్యః" అనీ శ్రుతులు వినబడుతున్నవి. ప్రపంచ శ్రేయస్కరముగా మీ ప్రతిభ వెలయగల్గును గాక!

సర్వత్ర సంపద స్సంతు సర్వే సంతు
నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిద్దుఃఖ
మాప్నుయాత్.

# ఆదర్శ దంపతులు

(గత సంచిక తరువాయి)

—కొత్త రామకోటయ్య

[ గురుదేవులు అనేక సందర్భాలలో సెలవిచ్చిన విషయాలన్నీ యధాతధంగా రికార్డుచేయడం జరుగలేదు. తన్మయులై వింటూవున్నవారికి ఆయా విషయాలను కాగితం మీద బరబరా రాయడం కూడా అపచారమే అనిపించేది....అడపాదడపా కొన్ని విషయాలు పొడిపొడి వాక్యాలుగా మాత్రం రికార్డు చేయడం జరిగింది. అలాటి పొడిపొడి వాక్యాలను, ఇతర అనుభవాలను, జ్ఞాపకాలను ఆధారంగా చేసుకొని శ్రీ రామకోటయ్యగారు కావించిన యత్నమే ఈ రచన-సం॥ ]

## శిష్య వాత్సల్యము

తిరుపతిలో ఒకరోజు శిష్యులను ఉద్దేశించి శ్రీ శాస్త్రిగారు, "ఏమిరా। మీచదువు బాగాలేదు, మీ ముఖాలు చూట్టానికి అసహ్యంగా ఉన్నాయి, అవతలకు పొండి. చదువు మీద ఇంత అశ్రద్ధ అయితే మీరింకేమి బాగుపడగలరు? ఎంతో కష్టించి అభ్యాసం చేస్తేనే ముందు మీజీవితంలో రాణిస్తారు. అలారాణించాలని నాఆకాంక్ష. పదిమంది పండితుల మధ్య మీరు కూర్చుండి ప్రకాశించాలని నాకోరిక. ఇలా చదువు సంధ్యలబ్బక పోయిన మీరేమి ప్రకాశిస్తారు?

ఏదోవిధంగా పరీక్షలు ప్యాసు కావటం-ఏదో ఉద్యోగంతో కాలక్షేపం చేయటం, మీ లక్ష్యం కారాదు. మిమ్ములను లక్ష్యంగా పెట్టుకొని ఇతరులు నడిచేలా మీ అంతస్తు పెరిగాలి—అంతేగాని మీకు చదువు చెప్పిన గురువెవరురా? అనేలా మీ రుండ కూడదు. మీ నడవడి కూడ ఇతరులకు మార్గదర్శకమయి ఉండాలి. పొండి. ఆ ప్రెస్సు ప్రూఫులు దిద్డం వగైరా పనులు సరిగా చేయండి." అని శిష్యుల నుద్దేశించి కసురుకొన్నారు........ వారు వారివారి పుస్తకాలతో వెళ్ళి వెలుపలి గదిలో కూర్చుండి ఆ పనులు చూడసాగేరు.

శ్రీ శాస్త్రిగారు కొంతసేపు కనులు మూసికొని కుర్చీలో చేరగిలబడి కూర్చున్నారు. ఓ అరగంట జరిగి పోయినది. అప్పుడు వారు కనులు తెరచి చూచారు. లోలోన కొంత వ్యధ పడుతున్నట్లుగా ముఖం చెప్పుతోంది. శిష్యులేం చేస్తున్నారో నని లేచి వాళ్ళవద్దకు వెళ్లారు. శిష్యులు వారివారి పనులలో మునిగి ఉన్నారు. శ్రీవారు వాళ్ళవద్దకు వెళ్ళి వాళ్ళ మధ్యలో కూర్చున్నారు. "వాళ్ళ మంచి కోసంగా నేను వాళ్ళను కోప్పడ్డాను. వాళ్ళెంత బాధ పడుతున్నారో పాపం!" అని వారు మనస్సులో చాలా బాధపడు చున్నారని వారి మొగమే చెప్పక చెప్పుతూ ఉంది.

"ఏంరా! మిమ్ముల్ని చాలా కష్టపెట్టానురా! నేనేం చేసేది! మీరేదో పైకి రావాలని ఆకాంక్ష. అందువల్ల కోపం వస్తుంది, మిమ్ము బాధిస్తున్నాను, అందుకు

నేనెంతో బాధపడుతున్నాను" అంటూ వాత్సల్యంతో శిష్యుల నొక్కొక్కరి తల నిమిరి వీపు తట్టసాగేరు. శ్రీవారి కనులు చెమ్మగిల్లినాయి. శిష్యులపనీ అలాగే అయిపోయింది. అంతా వారి వారి పనులు ఆపి కూర్చున్నారు.

శ్రీ శాస్త్రిగారు : "ఛా.... ఛా.... ఇదేం బాగా లేదురా! మనం మంచి చేయాలన్నా కొంత చెడు చేస్తేగాని ఆ మంచి లభించడంలేదేమిటి! స్వచ్ఛ మయిన(Pure)మంచి మనలోన ఎప్పుడు కుదుర్కొంటుంది? మనలోని చెడు అంతా పోవాలి. అంతా రెక్టిఫై కావాలి, అప్పటివరకూ యీ డొంక తిరుగుడు వంకరలు కరకుదనం తప్పదనిపిస్తుంది. ఇదంతాపోవాలి. తిన్నదనం, నున్నదనం మనలో వెలయాలి. అలా వెలయాలంటే ఈశ్వర కరుణామృతం మనలో వెల్లివిరియాలి. మనం స్వచ్ఛంగా ఉంటే మన సంకల్పం స్వచ్ఛంగా ఉంటుంది. ఆ సంకల్పం Truth Level లో ప్రవర్తిల్లుతుంది గదా! అందువల్ల మీరు ముందు పని కట్టిపెట్టండి."

ఒక శిష్యుని వంక చూస్తూ "ఒరే! నాలోని ఈ కరుకుదనం అంతా పోయేలా ఒక్కసారి యీడ్చి నా వీపుపై ఒక గుద్దు గుద్దుతావటరా?" అన్నారు. ఆ మాటలకు శిష్యులంతా ఘొల్లున నవ్వసాగేరు. శ్రీ శాస్త్రిగారూ ఆకర్ణాంతంగా నవ్వారు.

శ్రీ శాస్త్రిగారు : "హమ్మయ్యా! మీరు నవ్వుతున్నారు. ఇప్పుడు ఎంతో బరువుదించినట్లు ఉంది. చాలా సంతోషంగా ఉంది. ఇప్పుడు నమస్కారం చేసికొందాము. "మనలో చెడు తొలగాలి. ఈశ్వర కృపచే-సద్వికాసం - ప్రేమామృతం-పొంగి పొరలాలి. ఆధివ్యాధులుడిగి అమృతత్వం అందాలి." "నమస్కారం చేసికొందాము" అన్నారు. అంతా ప్రార్థన చేసుకున్నారు. ప్రార్ధనానంతరం గోష్ఠిలో.

శ్రీ శాస్త్రిగారు : "ఈ శరీరానికి ఆపదలను, మనస్సును ఆవరించే చీకాకులను తొలగించు తండ్రీ" అని కోరుకొనే దెందుకు? అయితే; ఈ శరీరం ఇతరుల కపకారాన్ని కలిగించుటకా? కాదు చుట్టూనున్న వారందరకూ ఏదో ఉపకారం జరుగుటకే. మనము పొందే ఆనందమును ప్రేమను మన చుట్టూ వెదజల్లుటకే. ప్రక్కవారికి (సేవ) సర్వీసు చేయుటవల్లనే మనకు శాంతి చేకూరుతుంది, సౌఖ్యము కలుగుతుంది" అన్నారు.

ఆ ప్రబోధంతో శిష్యులందరిలోనూ నూతన కాంతి వెల్లివిరిసింది. శ్రీవారి వాత్సల్యము

## మనము-మనలైను

దాదాపు ఇరువది రెండేండ్ల క్రితం గురుపాదులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తాము తిరుపతినుండి బాపట్లకు రానున్నట్లు-నన్ను అక్కడకు వచ్చి కలుసుకోవలసిందిగా జాబువ్రాసిరి. జాబు చూచుకొని నేను ఇంకా ఇరువురు యోగమిత్రులమూ బాపట్ల వెళ్ళితిమి. శ్రీశాస్త్రిగారిని రైల్వేస్టేషనులోనే కలసికొంటిమి. వారికొరకై బాపట్ల యోగమిత్రులు శ్రీ బ్రహ్మాండం కుటుంబరావుగారు వగైరాలు కొందరు స్టేషనుకు వచ్చిరి. వారు మమ్ములనందరనూ ఆప్యాయతతో ఆహ్వానించి శ్రీ శాస్త్రిగారితోబాటు శ్రీ వెలగపూడి సుబ్బారావు పంతులుగారి (యోగమీడియమ్) ఇంటికి తోడ్కొని వెళ్ళిరి. అచ్చట ఉదయం ప్రార్థనలో పాతికమంది పాల్గొంటిమి. ప్రార్థనానంతరము యోగసంభాషణ కొంత సమయము జరిగినది. "న్యూయోగాలైన్"ను గురించి శ్రీ శాస్త్రిగారికి రెండు విషయములలో చాలా పట్టుదల గలదు.

ఆ రెండు విషయములపై జరిగిన గోష్ఠిలో శ్రీ కుటుంబరావుగార్కి శ్రీ శాస్త్రిగారికి తీవ్ర వాదము జరిగెను. ఆసంభాషణను శ్రీ శాస్త్రిగారే ఆరంభించిరి.

శ్రీ శాస్త్రిగారు :- ఏమండీ! కుటుంబరావు గారూ మీరు మనలైన్ - అనగా - భృక్తరహిత తారక రాజయోగములోని సాధకులను మందులు సేవించ వచ్చునంటున్నారట, ఏవేవో చిన్న చిన్న జబ్బులు బాధలు రాగానే మనం ఒక డాక్టరు నాశ్రయించుటా! మనము శ్రీ మాష్టరు (C.V.V) ని ఆశ్రయించినాము. శ్రీవారన్నిటికీ చాలిన మహాపురుషులు, మనం సంపూర్ణవిశ్వాసంతో, దృఢసంకల్పంతో ముందుకుసాగాలి. శ్రీవారి చరణకమలముల నాశ్రయించిన మనకు ఇంకొక సాయమెందులకు?

శ్రీ కుటుంబరావుగారు :- అవునండీ! మందు గూడ పుచ్చుకొనవచ్చుననే నాభావం. అందేమీ తప్పులేదు. మనలైన్ (నవీనయోగము) అమృతత్వమును సత్యసందర్శనమును కలిగించే మహత్తర యోగము. ఇది తలనొప్పి కాల్నొప్పి యోగంగాదు. మంత్రమూగాదు. అట్టి చిన్న వానికై కాలాన్ని భావాన్ని వెచ్చించ కూడదు. ఏదో ఒక మాత్రవేస్తే జ్వరంపోతుంది గదా! దానికి మనము ఇంతచిక్కుపడనేల! మనకాలాన్ని ట్రీట్‌మెంట్లకు వ్యర్థపరచక యోగానుష్ఠానమునకు వినియోగించాలి— అని తమ అభిప్రాయాన్నిగట్టిగానే వెలువరించిరి.

శ్రీ శాస్త్రిగారు :- కంటినొప్పి, కాల్నొప్పి, కడుపునొప్పి, జ్వరాలనే ఆపజాలని వారము మృత్యువు నెట్లా ఆపగలమయ్యా? శ్రీ మాష్టర్ అనే డాక్టరొకరే! మనకింకెవరూ అక్కరలేదు. మనమీ దివ్యమార్గమున చేరినాము. సాధన కొనసాగిస్తున్నాము. మనలో శ్రీ మాష్టర్ యెడల ప్రపత్తి పెరగాలి, వ్యాధులూ బాధలూ మనకు ఎడంగా పారిపోవాలి, మన దరిదాపులకే రాకూడదు. వచ్చినా నిలువకూడదు, అట్టి స్థిరసంకల్పం మనం 'డెవలప్' చేసికోవాలి, ఒక దానికి జంకి మెత్తబడిన అన్నింటికీ జంకవలయునుగదా! అప్పుడవి విజృంభించి మనలను వెంటాడతాయి. మనకేం భయం? శ్రీ మాష్టర్ గారి Pure love Principle గదా మనలో పనిచేసి మనలను నవ్యమార్గమున నడిపించేది. మనకేగాదు మనచుట్టూ ఉన్నవారిలోనూ ఎలాటిబాధలు వ్యాధులు రాకూడదు సుమా! అలాటి సంకల్పంతో మన యోగసాధన జరగాలి— అనిరి.

శ్రీ కుటుంబరావుగారు : అవును స్వామీ! శ్రీ మాష్టర్‌గారి దివ్యశక్తి అన్నిటికీ చాలింది. అందేమీ సందేహం లేదు. మీరు చెప్పినదాంతో నేనూ ఏకీభవిస్తాను. కానీ శ్రీ మాష్టర్‌గారే మందు పుచ్చుకొనండి ఫరవాలేదు. అన్నారటగదా! శ్రీ సుబ్బారావు అన్నగారిని మందు వాడవచ్చునని శ్రీ మాష్టరుగారే పర్మిషనిచ్చారటగదా! అదిగో వారిచటనే ఉన్నారు గదా! అడగండి.

శ్రీ శాస్త్రిగారు: అవునండీ! పుచ్చుకొమ్మన్నారు. నేనెరుగుదును. అలా చాలా మందికి పర్మిషను యిచ్చేవారు శ్రీవారు. అందులకు కారణం ఉంది. ఆ వచ్చిన సాధకుని శరీరస్థితిని బట్టిన్నీ—మానసిక స్థితిని బట్టిన్నీ-అతడుండే పరిసరాలు వ్యక్తులనుబట్టీ కూడ—ఆ యా సాధకులకు తగ్గ తాత్కాలిక నివారణోపాయములంగీకరించేవారు. అంతే; ముఖ్యంగా సాధకుని మనస్సు ఇంకా మందులపై వున్నపుడది ఎరిగే సాధకునికి యీ లైనుపై యింకా పూర్తి విశ్వాసం కుదరలేదని వారు గ్రహించిన వారి విషయంలోనూ శ్రీవారు పర్మిషను ఇచ్చేవారు. "ఇక మనకీ మందు లక్కరలేదు." అనే అనుభూతి ఆ సాధకునిలో వచ్చేవరకే యీ తీరు. ఆ తరువాత

సాధకుడే "నాకేమీ ఈ మందు మాకు లక్కరలేదు అంతా శ్రీ మాష్టరే!" అనే స్థితికి వచ్చేవాడు. సాధన పెరిగిన కొలది సాధకులలో అలాటి పరిణామం రావాలి. "అదే దాని పద్ధతి." "మందులు పుచ్చుకొనే మందులతో నిండియుండెడిది వైద్యశాల అవునుగాని యోగశాల కానేరదు. యోగసిద్ధిగాదు. మనలోని కరుణయే ఈశ్వరత. ఆ కరుణరసము మనలను మన చుట్టునున్న వారినీ ఉద్ధరించగలదు. అసలు ఈ ఓషధులకే శక్తినిచ్చిన ఆ ఆదినే (Origin) (M.T.A.) మన ముపాసిస్తున్నాము గదా! ఇంకా ఈ ఓషధులను ఆశ్రయించనేల? ఎవరంతట వారమే, మనకు మనముగా లోనుండి ఆ దివ్యత నుద్దీపింప జేసికొనే వ్యక్తులమై శ్రీవారి కృపవల్ల స్టాండు గావాలండీ!" అనిరి.

శ్రీ కుటుంబరావుగారు : అట్లయిన మనమిహ యోగసాధనమాని అచ్చంగా జబ్బులు కుదిర్చే గొడవలో పడిపోతాము. యోగశాల ఆస్పత్రిగా మారును గదా! మన సాధన ఏకాగ్రంగా జరిగేదెట్లా? ఆ వర్కింగ్‌కు భంగం కలుగదా?

శ్రీ శాస్త్రిగారి : ఓహో! అదా! మీ భయం, అలా అడగండి. చెప్తా, మననుండే ప్రేమను ఆనందమునూ అంతటా అందరకూ పంచి ఇచ్చుటలోనే మనలైనుయొక్క వికాసము, యోగసాధనా ఫలమును పొందుటయు నిమిడియున్నవి. ఈ విధాన మవలంబించుటచే మనమింకా ఎక్కువగా యోగోన్ముఖులము కాగలము. ఇతర వ్యాపకములకు, వ్యాసంగముల కవకాశము ఉండదు. మన భావములు - ఆలోచనలు - చేతలు - అనుభూతులూ - అన్నియూ-అంతయూ యోగగతం యోగమయం కాగలవు. సర్వేసర్వత్రా శ్రీ మాష్టర్‌గారితో మనకప్పుడు అనుసంధానము ఏర్పడును. అందువలన మనమంతా స్వీయ కర్తృత్వాన్ని వీడి భారమంతా శ్రీ మాష్టరుపై నిడి నిర్భీతితో దృఢంగా యోగాప్రాక్టీసు చేయాలి. మనం మాష్టరునే పిలుద్దాం. ఇంకెవరినో ఆశ్రయించవలసిన అవసరం మనకేమీ ఉండదు" అనిరి.

శ్రీ శాస్త్రిగారి ఈ విపులీకరణ విన్న యోగమిత్రులు తమ సందేహములకు సమాధానములు లభ్యపడినవని తనివి జెందిరి. తరువాత ఇతర యోగమిత్రులు వారి వారి యోగానుభూతులు వివరించి వర్ణించిరి.

భోజన సమయమయింది. అచ్చట నాతో ఇంకా యిరువురు బ్రాహ్మణేతరులైన యోగసాధకులుండిరి. మా ముగ్గురకు వేరుగా ఒక గదిలో భోజనపు టేర్పాటులు గావింపబడినవి. మిగిలిన వారందరకూ హాలులో ఏర్పాటుచేసిరి. వేరుపాటు విషయము శ్రీ శాస్త్రిగారు గుర్తించి అడిగి తెలుసుకొనిరి. వెంటనే ఆయన "సరే! నేను వర్ణవివక్షతను జాతిభేదములను పాటించే మనిషిని కాను. నేనూ వెళ్ళి గదిలో వారితోపాటే కూర్చుండి భోజనము చేస్తాను. నాకూ అక్కడే వారి సహపంక్తినే ఏర్పాటు చేయండి." అన్నారు. ఆ మాటలకు అక్కడి వారిలో కొందరు నిశ్చేష్టులై ఒకరి మొగాలొకరు చూచుకున్నారు. అంతలోనే కొందరు "అయ్యో తమరు లేకుండానా? పంక్తిలో.........." అన్నారు.

చివరకు ఆచార పరాయణుల మనుకొనే మడిగా ఉండేవారిని నలుగురను ఆగదిలోనికి పంపి మిగతా అందరమూ శ్రీ శాస్త్రిగారి సరసన హాలులో భుజించితిమి. ఇట్టివిశేష మింకొకప్పుడు తిరుపతిలో శ్రీవారి ఇంటనే జరిగినది. శ్రీ శాస్త్రిగారి దర్శనార్థము ఒక రోజున ఒక కవిగారు వచ్చిరి. వారు చాలా చక్కని కావ్యమును వ్రాసితెచ్చిరి. వారు చాలాబాగా చదువుకున్న పూర్వాచార పరాయణులు. వారు కావ్యమును మంచి చక్కని గొంతుతో బాగుగా చదివి వినిపిం

చిరి. విని శ్రీ శాస్త్రిగారు చాలా సంతోషించిరి. నాయనా ! మీకావ్యము చాలా సొంపుగా నున్నది. ధారాశుద్ధి కలిగి కరుణరస మొలికించు చున్నది. మీరు చదివే పద్ధతికూడా ఎంతో ఆకర్షణీయముగా నున్నది. మా గురువుగారు చెళ్ళపిళ్ళవారు మోహన రాగ ఫణితిలో జగన్మోహనంగా పద్యములు పాడే వారు, వారి శిష్యులలో పద్యములు చక్కగా రంజక ముగా చదువుట అబ్బినివాడను నేనొక్కడనే. మీరు చదివే విధానము బాగున్నది. చాలా సంతోషము. మనమిక లేద్దామా ! మీరు త్వరగా స్నానము చేయండి, నేనూ స్నానము పూర్తిచేస్తాను. నాకెలాటి భేదములేదు. నేను వారితోకలసి ఇచటనే భోజనము చేస్తాను. మీకు నచ్చకపోతే వంటఇంట్లో వేరుగా మడిగా భోజనము చేయండి.

కవిగారు : "మీరు మహాయోగ పురుషులు, 'మీరు మెట్టిన యెడ ప్రయాగ' అన్నారు. మహ యోగులున్నచోట సర్వతీర్థములు వెలుగొందునని పెద్దలు చెప్పుదురు. కనుక నాకు ఎట్టి యాక్షేపణ యున్నూ లేదు తమతో కలసి భోజనము చేయు దును."

శ్రీశాస్త్రిగారు : ఓరే ! ఖాదరూ ! నీవుకూడ ఇక్కడే భోజనము చేయరా ! అన్నారు. ఆకవిగారు కొంచెము సంకట పడసాగిరి. హిందువులయితే ఎవరితోనైనా కలసి భోజనము చేయుట కాయనగారు సంసిద్ధులయిరి. కాని ఇది ఏమిటి ? సాయబుగారి పంక్తినాయని అనుకొనుచుండిరి కాబోలును. శ్రీ శాస్త్రిగారు నవ్వుచూ ఇట్లనిరి.

"ఈ ఖాదరు చాలా మంచివాడు. తెలుగులో మంచి ఆసక్తి (పాండిత్యము) కలవాడు. వాడిక్కడ మాట్లాడినప్పుడు మీరతనిని మాటలను బట్టిగాని ప్రవర్తనను ఆకారమును బట్టిగాని సాయబని అనుకొన వీలుండదు. చాలా మంచి ప్రవర్తన, మాటతీరు గలవాడు. నాకు హిందువులు మహమ్మదీయులు అన్న భేదముకూడా లేదు. అంతయు బ్రహ్మస్వరూపమే." అప్పటికి కవి గారు కొంతతేరుకొనిరి. సర్వతీర్థములు యోగీశ్వ రుల సన్నిధిలో వెలుగొందునని తామే అంతకు ముందు అనిరి. ఇప్పుడొక సాయబుగారు ఉన్నంత మాత్రమున తీర్థములన్నియు చక్కపోయినవనుట కుదరలేదు. అంతయూ బ్రహ్మస్వరూపము కాదను టకు వీలుచిక్కలేదు. కాన కవిగారొక నిశ్చయము నకు వచ్చిరి.

కవిగారు ; "తమ సన్నిధి పరమ పవిత్రమైనది. నాకెలాటి సందేహమూ ఇప్పుడులేదు. జ్ఞానోదయ మైనది. మీతో కలసి కూర్చుండి భోజనము చేయు దును" అనిరి. శ్రీశాస్త్రిగారి ముఖము ఆనంద ముతో నిండిపోయినది.

శ్రీశాస్త్రిగారు తాము నమ్మిన వానిని ఆచరించు టలో అంతర్వాణి ఉద్బోధము ననుసరించుటలో త్రికరణ శుద్ధిగానుండెడువారు. ఆచరణలో శ్రీశాస్త్రి గారికి ఎట్టి జంకూ ఉండెడిదికాదు. వారి నడవడిక మనలైనకూ, మనకూ కూడ మార్గదర్శకము.

(సశేషం)

# గాంధిరామాయణం
## సంకలనం

[ గత సంచిక తరువాయి ]

["ముద్దుమాటలు" అనే శీర్షికన ముట్నూరి కృష్ణారావు గారి సంపాదకత్వంలో వెలువడుతుండిన కృష్ణాపత్రిక (1933— జూన్ 17వ తేదీ సంచిక)లో ఈ దిగువఅనుభూతి అక్షరరూపాన అచ్చుపడింది.

"చంటిపిల్లల భావగర్భితములైన వచ్చీరాని మాటలు ప్రతి మాతృహృదయ ఫలకమునను అంకితములై యుండును. మహాత్ముని ఉపవాస దీక్ష సందర్భమున నొక బాలిక తల్లినీరీతిని ప్రశ్నించెను.

"అమ్మా : బాపూ ఉపవాసంలో చచ్చిపోతే స్వర్గంలో దేవుడి దగ్గరకు పోతాడు కదూ : చాలా బాగుంటుంది కాదమ్మా ! హాయిగా ఉండవచ్చు. స్వర్గంలో జైళ్లు ఉండవు. తిప్పలు పెట్టడానికి సర్కారు వారుండరు కాదూ అమ్మా !"

నాడు బాపూ ఉపవాస వార్తవినే తల్లడిల్లి పోయింది ఆ పసిదాని హృదయం : ఆయన్ని పోగొట్టుకున్ననాడు దేశం ఇంకా ఎంతగా పరితపించి ఉడికి పోయిందోమరి :

గురుదేవులు సంకల్పించి సంధానించిన ఈ "గాంధి రామాయణ" సంకలనంలో అట్టి అనుతాపాన్ని పరికించి పరితలు అనుభూతికి తెచ్చుకోవచ్చును.— సం॥]

### గాంధి మహాత్ముడు-జీవితాశయము

గాంధి మహాత్ముడు సిద్ధసంకల్పుడు. ఆయన తలపెట్టిన కార్యాలన్నీ అమోఘంగా నెరవేరినవి. ఇతరులు కొన్ని తరాలలో సాధించలేని మహత్కార్యాలు తన జీవితకాలంలోనే ఆయన నెరవేర్చ గలిగాడు. నూలువాడకడం, ఖద్దరు కట్టడం, అస్పృశ్యత పాటించకపోవడం, త్రాగుడు మానడం, వృత్తులుమాని జైళ్లకు పోవడం మొదలైన అల్పంగా కనపడే ఘనకార్యాలను సామాన్యప్రజలచేత విద్యాధికులమనుకునే వారిచేత ఒక్కతీరుగా పెద్దపెట్టున ఇతరులకు సాధ్యపడని రీతిలో చేయించాడు. సమకాలిక ప్రజానీకంలో అపూర్వమైన ఒక గొప్ప హృదయ పరివర్తనకు కారకుడైనాడు. తన జీవిత విధానంవల్ల వారికి నైతిక దృక్పథము నలవరిచి నియమబద్ధులజేసి తమ ప్రవర్తన సరిదిద్దుకొనుటకు మార్గదర్శకుడైనాడు. దృఢవ్రతుడై సత్యాహింసా సూత్రముల రాజకీయములం దపూర్వ పద్ధతిని ప్రయోగించి దక్షిణాఫ్రికాలోను స్వదేశమందును విజయముల సాధించినాడు. ఇంతేగాక శతాబ్దముల

పారతంత్ర్యముచే క్రుంగి నిర్వీర్యులైన భారతీయుల నుజ్జీవింపజేసి వారికి రాజకీయస్వాతంత్ర్యము కరతలామలకము చేసినాడు.

అంతర్వాణి ప్రేరితుడై లోకహితకార్యముల నతడు పూన్కితోసాగించి సిద్ధసంకల్పుడైనాడు. నూట ఇరువది సంవత్సరములు జీవించి సేవచేసెద నని అనేక సందర్భములలో తన యాశయము నతడు వ్రాక్రుచ్చినాడు. ఇతడు స్వదేశమునకు రాజకీయ స్వాతంత్ర్యము సంపాదించుటతో తృప్తిపడక సత్యాహింసలు లోకమున నెలకొల్పుటకు కృషి చేయుచు పైగడువువరకేగాక సేవాసక్తితో అటు పిమ్మటకూడ నింకను జీవించుచు ప్రపంచమానవుల నాత్మతుల్యుల జేసి నిజమగు సంపూర్ణ స్వాతంత్ర్యమునకు (Complete Inedpendence) త్రోవ చూపి లోక కల్యాణమును చేకూర్చి కృతకృత్యుడగునని నేనాయనమీద కొండంతఆశ పెట్టుకొని యుంటిని.

నూట ఇరువది సంవత్సరాలు జీవించాలని కోరి జీవించడం! సాధ్యమౌతుందో కాదో! అన్ని సంకల్పాలు ఒక ఎత్తు! ఇది ఒక ఎత్తు! లోకంలో అనేక మహత్కార్యాలను సాధించిన వాడికి తన జీవితం 120 సంవత్సరాలకు పొడిగించుకోవడం అసాధ్యమా? ఆయన నియమబద్ధుడు. మితము తప్పని ఆహార విహారాదులు, కామక్రోధాది ఉద్రేకాలకు పాల్పడనిప్రసన్నమైన మనస్సు కలవాడు. జయాపజయాలకు క్రుంగు పొంగు ఎరుగని లోకసేవాతత్పరుడు. కర్మయోగి. భిషగ్వరులకు ఆరోగ్యమూలసూత్రము 'రామనామము' బోధించిన తత్వజ్ఞుడు! ఆయన సంకల్పిస్తే 120 సంవత్సరాలు జీవించడం బ్రహ్మాండం కాదు. అయితే ఆయనది వజ్రకాయంకాదుగదా! ఒంటరిగా నున్నపుడు ఏ నౌకాలీవంటిచోటనో ఆయన వెళ్ళదలచిన పాకిస్తాన్ లోనో ద్వేషిఎవడైనా ఏ బాంబునో ఆయనమీద వేలిస్తే ఏమికావాలి! అట్టి సంఘటన అసంభవం. ఆయనకు అపాయం తలపెట్టే మనుష్యుడుంటాడా? ఆయన ఏ కోశంలోను ఎవ్వరికి అపకారం తలచినవాడుకాడు. ఆయన అజాతశత్రుడు. కనుక ఆయన 120 సంవత్సరాలు జీవించడం తప్పక జరుగుతుంది అని నాలో నేను తర్జనభర్జనపడి నిర్ధారణ చేసుకున్నాను.

మనకు పరమప్రియులగు వారి మరణమును గూర్చి తలపులప్పుడప్పుడు మనస్సుకు తట్టుతూ వుండడం, తోడనే బుద్ధిని ఇతర విషయాలమీదికి మరల్చి ఆ తలంపులను బహిష్కరించడం అందరికీ అనుభవమే. గాంధిగారిని గూర్చికూడ అప్పుడప్పుడు అట్టి తలపులు కలుగగా ఆ వెగటు తలపులను బహిష్కరించుచుంటిని. ఆయన పోతే లోకం గతి ఏమిటి? అనిపిస్తూ వుండేది. ఆయన ఎల్లపుడు జీవిస్తూ వుండవలెనను కోరిక ఆయన మాటలవలన అట్లు తప్పక జరుగునను నమ్మకముగ పరిణమించి నాలో కుదుర్కొన్నది. తన 120 సంవత్సరముల జీవితంలో భారతదేశము ప్రపంచమునకు సత్యము అహింస అను జంట దివ్వెలతో సామరస్యమార్గమును చూపి సర్వథా మార్గదర్శియై వెలయునట్లు చేయగలడను విశ్వాసము నాలో ఇనుమడించెను. అనుదినము, రేడియో, వార్తాపత్రికలు మొదలగు వానివల్ల ఆయన కార్యకలాపమును, ప్రార్థనా సమయములో పల్కుచుండు సుభాషితములను, అంతర్వాణి ప్రేరితుడై ఎప్పుడే మహత్కార్యమునకు కడంగునోయని శ్రద్ధతో గమనించుచుంటిని.

నౌకాలి, బీహారు, పంజాబు మొదలగు చోట్ల జరిగిన విషాద సంఘటనలు, తరువాత ఆయన జీవితము గూర్చి నిరుత్సాహము వెలిబుచ్చినపుడు, తన మరణమునుగూర్చి మాట్లాడినపుడు ఇదేమని కొంత మనస్సుకు సంకోచము కలుగుచుండెను. 1948 జనవరి 20 వ తేదీన డిల్లీలో ప్రార్థనా

సమయమున జరిగిన బాంబు ప్రేలుడును గూర్చి మరు నాడు ప్రార్ధనానంతరం ఆయన పల్కిన పలుకులు కొంత ఉత్తేజకరిముగానున్నను నాకొకవిధముగ నిరుత్సాహమును కూడ కలుగచేసెను. తన ప్రాణములు భగవంతుని చేతులలో నున్నవని తానుమరిణించుటయే ఫగదిచ్చయైనహా నిర్భయ ముగ దాని నెదుర్కొనెదననియు, ఎవరైనను తన్ను చంపినచో హంతకుని మీద ద్వేషమేమాత్రము లేక చిరునవ్వుతో ప్రాణములు వదలినప్పుడు తన్న భినందించవచ్చుననియు నతడు చెప్పెను. తన మరణమును గూర్చి పలికినందుకు నిరుత్సాహము కలిగినను ఆ పల్కులు కొద్దిరోజులలో జరుగబోవు దానికి సూచకములుగా మాత్రము నాకుతోచలేదు. ఇట్టిబాంబు ప్రేలుడు పూనాలో లోగడనొక సారి సంభ వించెను. దానివంటిదే ఇది. ఇట్టివానివల్ల అపాయ మాయనకురాదని తోచెను. జనవరి 26వ తేదీ ౧స్ ఎక్స్ప్రెస్ పత్రిక మొదటి పేజీలో 'The saint and the tiger' అను క్రింద జాతి విద్వేషమను వ్యాఘ్రము ధిక్కార భావముతో క్రూరపుచూపు నిగుడ్చుచు మోదుటకు సిద్ధముగ పంజాగోళ్ళనుతెరచి తలయెత్తి చూచు చుండుట దానిముందు మిక్కిలి సమీపమున నిర్భయంగా కూర్చుని శుష్కశరీరిగాంధీ ఉపవాస ప్రయోజనము బోధించుచుండుట చిత్రింపబడి యుండుట చూచితిని. ఆవ్యాఘ్రము గాంధిని చావమోదుట తథ్యమని ఆచిత్రము స్ఫురింప జేయుచున్నను ఆవ్యాఘ్రము క్రమముగ మచ్చికయై పెంపుడు పిల్లివలె మారికూడదాఅని తలచితిని.

నాల్గురోజులు గడచినవి. ఇకతెల్లవారితే జనవరి 30వతేదీ తెల్లవారుజామున 4—30కి మామూలుగా మెలకువ వచ్చినది ఇంటి ప్రక్క మిద్దె మీద నుండి బ్రహ్మంగారితత్వాలు ఎవరో బిగ్గరగా పాడడం వినబడ్డది. ఆపాట మొదట కొంత శ్రావ్యంగానే వుండెను గాని రానురాను కొంత సేపటికి ఆరున్నొక్కరాగంలోకి దిగింది. క్రమంగా అది ముదిరింది. నిశ్శబ్దంగావున్న తెల్లవారుజాము: షుమారు ఒక పర్లాంగు దాకా వెక్కి వెక్కి ఏడ్వడం వినబడ్డది. బహు అసహ్యముగా నుండెను. పిట్టలు కూతలు మొదలుపెట్టేసరికి ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లినట్లు స్వరం క్రమంగా తగ్గింది. నిద్రమంచమునుండి లేవక ముందే ఈ రోజు ఈ రోదనం వినబడ్డ దేమిట్రా అని మనస్సుకు చీకాకు కలిగింది తెల్లవారిన తరువాత కూడ కలవరంతగ్గలేదు. ఏడ్చిన మనిషి కనబడ్డాడు. గడ్డం మీసాలు పెంచాడు. షుమారు 45 సంవత్సరముల బ్రహ్మచారి. బ్రహ్మంగారి సాంప్రదాయంలో వాడట. పోతులూరయ్యకోసం అట్లా ఏడుస్తూ ఆయన రాకకు ఎదురుచూస్తూ ఉంటాడట. మొత్తం మీద నాకారోజంతా మనస్సు చీకాకుగానే వుంది.

సాయంకాలంపార్కుకువెళ్లాను. వెంటనే తెలుగు వార్తలు విషాదసూచక ధ్వనితో మొదలుపెట్టి ఆంధ్ర దేశానికి భారతావనికి ప్రపంచానికి ఒక విషాదవార్త అనేసరికి ఏమి మూడిందోనని ప్రాణం చిక్కబట్టు కుని నిలబడ్డాడు. గాంధి మహాత్ముని పేరు విన బడ్డది. నన్నునేను నమ్మలేక పోయినాను ఒళ్లు తెలియలేదని చెప్పవచ్చును. ఏమైనా ఇంకా ఆశ వున్నదంటాదేమోనని చివరిదాకా నిట్టూర్పుతో నిలు చున్నాను. గాంధిగారి జీవితాన్ని గురించి ఏదోకొంత చెప్పారు. ఆ సమయంలో అదివినడానికి ఓపిక లేక పోయింది. అది అప్రస్తుతంగా కనబడ్డది. వెంటనే కాళ్లీడ్చుకుంటూ ఇంటిముఖం పట్టాను.

ఈ సంగతి ఇంట్లో ఎట్లాచెప్పను: సాయం కాలం చీకటిపడుతోంది. పిల్లలంతా అప్పుడే అన్నా నికి కూర్చున్నారు. నా భార్య వడ్డిస్తోంది. మనస్సు ఆగలేదు. వాళ్ళ ఎదుట తలవంచుకొని పంకిస్తూ అటూ ఇటూ తిరుగుతూ ఉహు - ఉహు అన్నా

నేమో : జ్ఞాపకంలేదు బాగా. వాళ్ళదిచూసి ఏమిటి! ఏమిటి! అన్నారు. 'ఏమని చెప్పను' అని నిదానించి 'గాంధి మహాత్మణ్ణి ఎవరో కాల్చిచంపారట' అన్నాను. మా పెద్దబ్బాయి ఉత్తి అభాంత్రామనిషి. "అమ్మయ్యో! అమ్మయ్యో! అంటూ ఏడుస్తూ అన్నముందునుండి లేచి గుండెలు కొట్టుకోవడం మొదలుపెట్టాడు. చిన్నవాడు 5 ఏండ్లవాడు అన్నం తినడంమాని తెల్లబోయి చూడడం మొదలుపెట్టాడు. మా ఆవిడ కొన్నిక్షణాలు నిర్ఘాంతపోయి 'వాడికి చేతులెట్టావచ్చినయ్యో'నని కండ్లు తుడుచుకోడం మొదలుపెట్టింది. మా అమ్మాయి మంజుళ ఏడ్వడం సాగించింది. 'అది దైవసంకల్పం. లేకపోతే ఇట్లు జరుగుటకు వీలులేదు. వాడు నిమిత్తమాత్రుడు వాణ్ణి అనవలసిన పనిలేదు' అని ఏమేమో చెప్పి ఊరడించాను.

ఆ రాత్రి భోజనం లేదు. ఇల్లంతా దోబుచ్చిగా వుండి పోయింది. మధ్య మధ్య గుండె ఝల్లు మంటుంది. ఏమి తోచదు. రాత్రంతా కలతనిద్ర. కొంతసేపు నిద్రపట్టడం, ఉలిక్కిపడి లేవడం. ఏమేమో పిచ్చి పిచ్చి ఆలోచనలు. మళ్లా నిద్ర. రాత్రంతా ఎట్లాగో గడచింది. బ్రహ్మంగారి శిష్యుడు తెల్లవారుజామున క్రిందటి రోజువలెనే మళ్లీ రోదనం సాగించాడు. అతడు బిగ్గరగాను, నేను మనస్సులోను ఈ సారి! తెల్లవారిన తరువాత బయటకి వచ్చాను. ఇంటికి నిండైన యజమానిశవాన్ని తీసుకుపోయిన వెంటనే ఇల్లు ఎట్టా బావురుమంటూ వుంటుందో అట్టా కనపడ్డది లోకమంతా. నెత్తిన గుడ్డలు వేసుకుని దీనపు చూపులతో అధోముఖులై రేడియోలదగ్గర గుంపులు గుంపులుగా జనం! ఉదయం నుండి అస్తమయందాకా వేరే ఏపనీ లేదు. రేడియో వార్తలు వినడంలోనే కాలంవెళ్ళిపోయింది. రాజఘట్టంలో శవదహనం చేసినట్లు చెప్పేవరకు శ్రద్ధగా రేడియో రన్నింగు కామెంటరీ విన్నాను. అంతవరకు గాంధిగారు మళ్ళీ ప్రాణంతో లేచాడనే వార్త వస్తుందేమో అని భ్రమ! ఆ రోజంతా తిండి లేదు ఇంట్లో ఎవరికీ.

సృష్టిలో ఇంతవరకు ఏ వ్యక్తికొరకైనా సమకాలిక ప్రపంచ జనం ఎప్పుడైనా ఈ తీరుగా ఒక్కసారి ఆవటించారా! ఇప్పుడిట్లెందుకు జరిగిందో! ఆయన సంకల్పించినట్లు—కాదు ఆయన వాంఛించినట్లు 120 సంవత్సరాలైనా బ్రతకకుండా ఈ విధంగా జరిగిందేమీ? ఆయన కోరిక ఎందుకు నెరవేరలేదు? దృఢసంకల్పంతో ఎందుకాయన నిల్వ త్రొక్కుకోలేదు? నా బ్రతుకు భగవంతుని చేతుల్లో వున్నదన్నాడు! నిర్మలకాంతుల చిమ్ము ఆశాజ్యోతి గప్పున మలపబడ్డట్లైంది. రెండువేల సంవత్సరముల నాటి సంఘటన మళ్ళీ కళ్ళకు కట్టినట్లయింది. అహంభావము, మూర్ఖము, అసూయ, ద్వేషము, పశుత్వము మనుష్యునిలో పాదుకొని నిలచిపోయినవా? మానవుడు పురోగమించుట లేదా? అని సందేహం కలుగులోంది.

చీకట్లలముకొన్నవి. అవిశ్వాసం, వంచన ప్రబలంగా గోచరించుచున్నవి. అన్నిటికంటె ప్రాణము చవుకయైనది. మారణయత్నాలు నల్లేరుమీద బండి వలె నిరాఘాటంగా సాగుచున్నవి. ఆటంబాంబు చాలక విపరీత ధనవ్యయంతో హైడ్రొజన్ బాంబు తయారు చేయిస్తున్నాడు శాంతికాముడు ట్రూమన్.

త్యాగమూర్తి బుద్ధభగవానుడు లోక బాధా నివారణకు తన జీవితము ధారపోసినాడు. సేవాతత్పరుడు ఏసుప్రభువు ప్రేమ సందేశమిచ్చుచు అసువుల కోల్పోయినాడు. ఈ ఇరువురి యుపదేశ సారోద్ధారమగు సత్యాహింసా సామరస్యములతో జీవితాశయ సిద్ధికొరకు యత్నించుచు నిష్క్రమించాడిప్పుడు గాంధి మహాత్ముడు. అభ్యుదయ మార్గమున అడుగడుక్కీ భంగపాటుతో అంగలారుస్తోంది మానవ

జాతి. ఈ అనుభవాలిట్లు చర్విత చర్వణం అవుతూ వుండవలసినదేనా? ఇది ఎందాకా? మానవజీవితాశయం ఎన్నటికీ ఫలించదా? ఈ ప్రశ్నలు పదేపదే తీవ్రంగా ఎదుర్కొంటున్నవి కాని ఎన్ని అనుభవాలైనా జీవితాశయం మాత్రం సుస్థిరంగా ఒక్కతీరున ఎదుట కనబడుతోంది. ఆశ నిరాశ కాలేదు. కాదు. అది ఎన్నటికైనా సిద్ధించవలసిందే. మానవుడింకను అర్హత సంపాదించవలసి యున్నాడేమో!

గాంధి మహాత్ముని జీవితజ్యోతి మనకు వెలుగు నిచ్చి అర్హత చేకూర్చుగాక!

—డా॥ వేటూరి చంద్రశేఖరశాస్త్రి

 

అసమాన శక్తిసంపన్నులైన నెపోలియన్, హిట్లరు మొదలగువారు బలపరాక్రమములచేత పురోగమించి తిరోహితులైరేతప్ప సాధించి నిల్పిన దేదీలేదు. గాంధీమహాత్ముడు సాధించినది ఒక్కటే విశ్వమానవత్వము. యింతేకాదు మానసికశక్తి ప్రకృతిశక్తుల కంటె బలవత్తరమైనదని తన జీవితమున అతడు నిరూపించినాడు. ఈయన విశ్వమానవ ప్రేమమూర్తి. ఇంగ్లండులో వెస్టుమినిస్టరుఎబ్బేపై బాంబులు పడినపుడు తనకంట బోటబోట నీరు కార్చెను. మహాత్మునిలో ఒక విశిష్టగుణము కలదు. ఆయన మానవులకు మానవత్వమే ప్రమాణమనును. మహాత్ముడు నిలిపిన సంస్థలన్నిటికి మానవత్వమే ప్రమాణము. హిందుమహమ్మదీయ ఐక్యము, రాట్నముతో నూలువడకుట, హరిజనోద్ధరణ, దరిద్ర నారాయణుని సేవ- మహాత్ముని జీవితము విశ్వమునకెల్ల ఐహికాముష్మిక సాధకమైనది.

తన్నీరు వెంకటరామారావు

S.S.L.C. ఆలపాడు, 23-1-50

 

# 6

గాంధీజీ పుట్టిననాటినుంచి గిట్టేనాటివరకు మన దేశంలో మనకోసం ఎన్నో ఘనకార్యాలు చేశాడు. ఆయన స్వయంపోషకత్వాన్ని దాని ఫలితాన్ని దృష్టిలో పెట్టుకొని మనలను పరదాస్య విముక్తులను చేసి స్వాతంత్ర్య సౌధంలో వసింపజేసాడు. మనం మనకోసమే జీవించాలి అన్నాడు.

ధర్మమే మానవత్వం అని, సత్యమే అఖిల ప్రపంచానికి ఆధారభూతమైన శక్తి అనియు, అదే భగవంతుడనియు, ఆ సత్యాన్ని తెలుసుకొని పరస్పరం సుహృద్భావంతో సంచరించడమే మానవ ధర్మమనియు మనం మనస్థితిని తెలుసుకొనిన నాడు మరొకరితో మనకు అవసరం ఉండదని ప్రబోధించాడు. ఆయన మనకోసం అష్టకష్టాలు పడ్డాడు.

అంతేగాదు తన ప్రాణాలు సయితము భారత మాతయుక్క సేవకే అంకితంచేసి అర్పించాడు. ఆయన మనకు సర్వకాల సర్వ అవస్థలలోను ఆదర్శపురుషుడు. ఆయనను మరచిననాడు మనకు ముమ్మాటికి మనుగడలేదు. ఆయన అడుగుజాడలే రామరాజ్యానికి మార్గాన్ని సూచిస్తాయి.

ఆయన విశ్వమానవ కళ్యాణానికి అవతరించిన విశ్వ విజ్ఞానజ్యోతి అని నా ఆశయం.

ఇట్లు

మంత్రి రాధాకృష్ణమూర్తి

IV th. FORM ఆలపాడు, 23-1-50



# గిడుగు వారి లేఖలు

డా॥ వేటూరి ఆనందమూర్తి

గతసంవత్సరం 'మణిమంజరి' సంచికలలో కందుకూరి వారి, చెళ్లపిళ్లవారి లేఖలు ప్రకటించాము. ఇప్పుడు గిడుగు రామమూర్తి పంతులుగారి లేఖలు మూడు ప్రకటిస్తున్నాము. 1924-28 సం॥ల నడుమ గిడుగువారు ప్రభాకరశాస్త్రి గారికి వ్రాసినలేఖలివి. ఈ ప్రముఖులిద్దరిమధ్య సాగిన ఉత్తరప్రత్యుత్తరాలు అనేకం ఆనాటివి, అంతకు పూర్వపువి, తరువాతవి ఉండి ఉండాలి. గతంలో పోయినవిపోగా శ్రీ ప్రభాకర పరిశోధక మండలివారు సేకరించి పరిరక్షింపగల్గిన గిడుగువారి లేఖలివి మూడుమాత్రమే. ఇలాగే వేటూరి వారి లేఖ లేవైనా (1919 సెప్టెంబరు "తెలుగు" పత్రికలో గిడుగువారు ఒకలేఖలో కొంతభాగము ప్రకటించారు.[1]) గిడుగువారింట భద్రపరుపబడి ఉంటే అవీ వెలుగు చూడవలసినవే.

ప్రాచీనకావ్య వాఙ్మయ పరిరక్షణలోను, వ్యావహారిక భాషావ్యాప్తి విషయంలోను ఈ ప్రముఖులిద్దరి కృషి మౌలికంగానూ గణనీయంగాను సాగింది. తొలి విషయంలో వారు పరస్పరం సత్యదృష్టితో అనేకాంశాలు చర్చించుకొన్నా మతభేద మేర్పడినపుడు ఎవరికివారు స్వతంత్రంగానే నిర్ణయాలు తీసుకునే వారు.[2] ఇక మలివిషయంలో ఈ యిద్దరి దృష్టి ఏకముఖంగానే ప్రసరించింది. అందు వారి సహాయ సహకారాలు పరస్పర దోహదకారులే అయినవి. నేడు మనం వాఙ్మయ విషయాన అనుభవిస్తున్న అభ్యుదయానికంతటకీ నాటి గిడుగువారి తిరుగుబాటు, దానికి వేటూరివారి తోడుపాటు మూలకారణాలూ, ప్రముఖంగా చెప్పుకోదగిన సన్నివేశాలూను. అంతకు అర్ధశతాబ్దికి పూర్వమే ఎఱ్ఱమిల్లివారు, సామినేని వారు "సాధారణ తెలుగు భాషావ్యాప్తి"కై పడుతూ ఉండిన పరిశ్రమకు తరువాతి కాలాన నలుగురైదుగురు మిత్రుల సహకారంతో ఒక ఉద్యమ రూపాన్నిచ్చిన ప్రముఖుడు 'గిడుగు పిడు'గనిపించుకొన్న రామమూర్తి పంతులుగారే. మరి ఆ ఉద్యమం ప్రాచీన సంప్రదాయానికి అవిరుద్ధమైనదే అని చాటి దాని కూపిరిపోసినవారు ప్రభాకర శాస్త్రిగారు.

1950లో పితృపాదులు భౌతికాన్ని విడిచినప్పుడు గిడుగు రామమూర్తి పంతులుగారి కుమారులు డా॥ సీతాపతిగారన్నమాట లివి గుర్తింపదగినవి. "1910 నుంచి ప్రభాకరశాస్త్రి గారితో నాకు పరిచయం వున్నది. అదివరకే మా తండ్రిగార్ని, గురజాడ అప్పారావుగార్ని వారు బాగా ఎరుగుదురు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే అప్పటికి మా తండ్రిగారికిగాని గురజాడ అప్పారావుగారికి గానీ తెలియని ముఖ్య విషయం ఒకటి ప్రభాకరశాస్త్రిగారు తెలియజేశారు. మనపూర్వులు ప్రబంధాలకు ఒక భాష, గద్యరచనకు మరొకభాష వాడుతుండేవారనీ గద్యవ్రాసినదంతా వ్యావహారిక భాషఅనీ, దానిని గ్రాంధిక భాషలో తర్జుమాచేసి పుస్తకాలు ప్రచురించినవారు భాషకు అపకారం చేస్తున్నారనీ శ్రీ ప్రభాకర శాస్త్రిగారన్నారు." (ఆంధ్రప్రభ దినపత్రిక 30-8-1950)

కనుక రామమూర్తిగారి ప్రభాకరశాస్త్రిగారి స్నేహారంభం 1910కి పూర్వపు ముచ్చటే. స్పష్టంగా తెలియదుగాని అది ప్రభాకరశాస్త్రిగారు ఉద్యోగనిమిత్తం తమ పద్దెనిమిదో యేట- అంటే 1906 ప్రాంతాలలో మద్రాసు చేరడానికించుక పూర్వమో తరువాతనో జరిగివుండవచ్చునని భావించవచ్చు. శ్రీ వల్లూరి

సూర్యనారాయణరావు గారి ప్రేరణవల్ల ప్రభాకరశాస్త్రిగారు మద్రాసు రావడం గురజాడ అప్పారావు గారు, రెంటాల సుబ్బారావుగారు, వేపా రామేశంగారు, పనప్పాకం అనంతాచార్లు గారు, వారి కుమారుడు శ్రీనివాసాచార్లుగారు కాశీనాధుని నాగేశ్వరరావుగారు క్రమంగా సన్నిహితులు మిత్రులు కావడం జరిగినది అ కాలంలోనే. కనుక శ్రీ రామమూర్తి పంతులుగారి స్నేహంకూడా అప్పుడే ఆరంభమైయుండవచ్చును.

వారితోడి తమమైత్రినిగూర్చి ప్రభాకరశాస్త్రిగా రిట్లా పేర్కొన్నారు. "శ్రీ గురుజాడ అప్పారావు గారు, శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు నా కాప్త మిత్రులు కావడము, ఆనాడు నేనువారితో కలిసి యిప్పుడు మీరందఱూ నిర్వహిస్తూ ఉన్న సాహిత్యాభ్యుదయము నభ్యూహించి యపేక్షించి యుండిన వాడను కావడము నన్నుమీరు వరించడానికి ఒక కారణమయి యుంటుందనుకొంటున్నాను. శ్రీ గురుజాడ అప్పారావుగారికీ, నాకూ ఆనాడెటువంటి మైత్రి ఉండేదో సాక్షాత్తుగా ఎరిగినవారు ఇప్పుడు ఇక్కడ ఎవ్వరూ ఉండరనుకొంటాను. ఎందుకనగా అది ముప్పదియేండ్ల క్రిందటి నాటిమాట! వారి పూర్ణమ్మ, కన్యక రచనలకు ఆనాడు విజయసంకీర్తనము కావించినవాడను నేను. వాని రచననుగూర్చి నేనెఱిగిన విశేషములు చాలా ఉన్నవి. శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారి నిదేశము చొప్పున అప్పారావుగారి కుమారుడు చి॥ రామదాసుగారు అప్పారావుగారి రచనలను ప్రకటించేటప్పుడు నన్నాయా విశేషములతో పీఠిక వ్రాయగోరిరి. నేను వ్రాయుదునని మాటయిచ్చితిని. అదియట్లు జరుగకే ప్రకటితమయ్యెను. వారి రచనలు సరిగా నేడు కూడా ముద్రితములు కాలేదు. అప్రకటితములగు వారి రచనలు ఇంకా ఉండడము నేనెఱుగుదును.

శ్రీరామమూర్తి పంతులుగారి వాదముతో నేను సంపూర్ణముగా ఏకీభవించినవాడను. 1912-13 ప్రాంతములలో వాడుకభాషలోనే నేను కొన్నిగ్రంథములను ప్రకటించినాను. సభలో వాడుక భాషలో మాట్లాడడం, పత్రికలలో వ్యాసాలు వ్రాయడంకూడా తప్పుగా భావించేకాలమది. శ్రీ గురుజాడ అప్పారావు గారు చిరకాలము క్రిందటనే కీర్తిశేషులయినా ఏకవీరుడై మొనగాడై నిలిచి శ్రీ రామమూర్తి పంతులుగారు డక్కామొక్కీలు తిని తన మహోద్యమ విజయమును తిలకించి నేటి మహాసంగ్రామావసానమున రూజువెల్టు వలె నిర్యాణము చెందినారు." (నవ్యసాహిత్య పరిషత్తు, పదకొండవవార్షికోత్సవము ఉపక్రమోపన్యాసము ముక్త్యాల 1946.)

ఈ విషయమేకాక, అప్పటి తమ సాహిత్య వ్యాసంగాన్ని గూర్చి కూడా పితృపాదు లిట్లా పేర్కొన్నారు. 'ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు పదేపదే సందు దొరికినపుడెల్ల వెళ్ళుచు అక్కడి గ్రంథములు అముద్రితములు పరిశీలించుచు, లోకల్ రికార్డులనెల్ల చదువుచు, అపూర్వాంశముల గుర్తించుచు, గుర్తించిన వానిని మిత్రుల కుత్తరములద్వారా తెలుపుచు తన్మయుడనై విద్యావ్యాసంగము చేయుచుంటిని...." (చూ. ప్రజ్ఞా ప్రభాకరము. అధ్యా-14. పు, 57)

కనుక 1910కి పూర్వమే జరిగినట్లుగా డా॥ గిడుగు సీతాపతిగారు పైని పేర్కొన్న విషయాలుకూడా సరిగా ఆ రోజుల్లోనే జరిగివుండు ననుకోవచ్చు.

1906-16ల నడుమ గురజాడవారికీ వేటూరి వారికీ; 1906-40ల నడుమ గిడుగువారికీ వేటూరి వారికి మధ్య వర్ధిల్లిన మైత్రిని గురించి ప్రస్తావిస్తూ తమకు ప్రత్యక్షంగా తెలిసిన కొన్ని అంశాల్ని, తాము స్వయంగా చూసిన గుర్తున్న చాలా ఉత్తరాల్ని పూజ్యులు డా॥ వేటూరి శంకరశాస్త్రిగారు స్మరిస్తూ ముఖాముఖి నాకు విశదం చేశారు. (చూ. పాదసూచిక 9) కాని ఆ లేఖలు అన్నీ నష్టమై పోయినట్లే!

మిగిలిన వివే ఇప్పుడు ప్రకటిస్తున్నాము.

లేఖ -౧-

పర్లాకిమిడి
7-3-74

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన వేటూరి ప్రభాకర శాస్త్రిల వారి సన్నిధికి.

సే॥ గిడుగు వేంకట రామమూర్తి అనేక నమస్కారములు చేసి చేయంగలవి॥ ఉభయకుశలోపరి. మీరు ఫిబ్రవరి తే 9 దిని వ్రాసి ఈనెల తే 4 దిని పంపిన ఉత్తరము నిన్న సాయంత్రమందినది. మొదట ఉద్దేశించినట్టు "పెద్దదిగా బదులు" వ్రాసి వుంటే, సమ్ముఖముగా సంభాషించినట్లుండి ఎంతో సంతోషము కలుగజేసును. ఊరించి ఊరుకొన్నారు. చిన్నయసూరి ఉత్తరము లెట్లున్నవో చెప్పినారు కాదు గదా! 'గాదెల గండడు, కొండల మిండడు' రచించిన జగన్నాథం పంతులుగారికి అందజేయుటకు ఇందులో ఇంకొక కాగితము పంపుతున్నాను' అని వ్రాసినారే, ఆ కాగితము మీ జాబుతో కూడా కవరులో పెట్టలేదు. మరచిపోయినారు. ఈ జగన్నాథం పంతులు[3] మొన్నమొన్నటి వరకు "గ్రాంథికవాది"గా నుండి మన మతమును దూషించినవాడు. ఇక్కడ కొంతకాలము నాతో కలిసి ఉండుటచేత భాషాతత్త్వము బోధపర్చుకోగలిగినాడు.[4] ఇతని వంటివారనేకులున్నారు. 'దేశభాష' దేశస్థుల వర్తమాన వ్యావహారికభాష అని తెలియని వారింకా చాలామంది ఉన్నారు, గనక మన ముపేక్షించి ఊరుకోరాదు. చి॥ సీతాపతిని నాపనికి ఉపయోగించుకోలేదు. నవలో, నాటకమో పాటో పదమో వాడికి ఇష్టమయినది వాడు వ్రాయవచ్చును. రచించుటకు పూనుకొమ్మని ఇదివరకే చెప్పినాను. అయితే వాడికి తీరిక తక్కువ. మ్యునిసిపాలిటీపనులు, కోఆపరేటిప్ బ్యాంకిపనులు చేసి, చదరంగమాడి కాని, వీణ వాయించి కాని, విశ్రాంతి పొందుతాడు.

బసవ పురాణము ప్రూపులు ఇంకా రావడము లేదు. నేను పంపిన తాటాకు పుస్తకము మీ వద్దనే ఉన్నది గదా. అది ఎందుకయినా ఉపచరించినదా?

నేను ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికకై పంపిన వ్యాసము శీర్షిక- "వ్యావహారికాంధ్ర భాషా బహిష్కార-నిరసనము" మీరు ఒక మారు చిత్తగించండి. చి॥ సీతాపతికూడా "నన్నయ్య ఛందో విశేషములు" అనే పేరుగల వ్యాసమొకటి పంపినాడు.

వాడుక భాషలో రచించిన వచన గ్రంధములు వర్గీకరణముచేసి (కట్టకడపటి పుటలో నాకు తోచినట్లు వర్గీకరణము చేసినాను. మీరు సవరించవచ్చును) అన్నిటి పేర్లు జాబితా వ్రాయవలసి ఉన్నది. తెలిసినంతవరకు కర్తలపేర్లు వారికాలము చెప్పవలెను. వాటిలో ముఖ్యమయిన వాటి నుండి ఏదయినా ఒక 'పట్టు' ఎత్తివ్రాయవలెను. అవశ్యకమైతే అవతారికలో టూకీగా పూర్వోత్తర సందర్భము తెలియజేయవలెను. ప్రశస్తమైన గ్రంథములనుండి మూడు నాలుగు పుటలకు అధికమైనా ఎత్తితీసిన తునుక సంపూర్ణ 'ఘట్టము'గా ఉండవలెను. అట్లా ఉంటే స్వతః పఠనయోగ్యముగా ఉంటుంది. వివిధ శాస్త్రముల వివరణము వాడుక భాషలో పూర్వకాలమందు శాస్త్రజ్ఞులు ఎల్లా చేశేవారో తెలియజేయుటకు ఏదైనా ఒక అంశము చిన్నదైనా సంపూర్ణముగా వుండవలెను. వైద్యశాస్త్రమందు ఏదైనా ఒక రోగము, నిదానము, ఒక యోగము, భస్మము మొదలైనవి. జ్యోతిషమందు- సిద్ధాంతము లోనిది, గ్రహణములను గురించి, ఇట్లే తక్కిన వాటినికూడా కథలు మొ॥ ఒక చిన్నకథ, ఒక ఇతిహాసము, సంభాషణ మొ॥ అచ్చుపడ్డ గ్రంథములు కూడా మన పనికి ఉపచరించేవి కొన్ని ఉన్నవి. ఇప్పటి కూర్పులలో భాష మారిపోయినది. తుద మొదలు తెలియని తునుకలు- శబ్ద ప్రయోగము

చూపించుటకు మాత్రమే ఉపచరించును. చిల్లర గ్రంథాల విషయములో అట్టివి తీసి చూపించ వచ్చును. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు తీసిన తునుకలు ఇట్లే ఉన్నవి. వాటి సందర్భము తెలియదు. వాక్య మధ్యమందు విరతి పొందినవి. మీరు ఎత్తుకొనేవి అట్లుండవని నా ఉద్దేశ్యము. ఆయనకు బోధపడలేదు గాబోలును.

బాలకవి శరణ్యములో ప్రయోగాలు చూపించి నపుడు సంపూర్ణముగా పద్యములతో ఉదాహరించ నక్కరలేదనుకుంటాను. కావలసిన పద్యభాగము వ్రాసి గ్రంథము పేరు, అశ్వాసము, పద్యము-వీటి సంఖ్య, తెలియజేస్తే చాలునని తలంచి- ఆ లాగున గ్రంథము తయారు చేయిస్తున్నాను. మీ అభిప్రాయమేమి ?

ఈ గ్రంథమున్ను మీ సాయమున కావలసిన "నిజమైన వచనరచనా సంప్రదాయము"న్నూకాక 'కృతక గ్రాంధికాంధ్ర విజృంభణ' మనేది మరి ఒకటికూడా నేను రచించుటకు సంకల్పించి ఉన్నాను. నూరుగురు కృతక గ్రాంధికాంధ్ర రచయితల భాష విమర్శించి వారు పుట్టించిన కృతకభాష ప్రకటీక రిస్తాను. చిన్నయసూరి మొదలుకొని చిలకమర్తి లక్ష్మీనరసింహము వరకున్ను, వేదము వెంకటరాయ శాస్త్రి, పురాణపండ మల్లయశాస్త్రి, నేతి సుబ్బరాయ శాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి—ఇట్టి పండిత నామధారులు; ఆంధ్రవాల్మీకులు, వడ్డాది సుబ్బరాయ కవి వంటి కవులు; కొమర్రాజు లక్ష్మణరావు, వంగూరి సుబ్బారావు, చెలికాని లచ్చారావు, జయంతి రామయ్య, చిలుకూరి వీరభద్రరావు వంటి విమర్శకులు., నవలాకర్తలు., బడి పుస్తకములు రచించినవారు., పానుగంటి లక్ష్మీనరసింహము వంటి నాటక నిర్మాతలు—వీరందరి గ్రంథములు చూచినాను. అపశబ్దాల క్రింద గీట్లు గీసి ఉన్నాను. అవి అన్ని ఎత్తి వ్యాసరూపమున ప్రకటించవలెను

వాడుక భాషను దూషించి అపరిచితమయిన ప్రాచీ నాంధ్రములో రచించే వారి కందరికీ ప్రమాదము తప్పనిది. మీ కయినా అంతే. నా కయినా అంతే. మీకన్న ఎక్కువగా ప్రాచీనాంధ్రమును శోధించి తెలుసుకొన్న "పండితుల"ను నేను ఎరుగను. ఇచ్చ కానికి చెప్పిన మాట కాదు, నమ్మండి. అయినా, మీ వ్రాతలోకూడా కృతక భాష ఉన్నది గాని లేక పోలేదు. అందుకు తక్కినవారితోపాటు మీరూ నిందార్హులు.

అన్నట్టు చెప్పమరిచాను. మ॥ రామేశంగారి వద్ద నున్న హైదరాబాద్ శాసనములలో ఒకటి ఉప్పర్పల్లి లోనిది కాకతి గణపతిదేవుని కాలములో క్రీ.శ. 1236వ సం॥ చెక్కినది. ఇందులో పద్యాలున్నవి. వాటిలో 5వ దానియందు "గాచుచుండెడం" అని శాసన ప్రతిబింబమందుండగా, శాసన పరిష్కర్త "గాచు చుండె(డుం)" అని సవరించినారు. ఈ విష యము మీతో ముచ్చటించినాను. అయిదేండ్ల క్రిందట తంజావూరి భారత ప్రతులలో "ఎడమ" రూపము చూచి ఉంటిని.[5] అప్పటినుండిన్ని ఈ రూపమును గురించి సాధ్యమైనంత పరిశోధన చేసి నాను. కేతన వ్యాకరణ మందున్నది. వ్రాతప్రతు లలో సుమండీ! అచ్చులో చిన్నయసూరి వ్యాకరణము ప్రమాణము చేసుకొని పరిష్కర్తలు ఎవరో దిద్ది పాడు చేసినారు. ఈ ఉప్పర్పల్లి శాసనము ఈ 'ఎడమాం'త రూపమునకు పరమ ప్రమాణము గనుక నిరుడే చన్నపట్టణము నుండి యింటికి వచ్చిన వెంటనే హైదరాబాదు ఆర్కెఇలాజికల్ డిపార్టుమెంటు వారికి దీని విషయమై పెద్ద ఉత్తరము వ్రాసినాను. "ఎడుం"తోపాటు మరికొన్ని తప్పులు కూడా పేర్కొని ఇది శాసన పరిష్కర్తకు పంప వలెనని కోరినాను. ఆ పరిష్కర్త లండనులో నున్న డాక్టరు బార్నెట్‌గారు. నేను కోరినట్టు జరిగినది. ఆయన గత జనవరి తే. 31దీని హైదరాబాదు వారికి ప్రత్యుత్తరం వ్రాస్తూ నేను చూపించిన తప్పులు

# ధర్మమేఘం

డా॥ వి. వి. యల్. నరసింహారావు

[పతంజలి మహర్షి ప్రణీతమైన యోగసూత్రాలను గురించీ, భృక్తరహిత తారకరాజ యోగ మహాత్మ్యాన్ని గురించీ గురుదేవులు తమ "ప్రజ్ఞాప్రభాకరం"లో ప్రస్తావించారు. ఆ మహర్షి మేఘం వర్షించిన ధర్మాన్ని గూర్చిన వివరణ ఇందులో చూడవచ్చును. సం॥ ]

'ధర్మమేఘ' మనే పదబంధమే పరమాకర్షకంగా వుంది. కవి హృదయం కలవాడు పలికినట్లుగా వుంది. కాని యిది కేవలం కవి వూహలో కదిలిన మేఘం కాదు.

ఆకాశంలో అందంగా కదిలే మబ్బుల్ని అనేక పర్యాయాలు చూచాం! 'ధర్మమేఘ' మనే మబ్బు ఎప్పుడూ కనిపించలేదు. కాని లోకుల ఆకలి దప్పులు తీర్చడానికి అదనులో కురిసే వానమబ్బు 'ధర్మమేఘం' ఎందుకు కాకూడదు? ఆ దృష్టితో ఏ కవియైనా ధర్మమేఘాన్ని సంభావించాడేమో!
'ధర్మమేఘ' సంభావన కవికిమాత్రమే సాధ్యమనుకుంటే యోగశాస్త్ర కర్తయైన పతంజలికూడా ఒక కవే. వట్టి కవి కాడు, శాస్త్ర కవి.

పతంజలి ప్రణీతమైన యోగశాస్త్రంలో 'ధర్మమేఘ' మనే ఒక సమాధి లక్షణం పేర్కొన

యోగశాస్త్రం ఆమహర్షి చేతిలోపడి దర్శనస్థాయి కెక్కింది. యోగదర్శనం ఆయన ఒక్క మనదేశానికి మాత్రమే పెట్టిన భిక్షకాదు. అఖిల ప్రపంచానికీ అందించిన అమృతభిక్ష. ఈ అమృతరుచి ఎటువంటిదో తెలుసుకున్న అన్యదేశీయులుకూడా యోగశాస్త్రంపట్ల అపూర్వమైన ఆసక్తి చూపడం మొదలుపెట్టారు.

## యోగశాస్త్రం

ఈ శాస్త్రానికి ఇంత ప్రసిద్ధి కలగటానికి కారణం ఒక్కటే. శాస్త్రాలన్నీ రెండు విధాలు. (1) కేవలం భౌతిక వికాసానికి తోడ్పడేవి: (2) మానసిక వికాసానికి తోడ్పడేవి. భౌతిక రసాయనాది శాస్త్రాలు మొదటి తెగకుచెందినవి. వేదాంత మనస్తత్వాది శాస్త్రాలు రెండో తెగకు చెందినవి ఈ రెండు తెగలకు గొప్ప సమన్వయం సాధించిన శాస్త్రం యోగశాస్త్రం. అందుకే దీనికింత ప్రసిద్ధి.

సంసారం అసారమే కావచ్చు. దేహం నశ్వరమే కావచ్చు. కాని జీవుడు ఆ దేహంలో వున్నంత కాలం ఆదేహాన్ని శుభ్రంగా దృఢంగా వుంచుకోక తప్పదు. పవిత్రమైన తీర్థం తెచ్చి పాడుకుండలో పదిలం చేస్తామా?

యోగసాధనవల్ల కైవల్యసాధకమైన మోక్షలక్షణ వివేకమే కాకుండా, ఆరోగ్య సాధకమైన శరీరస్వచ్ఛతాలక్షణ వివేకంకూడా సిద్ధిస్తుంది. ఈ కారణం వల్లనే యోగశాస్త్రం మానవజీవితానికి మహోపకారం చేస్తుంది.

## యోగ ప్రాచుర్యం

భౌతిక మానసికములైన ఆరోగ్యాలు రెండింటికీ సాధకం కావటం, కైవల్యసిద్ధికి ఆత్మాన్వేషణ ద్వారా సాధకం కావటం - యోగ ప్రాచుర్యానికి ప్రధానకారణాలు. చిత్తసమన్వయంకోసంకూడిన యోగసాధన హైందవ వేదాంతంలో అంతర్భాగము.

ఆధునికమైన 'సైకోఎనాలిసిస్' మనిషియొక్క అధశ్చేతనను (Subconsciousness) గూర్చి, మనస్సునుగూర్చి, ప్రేరణలనుగూర్చి, ప్రతిక్రియలను గూర్చి - మన అభిప్రాయాలను చాలవరకు మార్చివేసినమాట వాస్తవం. యోగ ప్రశస్తికి ప్రధానకారణం దాని సాధనవల్లకలిగే అతిభౌతిక శక్తులే. శరీరాన్ని ఆత్మతోను, జీవాత్మను పరమాత్మతోను బంధించి గొప్ప అనుభూతినిచ్చే సాధన యోగం. ఆంతరంగికమైన స్థిరత్వాన్నికూడా యోగం ఇవ్వగలుగుతుంది. అంటే— 'Imotional stability' యోగసాధనవల్లసాధ్యమన్నమాట. మనస్సు యొక్క అదుపులేకుండా కదిలే అవయవాలను- ఆమాటకువస్తే వివిధములైన కండరాలను-మనస్సు యొక్క అదుపులోకి తేగలిగింది యోగసాధన. ఇంద్రియముల ప్రభావం వల్ల అధశ్చేతనలో వచ్చే అనేక ఆటంకాలనే ఫ్రాయిడ్ 'Eros' అని ముక్తసరిగా చెప్పాడు. లైంగిక ప్రేరణ. అహంప్రేరణ (Sex and Ego instincts) కూడా 'Eros' లో అంతర్భాగాలే.

పరమమైన దశలో ఆత్మమోక్షం కోసం యోగం చిత్తవిధ్వంసం చెయ్యడానికి వెనుదీయదు. చిత్త విధ్వంసం (Destruction of the mind) అనే అంశం 'Psycho Analytical Research' కి అందని అద్భుతమైన విషయం. దీనిలోతులు తరచి చూడటానికి యోగశాస్త్రంలో ప్రసక్తమయ్యే 'ధర్మమేఘం' గూర్చి తెలుసుకోక తప్పదు.

'చిత్తాన్ని ధ్వంసం చేసుకోవటానికా ఈ ప్రయత్నమంతా?' అని అంటారేమో! చిత్తవిధ్వంసం అంటే ఏమిటో తెలుసుకోవాలి. ఇది తెలుసుకోవాలంటే చిత్తవృత్తులు ముందు తెలుసుకోవాలి.

## చిత్త వృత్తు

చిత్తవృత్తులంటే నిద్ర సుషుప్తి, జాగరూకత. చిత్తము యొక్క నడవడి ఈ మూడిటమీద ఆధారపడివుంటుంది. వృత్తి అంటే వర్తనం; నడవడి. చిత్తవృత్తి ఈ మూడు దశల్లోను భిన్నభిన్నంగా వుంటుంది. అయితే ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. చిత్తం ఈ మూడు దశల్లోను పనిచేస్తూనే వుంటుంది. జాగరూకదశలో సమస్తం స్పష్టంగా తెలుస్తూనే వుంటుంది. నిద్రా సుషుప్తి దశల్లో తెలివి అసలు లేకుండాపోదు. విషయాలు అస్పష్టంగా తెలుస్తూవుంటాయి. అస్పష్టమైన ఈదశల్లో అధశ్చేతన (Sub-consciousness) పనిచేస్తూనే వుంటుంది. చిత్తవృత్తులున్నంతసేపు చిత్తము పనిచేస్తూనే వుంటుందన్నమాట. యోగసాధనవల్ల ఈ చిత్తవృత్తుల్ని నియమం చెయ్యవచ్చు. నియమంవల్ల చిత్తవృత్తులు నిరుద్ధమౌతాయి దీనినే చిత్తవృత్తి నిరోధమంటారు. కనుక యోగమంటే చిత్తవృత్తి నిరోధమనే అర్థం.

## యోగః చిత్తవృత్తినిరోధః

అని పతంజలి సూత్రించడంలోని పరమార్థం ఇదే. అయితే చిత్తవృత్తి నిరోధమే చిత్తవిధ్వంసం అనవచ్చునా? నిరోధం విధ్వంసానికి పూర్వదశ. ప్రవాహానికి అడ్డుకట్ట వెయ్యటం నిరోధం. నిరోధం వల్ల ప్రవాహగతి మారుతుందేకాని ప్రవాహజలం ఇంకిపోదుగదా! ప్రవాహజలం ధ్వంసం కావటానికి ఇతర ప్రయత్నాలు అవసరం. జలం ఆవిరికావటమో ఇగిరిపోవటమో జరగాలి. జలానికి

అభావమనేది అప్పుడుగాని జరగదు. 'అప్పుడు కూడా ఆవిరి అనే రూపాంతరం ఉన్నదికదా' అంటే ఆవిరినే జలమని అనటం పొసగదు. కనుక చిత్తవృత్తి నిరోధం చిత్తవిధ్వంసం అని అనటానికి వీల్లేదు.

చిత్తవృత్తి లక్షణం చెప్పటానికి ఆధునిక మనస్తత్త్వశాస్త్రం చాలా కృషి చేసింది. మనో విశ్లేషణ సిద్ధాంతాలు (Theories of Psycho Analysis) కొత్త ఆలోచనామార్గాన్ని నిర్మించినమాట వాస్తవం. అథశ్చేతన (Sub-consciousness) పశుప్రవృత్తి (Instincts) — ప్రేరణలు (Im—pulses) — ఆవశ్యకతలు (Urges) ఈ మొదలైన అన్నిటిని గూర్చి నూతనదృక్పథం వచ్చింది. అయినా జీవుల చిత్తవృత్తిలక్షణం ఇదమిత్థమని చెప్పటం ఆధునిక మనోవిశ్లేషణ సిద్ధాంతాలకు పూర్తిగా సాధ్యం కాలేదు.

హృదయం—మనస్సు—చిత్తం— అనే ఈ అవధులన్నీ దాటి ఆత్మ దగ్గరకు పోయే ప్రయత్నం ఈ సిద్ధాంతాలకు పట్టలేదు. అందువల్ల ఆధునిక మనస్తత్త్వశాస్త్రం ఎంత సమగ్రమైనా అసమగ్రం కానే కనిపిస్తుంది. ఈ మాట మనమనటమేకాదు, ఇతరుల్లోనూ కొందరంగీకరించారు.

"Psycho-Analysis itself and the lines of thougt which it gives rise, surely a distinctive western development are only beginner's attempt compared to what is in immemorial art of a soul - C. G. Jung.

భౌతికమైన సంపద ఎంత వృద్ధిచెందుతున్నా ఆధునిక మానవ జీవితంలో మనశ్శాంతి మృగ్యమౌతున్నది. చిత్తశాంతి లేనివాడికి మనశ్శాంతి ఎట్లా సాధ్యమౌతుంది? చిత్తం శాంతి పొందాలంటే చిత్తవృత్తుల నిరోధం జరగాలి. విధ్వంసం సంగతి దేవుడెరుగు! ముందు నిరోధం సంగతి ఆలోచించాలి. నిరోధం ఇంద్రియ సంయమంవల్ల గాని సిద్ధించదు. సంయమానికి ఏకాగ్రత కావాలి. ఏకాగ్రతలో నిచ్చెనమెట్లెక్కినట్లు పైకెక్కిపోగల (అంతరంగ సౌధంలోనే) సాధకుడికే సమాధి సాధ్యం.

## ధర్మమేఘం

సమాధి అనేది యోగంవల్ల సిద్ధిస్తున్నది. సమాధి వల్ల ప్రయోజనం?— మోక్షం. మోక్షమంటే?— కైవల్యం. కైవల్యమంటే? —

దీన్ని వివరించటం కోసమే మహర్షి యోగశాస్త్రంలోని చతుర్థపాదమంతా వినియోగించాడు. అందుకే చతుర్థపాదం 'కైవల్యపాద' మనబడింది.

నాలుగు పాదాలుగా విభజించబడిన యోగసూత్రాలన్నీ కలసినా రెండువందలుండవు. జగత్ప్రసిద్ధి నందిన ఈ యోగసూత్రాలకు మహర్షి వ్యాసదేవ ప్రణీతమైన భాష్యమున్నది. (భారత వ్యాసుడు కాడు) రాజర్షి భోజదేవ ప్రణీతమైన వృత్తి వున్నది. ఆత్మ పరిపాకానికి, శాస్త్ర పాండిత్యానికి ఈ భాష్యవృత్తులు పరమ నిదర్శనాలు. ఎక్కడా పొల్లుమాట వుండదు. పరిపృత్త్యసహిష్ణువులుగా వుంటాయి.

'ధర్మమేఘ' మనే సమాధిప్రసక్తి పాతంజల యోగ దర్శనంలోని కైవల్యపాదంలో రావవస్తుంది.

"ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వదా వివేక

ధర్మమేఘః సమాధిః"- కై. పా. సూ. 29

'ప్రసంఖ్యాన జ్ఞానదశలో ఫలేచ్ఛారహితమైన జీవికి సమస్త విషయ వివేకప్రసిద్ధివల్ల ధర్మమేఘ మనే సమాధి లభిస్తున్న' దని భావం.

దీనికి వ్యాసదేవ భాష్య మిట్లా వున్నది.

"యదాఽయం బ్రాహ్మణః ప్రసంఖ్యానేఽ
ప్యకుసీద స్తతోఽపి
న కించి త్ప్రార్థయతే। తత్రాపి విరక్తస్య
సర్వదా వివేక
ఖ్యాతిరేవ భవతీతి సంస్కారబీజక్షయా న్నాస్య
ప్రత్య
యాన్తరా ణ్యుత్పద్యన్తే। తదాఽస్య ధర్మ
మేఘోనామ సమాధిర్భవతి".

"ప్రసంఖ్యానజ్ఞానదశలో ఫలాపేక్షలేని బ్రహ్మ జ్ఞానికి కించిత్తుకూడా కోరికవుండదట. సమస్తమందు వివేకజ్ఞానం వుంటుంది. సంస్కార బీజక్షయంవల్ల ఇతర విషయజ్ఞానం వుండదు. అప్పుడతనికి 'ధర్మమేఘ' మనే సమాధిస్థితి కలుగుతుంది."

బాగానే వుంది. ఇంతకూ ప్రసంఖ్యానమంటే ఏమిటో స్పష్టం కావటంలేదు. భోజుని వృత్తి దీన్ని స్పష్టం చేస్తున్నది.

"ప్రసంఖ్యానాం యవతాం తత్త్వానాం యథా క్రమం వ్యవస్థితానాం పరస్పర విలక్షణ స్వరూప విభావనంతస్మిన్ సత్య ప్యకుసీదస్య ఫలమలిప్సోః ప్రత్యయాంతరాణా మనుదయాత్సర్వ ప్రకార వివేకఖ్యాతేః పరిశేషా ద్ధర్మమేఘః సమాధి ర్భవతి"

"క్రమానుసారంగా వ్యవస్థితములైన స్వభావా లన్నింటి పరస్పర విలక్షణ స్వరూపము యొక్క తలంపు ప్రసంఖ్యానం." అంటే ఒకదానితో ఇంకొకదాన్ని పోల్చినప్పుడు విశిష్టమైన లక్షణంతో గోచరించే తత్త్వములను క్రమబద్ధంగా విచారించ టం ప్రసంఖ్యానమని భావం.

స్థిరత్వంగల యోగికి ఫలమునం దిచ్ఛలేక పోవటంవల్ల ఇతరమైన జ్ఞానం కలగదు. పైగా సర్వవిధాలా ఒకేఒక వివేకం మిగులుతుంది. అటు వంటి వివేకప్రసిద్ధివల్ల ధర్మమేఘ మనే సమాధి కలుగుతుంది.

భోజదేవు డిక్కడ కొన్ని విశేషాలుకూడా వివ రించాడు.

"ప్రకృష్ట మశుక్ల కృష్ణ ధర్మం పరమ పురు షార్థకం మేహతి సించ ధర్మమేఘః"

అత్యుత్తమమూ, పుణ్యపాప రహితమూఅయిన ధర్మమే పరమపురుషార్థ సాధకమౌతుంది. ('శుక్ల' శబ్దం పుణ్యానికి 'కృష్ణ' శబ్దం పాపానికీ ఉప లక్షకాలు.) అటువంటి ధర్మాన్ని వర్షించే మేఘం ధర్మమేఘం. దీనివల్ల జ్ఞానహేతువైన అత్యుత్తమ ధర్మ వివేకం కలుగుతుంది.

ఇది ఎలా సాధ్యం?
సమాధానం చెబుతున్నాడు మహర్షి పతంజలి.

"తతః క్లేశకర్మ నివృత్తిః"-.కై. పా. 30

'క్లేశకర్మనివృత్తి' అంటే క్లేశము యొక్క నివృత్తీ, కర్మము యొక్క నివృత్తీ అని అర్థం. క్లేశ రాహిత్యం కర్మరాహిత్యం ధర్మమేఘసిద్ధివల్ల కలిగే ఫలాలు.

క్లేశము లంటే?
అవిద్య మొదలైన వన్నమాట.
కర్మము లంటే?
పుణ్యపాప రూపములైన కర్మము లన్నమాట.

అవిద్యాది క్లేశాలకూ, పుణ్యపాప రూపమైన కర్మలకూ మూలమే నాశనం కావటమనేది ధర్మ మేఘ సంసిద్ధి ఫలం. క్లేశ కర్మములతోపాటు వాస నలుకూడా విదారిత మౌతాయని గ్రహించాలి.

ఈ సర్వానికీ ప్రయోజనం?

"క్లేశకర్మనివృత్తౌ జీవన్నేవ విద్వాన్
విముక్తో భవతి"

వీటివల్ల విద్వాంసుడు జీవన్ముక్తుడౌతాడు. అదే ఫలం.

ఇదెట్లా సాధ్యం?

సంసారత్యాగం వల్ల సాధ్యం.

అవిద్యకు మూలబీజం సంసారంలో వుంది. సంసారం రాగ మూలకం. విపరీతజ్ఞానరూపమైన అవిద్య సరాగమైన సంసారమువల్లనే కలుగుతుంది.

కనుకనే న్యాయదర్శనంలో గౌతమర్షి అన్నాడు-

"వీతరాగ జన్మాదర్శనాత్" (న్యా. సూ. 3-1-24)

ఇంతటి జ్ఞానోదయానికి క్లేశకర్మ నివృత్తి మాత్రమే సాధకం.

దీనివల్ల కలిగే ఫలం ఏమిటి?

క్లేశ కర్మాది సర్వావరణాలు తొలగి (ప్రణష్టమై) పోగా అనంతమైన జ్ఞానంవల్ల జ్ఞేయమైన "సంసారము యొక్క అల్పత్వం" స్పష్టమౌతుంది. అంటే సంసారం తుచ్ఛమనే భావన కలుగుతుంది.

ఈ భావన కలగటానికి అవ్యవహితపూర్వమైన దశలను గుర్తించటం కొంత ఆవశ్యకం.

బుద్ధియం దేర్పడే జ్ఞానం సత్త్వరూపమైంది. దీన్నే 'జ్ఞానసత్త్వ' మంటారు. ఇదెప్పుడూ తమస్సు చేత ఆవృతమై వుంటుంది. బుద్ధికి రజస్సువల్ల ప్రవృత్తి కలుగుతుంది బుద్ధిజ్ఞానానికి ఆవరించి వుండే తమస్సు నష్టమైతే తప్ప గ్రహణసామర్ధ్యం హెచ్చదు. ఆవిధంగా ఆవరణమాలిన్యం తొలగితే తప్ప చిత్తము నిర్మలంకాదు. అనంతజ్ఞానం అప్పుడు మాత్రమే కలుగుతుంది. "సంసారం హేయ" మనే జ్ఞేయం ఇటువంటి అనంతజ్ఞానం వల్లనే కలుగుతుంది.

ధర్మమేఘ సమాధి నిష్ఠుడైన యోగి సమాధి ప్రకాశం వల్ల అచ్చెరువు గొల్పుతూ వుంటాడట. ఎట్లాగంటే — గగనంలో ఖద్యోతంలాగ, అంతే కాదు— అంధుడు మణిని ధరించినట్లు, వ్రేలు లేనివాడు ఉంగరం ధరించినట్లు- మెడలేని వ్యక్తి హారం ధరించినట్లు, నాలుకలేనివాడు ప్రసంగం చేసినట్లు—ఆశ్చర్యం గొలుపుతాడుట.

ఇది కృతార్థతకు లక్షణం. ఈ దశలో గుణములకు పరిణామక్రమం సమాప్తమౌతుంది. పరిణామక్రమం గ్రహించటం అంటే— ఒక్కొక్క క్షణం గడిచిన తరవాత స్వరూపంలో వచ్చేమార్పుయొక్క తుదిహద్దు క్రమంగా గ్రహించటం. ఇటువంటి పరిణామక్రమం సమాప్తమైన దశలో గుణములు పురుషార్థ శూన్యములుగా వుంటాయి. లయించేవిగా వుంటాయి. లయించటాన్నే పరిభాషలో చెప్పాలంటే 'ప్రతిప్రసవం' అనాలి. కైవల్య నిరూపణ సందర్భంలో మహర్షి సూత్రం ఆ పదాన్నే పొదువుకున్నది. ప్రసవమంటే పుట్టుక, ప్రతి ప్రసవమంటే 'లయం'.

'పురుషార్థ శూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం

స్వరూపప్రతిష్ఠా వా చితి శక్తి రితి' కై.పా.34

భోగమోక్షములనే పురుష ప్రయోజనాలు శూన్యమై, కార్యకారణ రూపమైన గుణములు మూలహేతువులో లీనంకావటమే కైవల్యం.

స్వరూపంలో స్థిరత్వం, పురుష బుద్ధియందు సంబంధరాహిత్యం – వీటివల్ల కలిగే చేతనశక్తిని కైవల్యం అంటారు. కైవల్యమంటే కేవలమైన అవస్థ (దశ). ఇది నిర్వికారమైన దశ. నిత్యమైన దశ. ఇక్కడ చిత్తము యొక్క ఉనికిలేదు; విధ్వస్తమైనట్లే.

నిత్యత్వం రెండువిధాలు. 1) కూటస్థ నిత్యత్వం 2) పరిణామనిత్యత్వం.

కూటస్థదశలో కలిగే నిత్యత్వం మొదటిది పరిణామ దశలో కలిగేది రెండవది.

గుణముల యొక్క పరిణామ సమాప్తి యందు కలిగే నిత్యత్వం కనుక ధర్మమేఘ సమాధి యందు పరిణామ సమాప్తి రూపనిత్యత్వం గ్రాహ్యం. పరమార్థం పరిశీలించి చూస్తే ధర్మమేఘ సమాధి సంసారహేయత్వాన్ని కైవల్యము యొక్క ఉచ్చత్వాన్ని, కైవల్యము యొక్క ఉచ్చత్వాన్ని ప్రబోధిస్తున్నదని చెప్పవచ్చు.

'నిత్య సాంసారికులైన జీవులకు ఇది సాధ్యమా? అంటే 'అసాధ్యమైనప్పుడు' రాజయోగాది మార్గాలు కైవల్యసాధనాలుగా ఉండనే ఉన్నాయి.' అని సమాధానం.

ఆ మార్గాలకంటే ధర్మమేఘ మార్గం సుగమమైంది. ఉన్నతమైంది. కైవల్యానికి దగ్గరిమెట్టు కూడాను.

కనుక పతంజలి మహర్షి ధర్మమేఘ స్వనితాన్ని మంద్ర గంభీరంగా వినిపించాడు.

శారీరక మానసిక క్లేశకర్మ నివృత్తికీ, కైవల్య సంసిద్ధికీ మహర్షిమేఘం వర్షించిన ధర్మం 'ధర్మమేఘం'.

* * *

సంప్రతించిన గ్రంథాలు -


1. పాతంజల యోగదర్శనమ్.
   వ్యాసదేవ ప్రణీత భాష్యమ్; భోజదేవ వృత్తి సహితమ్.
2. The Wisdom of India
   -Edited & annotated by Lin yutang
3. Modern and Man in Search of a Soul' -C.G. Jung.
4. The Yoga Aphorisms of Patanjali Translated by Swami Vivekananda.




# మే లు కొ లు పు లు

## —వేటూరి సుందరశాస్త్రిగారి కృతులు



[ "శ్రీరామచంద్ర శ్రీ కౌసల్యానందన-ధీర తెల్లవారె లేరా
వారిజలోచన సౌమిత్రితో సంధ్యా - వందనము సేయ లేరా" అంటూ భూపాలరాగం చాపు తాళంలో మేలుకొలుపులు పాడడం సంప్రదాయజ్ఞు లెరిగిన విషయమే. అదే రీతిని అదే మట్టుతో ఆశుమార్గాన 'వేటూరి సుందర దాసకవి' చెప్పిన ఈ మేలుకొలుపు మాలికాగీతాన్ని వ్రాతలో మార్పుచేయకుండా అట్లాగే ప్రకటిస్తున్నాము——సం॥ ]

బంగారు పాత్రతో పన్నీరునింపుకా
పవనపుత్రుడు వచ్చెలేరా।
పరమానందముతో భానుసూనుడు దంత
పావాన దెచ్చెనూలేరా

ముక్తాతాపత్రాము మురియూచు భరతుడు
మూపునుంచుకవచ్చె లేరా।
భక్తాగ్రేసరులూ రక్తిగా బాడుచూ
బలసి నిలిచున్నారూ లేరా ॥౨॥

కాశ్యాపేశ్వరులంతా కానుకలూగొని
కాచి నిలిచున్నారు లేరా।
విశ్వామిత్రాగస్త్యా కశ్యాపముని సమితి
వేచియున్నారిపుడూ లేరా ॥౩॥

మురియూచూ కౌసల్యాకైకా సుమిత్రాలు
ముంగిటానిలిచేరు లేరా।
మోదాముతో వారి పాదాకంజములాకు
మ్రొక్కుసామయమాయె లేరా ॥౪॥

అరుణోదయా మాయె నాప్తాలందరు వచ్చే
రాలస్యా మేలాను లేరా।
అవనిజాతో కొన్ని అంశాము లెరిగింప
అరుంధతీ వచ్చే లేరా ॥౫॥

పన్నీరూ గంధాము పచ్చీకస్తురి పునుగు
భామాలు దెచ్చీరి లేరా।
చెన్నుమీరంగ ధరణీకన్యా నర్చింపాగా
కన్నేలందరు వచ్చీ లేరా ॥౬॥

నారూ మెకములబాధా జేరి చెప్పూకొనగ
నాపూలందరు వచ్చి లేరా।
వారీ మనవాలించి ఘోరామృగముల ద్రుంచి
చేరాదూ విప్ప్రాడు లేరా ॥౭॥

భక్తాలందరు భవబంధలంపటులగుచు
భయమొంది చేరిరి లేరా । నీదు
పాదాకంజరజము బరపి భద్రపదవి
పాలూచేలుపుగాని లేరా ॥౮॥

దాసానాదాసులు కేశవాయని భజన
చేసుచుండిరి వేగ లేరా।
రాజూతులందారు రచ్చకూటమున నా
రాయడా యనుచుండ్రి లేరా ॥౯॥

వేదావందిత పాద సాధూ జనావనా
మాధవ జగదీశ లేరా।
మందారధర ధీర మకరకుండలకర్ణ
మనసిజానిభతేజ లేరా ॥౧౦॥

రాకేందునిభ వక్త్ర రాజీవదళనేత్ర
పాకారిసన్మిత్ర లేరా।
కాకారక్షణ దక్ష ఘనగ్రావాంచిత పక్ష
కలికలుషాశిక్షక లేరా ॥౧౧॥

త్రిదశావందిత చరణ త్రివిక్రమానామ
త్రిగుణాతీత రామ లేరా।
త్రిపురాంతకాపక్ష దేవా సంరక్షకా
ధీరవామనరూపా లేరా ॥౧౨॥

శ్రీశా శ్రీధర హృషీకేశా పద్మనాభ
నీశేవ జేశెదా లేరా।
వాసికెక్కిన దామోదరా సంకర్ష
ణా శరధి బంధనా లేరా ॥౧౩॥

దేవపోషక వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ
భావజ జనక లేరా।
శ్రీవత్సాంకితవక్ష శ్రితభక్తమందార
శ్రీ పురుషోత్తమ లేరా ॥౧౪॥

సామగానలోల సామాజపరితోష
సనకాది వందిత లేరా।
సవ్యసాచి మిత్ర సంగరరిపు జైత్ర
స్వామీ అధోక్షజ లేరా ॥౧౫॥

నారసింహుడవని నమ్మి ప్రహ్లాదూడు
పారము జెందేను లేరా।
నరవరా అచ్యుతా నందకుమారకా
నారదసన్నుత లేరా ॥౧౬॥

జయా జానార్దానా జానకీహృత్ప్రాణ
శౌరీ ఉపేంద్రూడ లేరా।
సర్వ జగధీశ్వర స్వామీ హరే కృష్ణ
సత్యాపరాక్రమా లేరా ॥౧౭॥

అండపిండబ్రహ్మాండేశ ప్రృగఖండన
అండజవాహన లేరా।
భండానరిపు శిరఃఖండన మండాల
పాండవ గణపక్ష లేరా ॥౧౮॥

ధర వేటూరి సుందర దాసపోషక
దానవాంతక నీవు లేరా।
తాపసమందార తరణికులోద్ధార
దశరథాత్మజ వేగ లేరా ॥౧౯॥

# మాయా సంధి

- వావిలికొలను వెంకటసుబ్బారావు

[ ఈ వ్యాసము 26-5-1945 నాటి ఆంధ్రవాణి నుండి పునర్ముద్రితము—సం. ]

ప్రపంచము మాయాపూరితమైయున్నది. ఈ మాయను అనుసరించియే జ్ఞానము వృద్ధిపొందినది. కావున యీ విజ్ఞానము మాయా క్లిష్టమై యుండును. మన శక్తికిమించిన కార్యములు చేయవలెనున్నవి. అవి అన్నియు శాశ్వతముగ అట్లుండవలసినవియే, అవి మనకు సాధ్యపడవు, అని మనము దృఢముగా నమ్ముచున్నాము. నమ్ముటయేగాక వాటినిగురించి తలపోయము, వాటిని సాధించుటకు ప్రయత్నము గూడ చేయము. ఇదియే ఒక గొప్పమాయ. "జాతస్యహి ధ్రువో మృత్యుర్ధ్రువమ్" (భ.గీ. అధ్యా II-27) ఇంతవరకు "పుట్టుట గిట్టుట కొఱకే" అని సిద్ధాంతము. మానవుడి శరీరముయొక్క దుఃఖా దుఃఖములను నివారించుటకు ప్రయత్నించిన మహా వ్యక్తులలో బుద్ధుడు, జీసస్ క్రైస్తు-వీరిద్దరు స్మరణకు వచ్చుచున్నారు. బుద్ధుడు గొప్పతపస్సు చేసెను. ఈ ప్రపంచములోని దుఃఖము, వ్యాధి, మరణము మొదలగు మానవకోటి వ్యసనములను లేకుండ చేయుటకు బుద్ధుడు యత్నించెను. కాని వారికి సాధ్యము కాలేదు. ఈ సుఖదుఃఖములు వగైరాలు ఆజన్మాంతముండునవి. స్థూల శరీరముండుకాలము వఱకును అవికూడ దాని ననుసరించియే యుండునని తీర్మానించెను. కాని నిర్వాణ కాయసిద్ధి పొందిన ఇవి బాధింపవనియు, నిర్వాణ పదవిని సాధన చేయవలయుననియు తెలిపిరి. క్రైస్తు అట్లుగాక తన సామర్థ్యముకొలది, వ్యాధి నివారణము, అంగలోపము, మరణముతోసహా నివారింప యత్నించెను. కొంతవరకు సాధ్యమైనట్లు బైబిలు వలన తెలియుచున్నది. కావున వ్యాధులు, దుఃఖములు, మరణములేకుండుట మానవుడు సాధింపతగిన కార్యములని జీసస్సు నిరూపించినాడు. ఈ మహత్తరమైన యుద్యమమునకు వీరు మార్గదర్శులు. ఇది సాధ్యమా యసాధ్యమాయని కొంచెము విచారించుదము. సృష్టికర్త తాను సృజించిన వస్తువులు శాశ్వతముగా నుండవలయునను తలంపుతో గదా సృష్టించుచున్నాడు. అట్లైన కొంతకాలమువరకు వర్ధిల్లి యావల నంతరించుట సృష్టిలోపముగదా? సృష్టిలోపమును సృష్టికర్తయే సవరించవలెను గదా? సృష్టి పూర్ణత్వము పొందలేదు. భిన్నముగా నున్నది. సాధారణముగ మనుజునికి శాశ్వతముగ జీవించి యుండవలయుననియే కోరిక. దానికి తార్కాణముగ పెద్దలు పిన్నవారిని ఆశీర్వదించునపుడు "దీర్ఘాయుష్మాన్ భవ" "దీర్ఘసుమంగళీభవా" "చిరంజీవి శతాయుస్సు" అని పలువిధ ఆశీర్వచనములున్నవి. ఇవి యుత్తమమైన కోరికలే. మరిన్ని శ్రాద్ధములు పెట్టునపుడు "అన్నంచ బ్రహ్మ, భోక్తాచ బ్రహ్మ" ఇత్యాది శబ్దములు వాడుచున్నాము. కావున బ్రహ్మత్వము ప్రతివస్తువునందు నున్నది మరి "అహం బ్రహ్మ" అను శబ్దమునించుక విచారింతము. ప్రతి మానవునిలో బ్రహ్మత్వమున్నటుల స్ఫురించుచున్నది. మఱియు బ్రహ్మము నగుణరూపుడైన గాని వానిని తెలిసికొన జాలమనియు స్ఫురించు

చున్నది. ఈ బ్రహ్మత్వమును ఎఱుగుటయే జీవుని ధర్మము. బ్రహ్మజ్ఞానము పొందుటవలన బ్రహ్మ దర్శనముసుస్సా కాగలదు.

సృష్టిలో ఉత్తమమైనవ్యక్తి మానవుడు. అట్లయిన బ్రహ్మత్వ మాతనియందు లయించియున్న కారణమున పరబ్రహ్మముకూడ నొకదివ్య పురుష వ్యక్తిగా నుండునని స్ఫురించుచున్నది. అటువంటి దివ్య పురుషుడు యిది వరకు రూఢిగా అవతరించి యుండలేదు. నిర్గుణముగా నున్నది, సగుణముగా మారుటయే సృష్టిధర్మము. సృష్టి పూర్ణత్వము పొందవలయును. ఏలాటి లోపములు, భిన్నములు నుండరాదు. మానవులు జరామరణ విహీనులుగా నుండవలయును.

సాధారణముగా మనము దేవుని గుణాతిశయములకు భిన్నముగా ప్రవర్తించుచున్నాము. దైవమునకు మనము మ్రొక్కుకొని, కానుకలిచ్చుట, ఫలపుష్పాదులు అర్పించుట లేక యితర విధములుగ సేవించుట మొదలగునవి దైవమును మనము వశము చేసుకొనుటకు యత్నించునటుల తోచుచున్నది. దైవమునకు మన వస్తువులు కావలెనా ? మనము ఆరాధించుట వలననే మనకు కార్యానుకూలమగునని ఎంచుట వెఱ్ఱితనమని మన మూఢ ప్రకృతి తెల్పుచున్నది. దైవమునకు మనవలన ఏలాటి యుపకారము నక్కఱలేదు. అట్లు కోరిన దైవముకాదు, ఆ వ్యక్తి భూతము. దైవము మనకు పూర్ణత్వము నివ్వవలయును. సృష్టిభిన్నత్వము దైవలోపము. ఈ లోపము సవరించవలసినది వారి విధియే.

బ్రహ్మము అవతరించవలెను. లేనియెడల సృష్టి పూర్ణత్వము పొందజాలదు. సగుణముగా నున్నదియే మనకు స్ఫురించును. కావున నిర్గుణముగానున్నది సగుణము సహితము కావలెను. లేనియెడల సృష్టి మార్పుచెందజాలదు. ప్రపంచమునందు అల్లకల్లోలము శాంతి పొందవలెనన్న ఇటువంటి బ్రహ్మాంశ పురుషుడుద్భవించవలెను. ఈ ప్రపంచము మార్పు జెందవలెనంటే అట్టి మహా వ్యక్తి అవతరించవలయును. లేనియెడల స్థూల ప్రపంచములో మార్పులు రాజాలవు. (భ. గీ. అధ్యా 4 శ్లో 7, 8) "యదాయదాహి ధర్మస్య..." "పరిత్రాణాయ సాధూనాం....", ఈ గీతా శ్లోకముల వలన మహాపురుషులు అవతరించినగాని స్థూల ప్రకృతిని మార్పుచేయుటకు వీలులేదని ఏర్పడుచున్నది. కావుననే స్థూలశరీరము ఆవశ్యకమై యున్నదని తెలియుచున్నది. కావుననే శ్రీకృష్ణభగవానులు అవతరింపవలసి వచ్చెను. సూక్ష్మశరీరముతో స్థూల ప్రపంచములో పనిచేయుటకు వీలులేదు. ఘనాకృతియైన శరీరము స్థూల ప్రకృతితో పనిచేయుటకు అత్యావశ్యకమని తత్వజ్ఞాన సభవారు కూడా ఒప్పుకొనుచున్నారు. కావున స్థూల శరీరమును నశింపకుండునట్లు చేయుట అత్యావశ్యకమై యున్నది. దీని విధానము మరల యోచింతము.

ప్రపంచములో ప్రస్తుతపు అశాంతి ఇట్టి మహా వ్యక్తి ఉద్భవించినగాని కుదుటపడదు. ఈర్ష్యాద్వేష, లోభ, మోహ, మద మాత్సర్యములతో నిండిన ప్రపంచము శాంతిపొందుట దుర్లభము. బహుమత వ్యాపకమై కులాచార భేదములతో మునుగుచున్న ప్రజలకు అన్యోన్యము ఎట్లుగలుగును? బ్రహ్మము అవతరించినగాని ఇట్టి దురవస్థను తొలగించుటకు వీలుండదు. ఇదియే కల్పము మారుట. మనువు అంతరించుట. శ్వేత వరాహకల్పము మారి బ్రహ్మ కల్పము రానున్నది. వైవస్వతమనువు అంతరించి సూర్యసావర్ణిమనువు రానున్నది కాబోలు.

ఈ విషయములు కొంతవరకు శ్రీ కాకభుజండరు నాడీగ్రంథమువలన మాకు తెలియుచున్నది. దీనిని గురించి ఇదివఱకే మేము తెలిపియున్నాము. ఈ గ్రంథము జాతక భూయిష్ఠమైనను

తత్వజ్ఞానమునకు సంబంధించిన విషయములై ఒకానొక రాజయోగమును గురించి వ్రాయబడియున్నది. ఈ యోగము "భృక్తరహిత తారక రాజయోగము" ఈ యోగమువలన స్థూలప్రజ్ఞలో బ్రహ్మజ్ఞానము సంపాదింపనగును. "సమాధియోగము" కాదు. ఆదికి సమము చేయునది ఒకటియే బ్రహ్మము. కావున బ్రహ్మముతో సమానము చేయునది

ఈ యోగము మాస్టరు సి. వి. వెంకటస్వామిరావు గారిచే కనిపెట్టబడినది. వారు పన్నెండెక్కిన ఆరువేల నియోగి బ్రాహ్మణ కులోత్తములు తంజావూరు జిల్లా, కుంభకోణము పట్టణములో కామకోటి పీఠము నెదుట తన తండ్రి గృహములో కావేరి నదీతీరమున శ్రీ భగవాన్ భుట్టము సామీప్యమున నుద్భవించిరి. వారు పితృపక్షమునకు 5-వ సం॥న స్వీకారము పోయిరి. దత్తమూలచే తల్లిదండ్రులతో పెంచబడిరి. 12-వ సం॥న వివాహము చేసుకొనిరి. ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలను కనిన పిదప వారి 36-వ సం॥న ఆమె స్వర్గస్థురాలయ్యెను వారికి 38-వ సం॥లో పునర్వివాహమైనది. ఈ సాధ్వీమ తల్లి శ్రీమతి వెంకమాంబ. వీరికి ఇరువురు పుత్రులు, ఇరువురు పుత్రికలు కల్గిరి. ఈయమ ప్రథమ పుత్రుడు ఏప్రెల్ 1909 సం॥న పుట్టి 1910 జూన్ 11వ దినమున మరణించెను. కాని వీని జనన మరణములు శ్రీమాస్టరుగారి యోగసాధనమునకు కారణభూతములయ్యెను. సృష్టి, మరణరహస్యములను తెలిసికొనుటకు అవకాశము గలిగెను. ఈ ప్రథమపుత్రునిపేరు చందు (రామచంద్రుడు కాబోలు). రెండవ కుమారుడు శ్రీభృక్తరావు. ఈ యోగముయొక్క నామమే వారికి పెట్టిరి. శ్రీభృక్తరావు 30-4-1916 సం॥న జన్మించెను,

మఱియొక ప్రాచీన నాడివలన (ధ్రువనాడి) శ్రీ మాస్టరుగారి ప్రథమ భార్య చనిపోయిన కాలము నుండి తత్వవిచారము చేయుచున్నట్లు ఏర్పడుచున్నది. 1909 సం॥లో "చందు" పుట్టువుతో యోగజ్ఞానము వృద్ధి చేసుకొని, వాని మరణావస్థలో సంపూర్ణ సృష్టి జ్ఞానము సంపాదించిరి. మరియు బ్రహ్మతత్వమును వారిద్వితీయభార్య మూలమున తెలుసుకొనిరి. "బ్రహ్మలోకాది పృత్త్వాంతమ్ భార్య మూలాత్ గ్రహిష్యతి". ఈ యోగమువలన మానవులు అమృతత్వము పొందగలరనియు, సకల భోగభాగ్యైశ్వర్యములతో శాశ్వతముగా జీవించగలరనియు తీర్మానము చేసుకొనిరి. అట్టి సృష్టి జ్ఞానమువలన అపరిమితప్రాణ మున్నదని కనుగొనిరి. దానిని ఆకర్షించుట 1910 సం॥లో రాబడిన హాలీసు(Halleys Comet) అను ధూమకేతువును ఆధారము చేసుకొని తద్వారా సంపూర్ణ ప్రాణశక్తిని ఆకర్షించిరి. వెంటనే 29-5-'10న తన చెంతనున్న మిత్రులకు యోగ విధానము బోధింపసాగిరి. ఇట్లు పలువిధములైన సాధకములను బోధించి, అవి పూర్తిగానున్న సమయమున యోగమార్గమువలన అదృశ్యులైరి. 12-5-1922 సం॥న [illegible]గిరి. స్థూలము విడిచి 23 సం॥లు అయినవి. యోగము ప్రారంభముచేసి 35 సం॥ 29-5-45కి ముగియుచున్నవి. ఈ యోగము పూర్తియగు తరుణములో తిరుగ ఒక గొప్ప ధూమకేతువు రానున్నది. పూర్తికి పైలోకములలో కొంతమార్పు చేయవలసియున్నందున వారు తిరిగి వెళలిరి. ఇట్లు శ్రీ భుజండరు నాడి సూచించుచున్నది. ప్రపంచములోని అల్లకల్లోలములు ధూమకేతువు వచ్చిన వెంటనే అంతరించును. కల్పము, మనువు మారు సంధి సమయమున గ్రహములు స్వశక్తి విహీనములై గురుబ్రహ్మ వాక్యానుసారముగ ప్రవర్తించును. భూలోకములో స్వర్గము స్థాపింపబడును. జరామరణ విహీనులై, స్వేచ్ఛానుభావులై, బ్రహ్మతుల్య చిరాయువులై జనులుందురు,

జగము ప్రేమమయము. సృష్టి ప్రేమజనితము. శ్రీకృష్ణ భగవానులు ప్రేమమయ విధానమును

చూపింగాని యది తరుణము రానందున వ్యాపకము కాలేదు సృష్టి పూర్ణత్వము పొందవలయునంటే ప్రేమపూరితము కావలెను. ప్రేమపూరితము ఎట్లగును? సాధనమేమి? భృక్తరహిత తారక రాజయోగముచే సాధింపనగును. ఈ యోగము మానవకోటికిగాను ఏర్పడినది. ఈ మానవకోటి యుగాంతమున దీనిని పొందుటకే సృష్టింపబడినది ఈ యోగము వలననే నూతన విధానములు రానున్నవి ఈ యోగము తప్ప మఱియొకటి లోకమునకు శాంతి నివ్వలేదు. ఆధ్యాత్మిక శక్తియే ప్రబలమైన శక్తి ఈ ఆత్మశక్తియే ప్రకృతిలో మార్పు తేగలదు. శాంతములేక సౌఖ్యము లేదు. సౌఖ్యములేక శాంతములేదు.



మాతృశ్రీ వెంకమ్మగారు (చూ. పుట 71)

# సజీవరచన

— వేటూరి ప్రభాకరశాస్త్రి

[ "ఏది సజీవరచన?" అనే విషయముపై రేడియోలో జరిగిన ఒక గోష్ఠి కార్యక్రమానికై గురుదేవులు వ్రాసియిచ్చిన వ్యాసమిది. భావిరచనలు, జీవరచనలు ఎలావుండాలో వారిందులో సూచించినారు. ఉపాధ్యాయపథాన రచయితల కర్తవ్యమేమిటో, విద్యాలయాల విధులెట్టివో రేడియో సమయాలవంటి ప్రచారసాధనాలు పనిచేయవలసిన తీరెట్టిదో ఇందులో వారు ప్రస్తావించినారు-- సం॥ ]

ఎప్పుడూ, రచనా - రంగములో ప్రశస్తరచన రసోల్బణమయిన ప్రతిభావిలాసముగా సహృదయ వశ్యమే చేసేదిగా ఉంటుంది

సామాన్య ప్రజాసంఘమనే పాలలో కాకలు పొంగులు, పచ్చి పచ్చి, పయి పయిని తేరుకొన్న స్నిగ్ధమధురమయిన మీగడ వంటిది సహృదయరచయితృ వచనము.

దానిలో, లో లో ఇంకా కాకలు పొంగులు చిటపటలు రేగి, మెరపడసము కాలగి, గమగమలాడుతూ నెమ్మదిగా నెలకొనే నేతివంటి వెలసేది

ఇరుగు పొరుగులకు మంచి చేస్తూ పలకరిస్తూ ఆనంద పరుస్తూ కలిసిమెలిసి వర్తించే సజీవసత్పురుషుని వంటిది సజీవప్రశస్తరచన.

ఆ యా దేశకాలములకు అవశ్యకములయిన అర్థములను సమకూర్చి పెట్టడానికిగా పుట్టి, తమపని తీరేదాకా వ్యాపకములయి తర్వాత ఉత్తరోత్తర రచనలలో జీర్ణమైపోతూ ఉంటాయి కొన్ని సజీవ రచనలు.

పైకి మంచిగా కనిపిస్తూ నిజంగా చెరుపుచేసే సజీవరచనలు కొన్ని ఉంటవి. వీటిగుణదోష పరిజ్ఞానం ప్రజావర్గపు ప్రజ్ఞావిలసితాన్ని అనుసరించి ఉంటుంది.

ధ్రువతారలవలె వెలుగుతూ ఎప్పుడూ సహృదయ సంఘమునకు శిరోధార్యములుగా అస్తమించకుండా ఉంటవి కొన్ని శాశ్వతరచనలు.

మానవ జీవిత పరమార్థమును పరమావధిదాకా ముట్టి చూచినవారే అట్టి రచనలు చేయగలుగుతారు. క్రాంతదర్శులయి ఆ పరమార్థమును గుర్తించి శాశ్వతరచనలు చేసినవారు ఉపనిషద్ద్రష్టలు మొదలగువారు వ్రేళ్ళలెక్కమీదనే ఇంత దాక కడచిన కాలాన్నంతనూ గాలించి చూస్తే దొరకగలరనుకొంటాను. వ్యాస వాల్మీకి కాళిదాసాదుల రచనలలో కూడా కొన్ని కొన్ని పట్టులే శాశ్వతరచనలన దగినవి. తిక్కన భాగాలు ఆ యా కాలాలకు తగినవి. వారి ఆత్మోన్నతి హద్దుల నంటినవి. అంతే. నిజముగా శాశ్వత రచనలు గాంధి శకమున కడల్కొన నారంభించినవని నానమ్మకము. గాంధి శకమే మానవతలో అపరిచ్ఛిన్నమైన ఐక్యమును, అన్యూనాధికమయిన సామరస్యమును సరిగా గుర్తించి స్థాపింప బూనినది. ఇప్పటికే అందుకు తగ్గ దేశకాల పరిపాకమూ కలిగింది.

కూడుగుడ్డలు మొదలు పరమార్థము దాకా సర్వప్రజాభీప్సితములకు సాధనసమన్వయ స్థానము గాంధిసారస్వతము. ఎవరో రచయితలు పది పుస్తకాలు చదివి, భాష నేర్చి, హాయిగా కూర్చుండి ఇదిగో గ్రంథరచన చేస్తున్నాను, ఇది లోకాని కుపకరిస్తుంది అని సాగిస్తే సాగేదికాదు ఉత్తమ రచన.

మానవవర్గం అన్ని విధాలా పెంపొంది, అందులో ఉత్తమ మానవత వెలసి, అది తనకూ లోకానికీ, సర్వోదయముకై తపించగా దాని గుండెచ్చీల్చుకొని వస్తుంది ఉత్తమ రచన.

గాంధి మారణవార్త వినగానే, తన్నుతానే ఎరగకుండా, సహృదయ రచయితృలోకం నుండి ఒక్కసారే ఉవ్వెత్తుగా పరిస్ఫురించిన ప్రజ్ఞా ప్రబోధములు ఇకమీద వెలయవలసిన ఉత్తమ రచనల కూటపట్టులు.

గాంధిసూక్తములు వాని మూలాధారములు.

భవిష్యత్కాలంలో కావ్యవస్తువులు సత్య ప్రేమాత్మకములుగానే ఉంటవనుకొంటాను. రచనలలోనే యుగపరిణామం అంత పరిణామం జరుగనున్నదనుకొంటాను.

మనిషి మనిషినీ అడిగి తెలుసుకొంటే ప్రపంచమంతటా సహృదయ మానవతలో గాంధిమారణ వార్త విన్న క్షణంలో ఏయే సంఘటనలు, సంభాషణలు, జరిగినవో సరిగా సత్యముగా వ్రాస్తేనే అవి వెయ్యి నవలలపెట్టు అవుతవి. లక్షభావకవిత్వాలందులో ఉంటవి.

సన్నిహితమైన సత్యపు సౌందర్యమును గుర్తించ గలిగినకొద్దీ, రచయితలు దూరపు కల్పితపు వస్తు రచనలకు స్వస్తి చెపుతారు.

గాంధిగారితో సహగమనం చేసిన ఆత్మధీరుల దీరగాథలు కావ్యవస్తువులు కాగలవు. దాసీను వితియసుల కంటె మొన్నటి భూమ నరసింహదాసు, నేటి గాంధి సహయాత్రికులు; దివ్య సాహిత్య దీపకులు.

విద్వేషములు, మారణములు, చాణక్యతంత్రములు, జాతిమత దేశకృత విభేదములు, పొటించి పోరపులు పుట్టించే రచనలకికనైనా స్వస్తిచెప్పడం మంచిది

ఆత్మగుణములను భూతదయాశాంత్యనసూయా దులను పెంపొందించే రచనలే వెలయవలెను.

వస్తువు మంచిదే అయినా రచయిత మంచి భాషాది పరికరం కలవాడే అయినా వని హృదయం పరమార్థాభిముఖంగా పర్వులువారేది కాకపోతే ఆ రచన చెడుతుంది. పరమార్థాభిముఖంగా పర్వులు వారే హృదయం కలవానికి, ఎటువంటి వస్తువైనా సరే, ఎటువంటి భాషైనా సరే మిలమిలలాడుతూ వస్తుభావ ప్రజ్వలనంవల్ల ప్రతిభాసిస్తుంది.

రచనకు నిజమైన సౌందర్యం పరమార్థ పరాయణతవల్ల వస్తుంది. పాతిక ముప్పై యేండ్లనుండి మన తెల్గు రచనలో క్రొత్తదనం వచ్చిందంటున్నారు. నిజమే. ఏదో వచ్చిందిగాని, అది ఏదో వచ్చిందన్నట్టే చాలామట్టుకు ఉన్నదనుకొంటాను. అందులో తెలుగుదనమూ, పరమార్థపరాయణతా చాలా తక్కువ. ఎందుచేతనంటే-

ఏ జాతిలోనయినా ప్రజకు, వారి భావములకు భాషకు సర్వతోముఖమయిన స్వాతంత్ర్యం వస్తే, ఆ వచ్చిన తర్వాతనే ఆ జాతిలో తేరుకొనే సహృదయ వర్గము చేసే రచనవల్ల ఆ జాతిరచనా విశిష్టత ప్రవ్యక్తమవుతుంది. అట్టి శుభస్థితి తెలుగు నాటికింకా కలుగలేదు. కూడు, గుడ్డలేక మలమల

మాదిరిగా ఉండే ప్రజకుగాని, వారిలోనుండి తేరు కొనే రచయితృ- సర్గానికిగాని, పరిపూర్తిపరాయణత ఏర్పరుపడడం కష్టసాధ్యం. తిష్ఠకుదింతేనే కాని నిష్ఠపడదు కుదిరినా అది అల్లకల్లోలాన్నే ప్రదర్శిస్తుంది. భాషా ప్రయోజనాలన్నీ చాలామట్టుకు మనం తెలుగుపరచిన వెలసినదాది నేటిదాకా పరభాషల పల్లనే పడయడిపుచ్చుతున్నవి.

ఏదో ఉన్నత సంపుంవారు, వారి పైయెత్తు భాషలో, ఇంతవరకు ఒక్క సాహిత్యప్రయోజనం మాత్రం కొంత కొంత సాధించడం జరుగుతోంది. ఈ ప్రౌఢసాహిత్యం ప్రజాసామాన్యానికేమాత్రమూ పనికిరాదు.

పాశ్చాత్య మైత్రియేండ్లనుండీ లఘుకథలు, లఘు నాటకములు, వృత్తగంధిపచనరచనలు, గేయ రచనలు, తెల్గునాట కొన్ని మంచి మంచివి సాగుతున్నవి. వీనిలో కొంత అపూర్వత, సౌలభ్యం ఉంటున్నది గాని ఇది దేశములోని సంక్షోభములను, నిరాశలను వెల్లడించడమే గాని మానవనౌక పరమార్థము గట్టు చేరగలందులకు అట్టే ఉపకరించేవిగా లేవు. వీటిలో కొన్ని విలాసినీ విలసితములతో కావ్యానికి లక్ష్యంగా కూడా ఉన్నవి.

ఇప్పుడు ప్రజ్ఞావర్గమంతా అన్నవస్త్రదారిద్ర్యముతో జ్ఞానదారిద్ర్యముతో తహతహలాడుతున్నది. ముందు ఈ దారిద్ర్యబాధ తొలగవలెను. రచయితృవర్గమంతా ముందుగా ఈ క్షేమనివారణమునకు సహాయపడే రచనలు సర్వతోముఖముగా సాగించవలసి ఉన్నది. అవి పద్యకవితా రచనలు గావు. ప్రజల భాషలోని ప్రపంచ విజ్ఞానమంతా దింపేవి కావలెను. అవి వచన రచనలే. వచన రచనలలోనే మోసగింపు లేని, నిర్దష్టమైన భావప్రసారం ఉంటుంది.

తెలుగుదనము నిండార్లుగా పొంగిపారే రచనావాహిని తెలుగునాట ఇక మీదనే వెలయవలసి ఉన్నది. రచనకు భావముతో పాటు భాషకూడా సమయోగ్యత గలది. అందుకై ముందుగా, వడివడిగా భాషాసాధన సామగ్రీ సంపాదనము జరుగవలెను.

ఆంధ్ర సాహిత్యసాధనముకు పునాదులయిన నానుళ్లు, పలుకుబళ్లు సామెతలు, జంటపలుకులు, లజ్జులు, పలుకుగుత్తులు, పనిపాటలవారి పరిశ్రమ గీతాలు, బాలకుల ఆటపాటలు, స్త్రీల సౌభాగ్య గేయాలు, నోముల పాటలు, బిచ్చగాండ్ర పాటలు, భక్తుల ప్రార్థనాగీతాలు, వృద్ధుల వేదాంత కీర్తనలు, చమత్కార కథలు, పొడుపుకథలు, ఊళ్ళకథలు, వాటి చరిత్రలు, ఊళ్ళలోని పూర్వపు పెద్దలకథలు, అక్కడి శిల్పములు, గ్రంథములు, జాతి పరిశ్రమలు, వాటి సంప్రదాయములు, బిరుదావళులు, ఆచారవ్యవహారములు, గుళ్లు, వాటి చరిత్రలు శాసనములు, వాటి చరిత్రలు, నదుల, కొండల, ఊళ్ళ మనుష్యుల పేర్లు వాని పుట్టుపూర్వోత్తరాలు వగైరాలు దేశం నాలుగు చెఱగులనుండీ సేకరించడం జరుగవలెను. ఇటువంటివాటిలో ఆయా జాతుల ప్రజల సహజాభిరుచులు పలుకుతీరులు, కూర్పునేర్పులు, ఛందస్సందర్భములు, సారస్యవైరస్యములు, ఆశావాసనలు అన్నీ అద్దములో వలె అమాయికముగా ప్రతిఫలిస్తూ ఉంటై.

వీటి తీరుతీయముల ననుసరించి సాగించే వాఙ్మయ నిర్మాణము నిర్వక్రమై జాతి వార్తాచమత్కారవిలసితమై అతుకుల బొంత కాకుండా జాతి శరీరమునకు అందచందముల నాపాదిస్తూ అత్తుకొని వెలయగల్గుతుంది.

ఇందుకై యూనివర్సిటీవారు, దొరతనమువారు, సాహిత్యపరిషత్తుల వారు, మునిసిపాలటీల వారు,

అందరు ఏకమై దేశం నలుమూలలా గాలించి భాషా సాహిత్య పంకరిముల సర్వేచేసి సేకరింపవలెను.

అక్కడక్కడ విద్యాశాలలలోని తెలివిగల యుపాధ్యాయుల నిందుకై వినియోగింపవలెను. ప్రతి జిల్లా పారశాలలలో వారి సేకరము గ్రుచ్చి యెత్తి చేర్చే యేర్పాట్లు జరిగవలెను. సేకరించే విధానము వారికి ముందు నేర్పేవారు కొందఱు జిల్లాలు, తాలూకాలు, టూరుచేసే ఆయావిధానములు బోధింపవలెను. ఆంధ్రదేశమంతకూ వాటినన్నింటినీ చేర్చి తీర్చిదిద్ది ప్రకటించే సంస్థ గొప్పది వెలయవలెను. ఇదంతా ఆంధ్రరాష్ట్రం వేఱుపడడం ఆంధ్రదేశాన్ని ఆంధ్రులే పాలించడం, జరిగేకాలం దగ్గరకు వచ్చినది గనుక సులువుగా ఇక నిర్వర్తింప వీలుపడుతుంది.

ఆంధ్రరాష్ట్రం వేఱై, ఇళ్ళలో స్కూళ్ళలో, రైళ్లలో, ఆఫీసుల్లో, వర్కుషాపుల్లో, కోర్టుల్లో, కౌన్సిళ్ళలో సర్వ వ్యవహారమూ దేశభాషామూలంగా సాగిందంటే ఒహోహో మనం ఎన్నడూ ఎరగని రచనా వైవిధ్యం మన భాషలో విజృంభిస్తుంది. అలాంటి విజృంభణ ఏర్పడ్డతర్వాత వెలసే రచనల రూపురేఖలన్నీ ఇప్పుడే మనం తీర్చి చూపజాలము. దేశభాషామూలక పాలన జరగడం మన భాషాజీవితంలో ఒక బ్రహ్మాండమంత శుభాభ్యుదయ పరిణామానికి కారణమవుతుంది.

సినిమా నేనింతదాక చూచి యెఱుగను. అయినా దీని వెల్లుబడి ప్రజావర్గంమీద చాలా ఉన్నదని యెఱుగుదును. ఇది మచ్చు చల్లి పామరప్రజావర్గాన్ని ఎక్కడికో లాక్కువెడుతోంది. కాని సామాన్యంగా అవి పామరుల, అల్పబుద్ధుల, రంజనమునే పరమార్థముగా పెట్టుకొని సాగుతున్నవని ఎన్నో విమర్శకులు. విజ్ఞాన పరమార్థములు వీటివల్ల నెరవేరడం లేదంటున్నారు పరిణతబుద్ధులు కొందరు. ఏమో! ఈ సినిమాలలో వలపుల కథల గగ్గోలు తగ్గితే బాగుండును. సినిమాల బ్రతుకంతా చక్కని చుక్కల, వారి శృంగార గేయాల మీద ఆధారపడి ఉండడం కొంతైనా తొలగితే బాగుండును. పామర ప్రజావర్గానికి పరమార్థాభిరుచి కొల్పేవిగా ఉండవలెగాని, సినిమా రచనలు, పామరుల అధమాభిరుచులకు లోబడి పోయేవిగా ఉండరాదు.

రేడియో ప్రపంచ మానవుల ఎంత దూరాన ఉన్నా, వారి భావములను దగ్గరకు చేరవేసి, మెఱుగులు దేరుతూ ఉండే వారి వారి మేల్మిరచనలను పరస్పర సమాకలనార్థములను కావిస్తోంది. దీనివల్ల ప్రపంచం మొత్తాన సరస సజీవ దివ్య రచనల వైభవం పరస్పర గుణ సంగ్రహణోత్సాహంతో ప్రబలమై ప్రజ్వరిల్లుతున్నది. యోగులు తపస్సు చేసి నిగూఢంగా సాధించే దూరశ్రవణ దూరదర్శనాది సిద్ధులను సర్వ సామాన్యంగా లభ్యపరుస్తున్న ఈశ్వరశక్తి రేడియో. భవిష్యత్కాల సజీవరచనలకిది ప్రాకుడు గొమ్మ.

ఆంధ్రదేశ మధ్యంలో రేడియో ప్రసారం సాగితే, అది తెలుగుల సారస్వత వృద్ధికి చాలా తోడ్పడుతుంది. రేడియో సంగ్రహముగా సారస్వత సారోద్ధారమును ఎప్పటి కప్పుడు ప్రదర్శిస్తూ ఉంటుంది గనుక దానివల్ల సారస్వత వృద్ధి పరుగులు వారుతూ సాగుతుంది.

(ఆకాశవాణి సౌజన్యంతో)

# నాయనగారి సన్నిధే మాకు పెన్నిధి

- శ్రీమతి రావి వినత

[ గురుదేవులను గూర్చిన జ్ఞాపకాలు ఇట్టివి ఎందఱకు ఎన్నెన్నో! దగ్గరనుంచుంటే అగ్నిహోత్రుడు చల్లబడిన వృత్తాంతం ఇందులో ఉంది. వలదంటే వాయుదేవుడూ వరుణ దేవుడూ వైదొలగిన వైనం కంభంపాటి వారి ఆంగ్ల వ్యాసంలో ఉంది. అప్పటి పత్రికలూ ఆ వార్తను ప్రకటించాయి-సం॥ ]

శ్రీ ప్రభాకర పరిశోధకమండలి వారు సమర్పించిన "మణిమంజరి" శ్రీవారి జయంతి వర్ధంతి సంచికలు చూడగానే పాత జ్ఞాపకాలు యెన్నో యెన్నో స్మృతిపథంలో మెదిలాయి. పూజ్యులు గురుదేవులు పితృపాదులు అయిన శ్రీ ప్రభాకర శాస్త్రిగారిని గురించి వ్రాయాలని సంకల్పము కలిగింది. కాని యెలా వ్రాయాలి యేమని వ్రాయాలి అని ఆలోచనలో పడ్డా! కారణం నేను చెప్పుకోతగ్గ చదువు చదువుకోలేదు. కథలు చెప్పడం కవితలల్లడమన్నది అసలేరాదు. ఇప్పుడు నేను వ్రాయాలనుకొందిపాతజ్ఞాపకాలు మాత్రమే. కొన్నియథార్థాలు :

పేరుకి మేము ముగ్గురు కూతుళ్లం ముగ్గురు కొడుకులం అయినా అంతా తన వారుగా బిడ్డలుగా చూసుకొని 'ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకమ్' అన్నరీతిని జీవితము గడిపిన మహాయోగి మా తండ్రిగారు. పాండిచ్చేరిలో శ్రీ అరవిందుల దర్శనానికని పలువురు పెద్దలు ఆంధ్ర దేశంనుంచి రావడం, శ్రీవారిని గురించి మాట్లాడడం "మా గురువుగారి అమ్మాయి యిక్కడ వున్నదన్నమాట. మువ్వు (అంటే మా ఆయన) పిలవకుండానే మీ ఇంటికి వస్తాను" అని రావడం అతిథి సత్కారాల నందుకొని శ్రీవారిని గురించి కాసేపు ఆయనచేసిన సాహిత్యము, జరిపిన యోగంపైన మాట్లాడి వెళ్ళడం పరిపాటయింది. ఎక్కడో మారుమూల వున్న నాకు ఈ అనుభూతి చాలా సంతోషాన్నీ, తృప్తినీ కలిగిస్తూవుంటుంది. ముఖ్యంగా నేను వ్రాయదల్చుకొన్నవి కొన్ని జ్ఞాపకాలు మాత్రమే.

ఆరోజు సాయంత్రము అంతా ప్రేయరు చేసుకొని లేచారు. పేరుపేరునా వారివారి అనారోగ్యాలను గురించి అడగడం, వారు తమ అనుభూతులను చెప్పడం అలవాటు. ఇంతలో పొగ అరుపులు విని లోపలేదో గొడవ చూసిరా? అని అనడము మా ఇంటిప్రక్కన పూరి గుడిసె నిప్పు అంటుకొన్నది అని మేము అరవడం ఒకసారిగా జరిగాయి. ఆ అంటుకొన్న ఇంటి ప్రక్కనే ఆవులకోసం వేసిన కొట్టం, పెద్ద గడ్డివాము వున్నాయి. ఒక రివ్వుపడి అంటుకోవడమెంతసేపు? ఎన్ని నీళ్ళు చల్లి ఆరుద్దామన్నా అగ్నిహోత్రుడు ఆరక మంట లందుకొన్నాయి. ప్రేయరు హాల్లో కూచునివున్న మా నాన్నగారి దగ్గరకు వెళ్ళి అమ్మ, 'దొడ్లో పశువుల పాక అంటుకొంటే యేం చేయడం?' అన్న తరువాత

ఆయన లేచిరావడం, ఆ మండుతున్న ఇంటిదగ్గరకు వెళ్ళి నుంచోడము జరిగింది. అంతే. మండుతున్న మంటలు నిప్పురవ్వలు మరోవైపుకు తిరిగాయి. 'మరేం ఖంగారు పడకండి. అంతా చల్లారిపోతాయి మంటలు. అందరినీ ఆదుకొనే ఆ పరమేశ్వరుడు వున్నాడు. ఏ చీకాకులేకుండా వుండాలని కోరుకోండి' అన్నారు. అంతే. ఆశ్చర్యము! కాసేపటికి అంతా సర్దుకొన్నాయి. శ్రీవారి దైవ బలమే ఆనాడు అందరినీ కాపాడింది.

ఎంతమందో తేలు కుట్టినవాళ్ళు, పాము కరచినవాళ్ళు, అనేక రకాల జబ్బులవాళ్లు శ్రీవారి దగ్గరికువచ్చేవాళ్ళు. ఓమాటు కార్యక్రమాలు అన్నీ ముగించుకుని పడుకునేందుకు పైకి అప్పుడేవెళ్లాము. రాత్రి 12గం॥లకు క్రిందతలుపు కొట్టడముతో దిగివచ్చి 'యేమిటమ్మా? అనిఅడిగితే తేలుకరచిందిసామీ నల్లతేలు రెండుచోట్ల చూడండి' అంటూ పిల్లని చూపించింది. దానికి శ్రీవారు నవ్వుతూ, 'తేలుని పిల్లకరిచిందా? పిల్లని తేలుకరిచిందా? ఏదీ నవ్వుతూ ఆడుకొంటోంది పిల్ల చూడు' అన్నారు. ఆ తల్లి పాపం 'లేదుసామీ! ఇంటి దగ్గర చేతులు కాళ్ళు నిలవకుండా గుక్కపట్టి యేడిచింది ఈ సందుమొనకు రాగానే యేడుపు మాని వూరుకొందయ్యా' అన్నది. ప్రజ్ఞలేకుండా శవాకారంతో వచ్చినవాళ్లు తిరిగి ఇంటికి నవ్వుతూ నడిచి వెళ్ళేవారు యెంతమందో. ఇటువంటి చిత్రాలు యెన్నో శ్రీవారి సమక్షంలో జరిగేవి. డాక్టర్ వద్దకు వెళ్ళకుండా ముక్కాని (అప్పుడు కానీలు వుండేవి) కార్డుతో సంపూర్ణారోగ్యాన్ని పొందేవారు చాలామంది. 'నిన్నటి నుంచి 105 డిగ్రీలు జ్వరం. ఆహారము యేదీ అందటము లేదు. వాంతులు. మీకు ఉత్తరము వ్రాస్తే తగ్గుతుందని వ్రాస్తున్నాను. ట్రీట్‌మెంటు చేయండి.' అని మొదటిది ఉత్తరం. రెండోది. 'మీకు లెటర్ పోస్టుచేసి ఇంటికి రాగానే పిల్లవాడికి జ్వరం తగ్గి కులాసాగా వున్నాడు.' అని రెండోవి ఉత్తరాలు వచ్చేవి.

ఇట్లా అందరు వారివారి అనుభవాలను వ్రాస్తే చాలా పెద్దగ్రంథమే అవుతుంది. చివరిదిగా ఇంకొకటి వ్రాస్తాను. తిరుపతిలో పెట్టదలచుకొన్న మ్యూజియం సేకరణకు తిరిగివచ్చిన శ్రీవారు అనారోగ్యముతో 15 రోజులు పడకవేశారు. చివరి మూడు రోజుల్లో మా తల్లిగారిని పిలిచి 'ధైర్యంగా వుండు. పిచ్చిదానా యేడవకు. శ్రీ మాస్టరుగారు మనలనందరినీ విడిచిపెట్టి వెళితే యేం చేశాము. అంతే ...' అన్న మాటలకు అర్థం తరువాత తెలిసింది. 'ఈరోజు శ్రావణ పౌర్ణమి శ్రీ మాస్టరుగారు పుట్టినరోజు. నేటితో అటో....ఇటో....తేలాలి' అని ప్రార్థనలో కూర్చున్నారు శ్రీవారు. అంతా యేమవుతుందోనని ఖంగారు పడుతుంటే, ఇంతలో మా ఇల్లు గలాయన కొచ్చి వెంకటేశ్వరరావుగారు భార్యకు తీవ్రమయిన తలనొప్పి బాధ పెడుతున్నదని, శ్రీవారి చెవిన ఆమాటవేస్తే భార్యకు తగ్గగలదని వచ్చారు. ప్రేయరు హాల్లో కూచున్న అనేక మంది శిష్యులు డాక్టర్లు ఆయన ప్రశాంతంగా వుండాలి. మనస్సుకి ఎటువంటి అలజడి వుండకూడదు. కనుక మీరు తరువాత రండి అని చెప్పడము, లేదు ఒక్కమాట ఆయన చెవినవేసి వెళ్ళిపోతాను అని ఆయన అనడము డాక్టర్లు వద్దని వారించడము విన్నశ్రీవారు ఆయన్ని రమ్మనమని ఇంటికి వెళ్ళేటప్పటికి అంతా తగ్గుతుంది నాయనా! అని చెప్పడము జరిగింది. మరుక్షణమే ఆయన సంతోషంగా వచ్చి భార్యకు తలనొప్పి తగ్గినట్లు చెప్పారు. అది విన్న శ్రీవారు 'చూడండి బాబూ.... శరీరమంతా శిథిలావస్థలో వున్నా ఆ ఈశ్వరశక్తి యేలా పని చేస్తుందో!....' అన్నారు. అంతే. చివరి క్షణంలో కూడా శ్రీవారివల్ల మేలు పొందిన మనం చివరికి ఆయన్ని దక్కించుకోలేక పోయినాం. మన మొర

లను ఆ భగవంతుడు ఆలకించలేక పోయాడు. శరీరం వెళ్ళిపోయినా ఆయన ఆత్మ మాత్రం మనదగ్గరే వుంది. అది చూసుకోగలిగితే చాలు. తలచినప్పుడు కనబడే ప్రత్యక్ష దైవం శ్రీవారు.

చివరికి ఆయన మిగిల్చిపోయినది ఆస్తిపాస్తులు కాదు. కీర్తి ప్రతిష్ఠలు, సత్యధర్మాలు కలకాలం నిలబడగల నిధి, తరిగని పెన్నిధి, శ్రీవారి సన్నిధి.

అదిగాక సాహిత్య సంపదను యిచ్చారు. వీటిని పదిలంగా చూసుకోగలిగితే చాలు. ఓ గురుదేవా! మీ అడుగుజాడల్లో మమ్మల్ని నడిపించు తండ్రీ....

శ్రీనిరంతరానంద నిశ్శ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిష బాధకము స
మగ్రవిజ్ఞానదము మహామహిమఘనము
శరణమగు మాకు సద్గురు చరణ యుగము....

[వే. ప్ర]

[నందివెలుగువాస్తవ్యులు, విద్వాంసులు, యోగమిత్రులు అయిన శ్రీ సోమరాజుపల్లి వేంకట్రామయ్యగారు గురుదేవులను గూర్చి ప్రసంగవశాన చెప్పిన మాటల్ని సహృదయులు డా॥ గూడూరి నమశ్శివాయగారు సేకరించి ప్రకటనార్థం 'మణిమంజరి'కి పంపినారు–సం॥]

[All is one life-యావజ్జీవనం జీవనైక మాత్రం-

శ్రీ అనుభూతిని పొందారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు. శ్రీ అనుభూతిని పొందనంతవరకు యోగసిద్ధిలేదు. ప్రభాకరశాస్త్రిగారు యీ అనుభూతిని అంటే యీ సిద్ధిని treatment ద్వారా అందుకోగలిగారు. యోగతత్వ విచారంకంటే యావజ్జీవనం ఒకటే అను అనుభూతి వారికి treatments ద్వారా హస్తగతమైనది–ఆయన విశ్వాసం మహత్తరమైన విశ్వాసం. త్ర్యక్షర మంత్రము (C. V. V.) ఆయనకు సాధనం. అనుతాపమే ఆయన యోగసిద్ధికి మార్గం. ఆయనది గౌతమబుద్ధుని అంశ కాబట్టి విశ్వప్రేమను పై మంత్రం ద్వారా అనుభూతికితెచ్చుకుని తపస్సులో సిద్ధిపొందారు. C. V. V. విశ్వప్రేమకు సంకేతం కదా! ఆయన సాహిత్యోపాసకుడు కాబట్టి (Man of Literature) తన యోగసిద్ధిని సాహిత్యంలో ప్రతిబింబించి విఖ్యాతులయ్యారు. శాస్త్రిగారిది సమగ్రదృక్పథం. పూర్ణదృక్పథం. ఆ దృక్పథంలో ఉత్తమ మానవలక్షణాలన్నీ అలవడినాయి వారికి.

సోమరాజుపల్లి వేంకట్రామయ్య-

విజయవాడ. 20-11-81

# సాహిత్యం

## అన్నితరగతులవారికి అనుభవింపతగి వుండాలి

– వేటూరి ప్రభాకరశాస్త్రి

[ఈ రేడియో ప్రసంగం 1943 ఏప్రెలు 25వ తేదీ ఆదివారము ఆంధ్ర పత్రికలో అచ్చు పడింది. అప్పుడు వారాశించిన ఆ పనులన్నీ నేటికీ మనం సంపూర్ణంగా సాధించుకొన్నాం అనుకో వీలులేదు. జరుగవలెను. ఇంకా ఎంతో జరుగవలెను-సం॥]

జరగవలెను, జానపదగీతములను సమకూర్చి, పరిష్కరించి, సముచితప్రచారముతో వాటిని సంరక్షించడం వెంటనే జరగవలెను. జగద్గురుని దగ్గఱ నుండి చచ్చుడివానిదాకా ఉండే ప్రజల తరగతుల లోనూ, ఉగ్గుపాలనాట నుండి ఉసురుడిగే నాటిదాకా ఉండేవయోదశలలోనూ, పట్నంనుంచి బరంపురం దాకా ఉండే దేశవిభాగములలోనూ, అంతరాంతరములతో విలసిల్లుతూఉన్న, ఆంధ్రసాహితీ సంపదకు సర్వతోముఖాభ్యుదయము జరగవలెనూ అంటే, దానిపునాదులు గట్టిగా, దిట్టముగా కూలిపోకుండా కుదుర్కొనవలెను గదా! ఆంధ్రసాహిత్య సౌధమునకు అసలు పునాదులేవీ అంటే, అవి, నానుళ్లు, పలుకుబళ్ళు, సామెతలు, జంటపలుకులు, పనిపాటలవారి పరిశ్రమగీతాలు, బాలకుల ఆటపాటలు, స్త్రీలసౌభాగ్యగేయాలు, నోముపాటలు, బిచ్చగాండ్ర పరిదేవనపు పాటలు, భక్తుల ప్రార్థనగీతాలు, వృద్ధుల వేదాంతకీర్తనలు, జానపదుల వీరకథాగేయాలు, జాతుల చరిత్రకథాగేయాలు రాజుల బిరుదావళులు, భట్టురాజుల ప్రశంసారచనలు, చాటూక్తులు, చమత్కార కథలు, పొడుపు కథలూ ఈ వగైరాలన్నీని. ఇటువంటివన్నీ పల్లెటూళ్ళలో ప్రజల నాలుకమీదనే నాట్యమాడుతూఉంటై. ఇటువంటి వాటిలో ఆయాజాతుల ప్రజలకు సహజమయిన యభిరుచులూ, పలుకుతీరులూ, కూర్పు నేర్పులూ, ఛందస్సందర్భములూ, సారస్య వైరస్యములూ, ఆశావాసనలూ, అన్నీ అమాయికముగా అద్దములోవలె ప్రతిఫలిస్తూ ఉంటై. వాటితీరుతీయముల ననుసరించి సాగించే వాఙ్మయనిర్మాణము, నిర్వక్రమై జాతివార్తా చమత్కారపూరితమై అతుకుల బొంతగా కాకుండా, జాతిశరీరమునకు అందచందముల నాపాదిస్తూ, అత్తుకొని వెలయగలుగుతుంది. పూర్వము సంస్కృతాధిక్య సంబంధమూ, ఇటీవల బెంగాలీ, హిందీ ఇంగ్లీషు రచనాధిరానుకరణమూ జాతిభాషా స్వభావమున కత్తుకొనియున్నదా? వికృతి కలిగించుచున్నదా? మీనిమూలమున జాతిభాషా స్వభావానుగుణరచనలకు సంశయము కలుగుతున్నదా? అందు గుణమేది, దోషమేది, గ్రాహ్యమేది, త్యాజ్యమేది? ఇత్యాదిసందర్భములను సరిగా గుర్తించుటకునుకూడా మీద నేను పేర్కొన్న పునాదిరచనల సేకరణము, పరిశీలనము, సముద్ధరణము ముఖ్యకర్తవ్య మవుతుంది.

## సాహిత్యం అన్ని తరగతులవారికి అనుభవింపతగి ఉండాలి

హిందీఛందస్సు తెల్గుకు కుదురుపడక పోవచ్చును—దిగ్రదొక్కబడిన మన పాటల పదాల ఛందస్సు ప్రౌఢ కావ్యరచనకుకూడా పనుపడ వచ్చును. చమత్కారాధాయకము లయిన సర్వవిధ భాషారచనలూ, ప్రాచీనకాలము నాటివి సంరక్షితము లైతే, అందులో మేలేర్చుకొని భావిభాషారచయితలు తమ రచనములలో అనుగతపఱచుకొంటారు. ప్రాచీనదేశిరచనల పరిశీలనము జరగకపోతే, జాతి భాషా స్వభావానుగుణములయిన హృద్యార్థముల సుజగించడమా, వానికి బదులుగా అననుగుణములయిన వైజాత్యార్థముల నవలంబించడమా జరిగవచ్చును. జరుగుతున్నదికూడాను ; మఱీన్ని సాహితీవినోద మన్నది జాతిసౌధములో పైఅంతస్తుమీద కూర్చున్న ప్రౌఢ రసిక ప్రజానీకమునకు మాత్రమే యుపయోగపడునదిగా నుండరాదు. అది అన్ని అంతస్తులవారికీ వారివారి యభిరుచులకు, అర్హతలకు తగినతీరులతో అందుబాటులో నుండతగినదై యుండవలెను. బాలురకు, పామరులకు, స్త్రీలకు, పనిపాటలవారికి, దేశము పలుమూలలవారికి, పలు తరగతులవారికి, అందరికీ అన్ని యంతరములలోనూ అనుభవింపతగినదై యుండవలెను. కనక, అనాదికాలమునుండీ యున్ని యంతస్తులవారికీ ఇన్ని యంతరములలోనూ ఉపయోగపడుతూ వచ్చిన సాహితీరచనావిభేదములు అంకురప్రాయములే యయినా, మనకు ఆదరించి పెంచి పెద్దచేయ వలసినవే అవుతున్నవి.

### కాని యిది చాలదు

ఇందుకై యూనివర్సిటీవారు, దొరతనమువారు, సాహిత్యపరిషత్తులవారు, మునిసిపాలిటీలవారు పనిబూని అక్కడక్కడి సాహితీపరికరములను వెంటనే సమకూర్చేయత్నముల సాగింపవలసియున్నారు దేశము నలుముఖముల ఉన్న పండితులు, భాషాభిమానులు, జేబులలో నోటుబుక్కులుంచుకొని ఎక్కడివారిక్కడనే తమతమ ప్రదేశములందలి చమత్కారాధాయకమయిన సర్వసాహితీపరికరములనూ సంధానింపబూనవలెను. యూనివర్సిటీవారు మొదలగు వారు వారి నందుకై వినియోగింపవలెను. ఆసభలలో సంధానితములయినవాని పరిశీలనము జరుగుచుండవలెను. పరిశీలితములు ప్రకటితములవుచుండవలెను ఈ విధముగా సాగించినచో కొన్ని వాల్యుముల పరిమాణపు భాషాసాహితీ పరికరము బయల్పడగలదు. ఈ నాటికే కొందఱు యథాశక్తిగా నిట్టి పరిశ్రమము జరిపిరి. జరపుచునున్నారు. కాని యది చాలదు. సామెతలు పాటలు పదాలు మొదలయినవి కొన్ని యక్కడక్కడ ప్రకటితములగుచున్నవి. అంతేకాని, నానుడులు, జాణ్ణుడులు, పలుకుబళ్లు, నుడికారములు, జాతివార్తలు మొదలగున వెన్నో యింకను పరిశీలనోపక్రమమే జరుగని వున్నవి. గేయరచనములింక నెన్నో యపరిశీలితములు ప్రకటితములుగాకనే యున్నవి.

### తెలుగురచనల మూలప్రకృతులు

నేనీనడుమ శ్రీశైల ప్రాంతారణ్యమున ఫారెస్టు రేంజరుగా నున్న వారి నొకరిని గలిసికొనగా వారక్కడి యాటవికులగు కోయ చెంచుజాతులవారి తెలుగుభాషను గూర్చి వారికి నేడు జరుగుచున్న తెలుగుస్కూళ్ళ విద్యావిధానాదికమును గూర్చి, వారి యాచారవ్యవహారములను గూర్చి, యాటపాటలను గూర్చి కొన్ని వింతవిషయము లెఱిగించిరి. వారి యాటపాటలను సేకరించి వెల్లడింపగా వారిని కోరితిని. తెలుగు సాహిత్యరచనలలో నొక విభాగమగు 'కురవంజి' కురవ-అనగా కోయజాతివారి

యంజె——నృత్యముతో సంబంధించిన గేయరచన మని నాతలంపు ఆకోయ కురవ చెంచుజాతులవారి పాటలు పదాలు తెలుగురచనల మూలప్రకృతులు.

## కాటమరాజుకథ రామాయణంనాటిదా?

మణిసన్ని పల్నాటి వీరచరిత్రము కాటమ రాజుకథ అన్న ప్రాచీన వీరకథాపదరచనలింకను నప్రకటిత ములుగానే యున్నవి. కాటమరాజుకథను నేను సముద్ధరించి, సనిపఱిచి ప్రకటించే ప్రయత్నములో ఉన్నాను. ప్రకటించే అనుకూల్యం ఏర్పడితే దాని లోని మెఱుగులు వెల్లడికాగలవు. కాకతీయులకు సంబంధించిన కాకతమ్మకథ, ఏకవీరకథ, మాతంగి కథ మొదలయిన చారిత్రిక కథాగేయములు సేకరింప వలసియున్నవి. ఈనడుమ రంగనాథరామాయణము సంస్కరణ పరిశ్రమలో నేను రాయలసీమలో బహుళ ప్రచారముగల గేయరచనమును విన్నాను. అది రంగనాథరామాయణకర్తయిన గోనవంశపు రెడ్లకు, అంతేకాకుండా రామాయణకథకు గూడా సంబంధించినకథ. దాని కథాసారమిక్కడ కొంచెము వినండి—

గోన కాటారెడ్డి అయోధ్యకు రెడ్డి. అంటే మాధికారి. ఇది శ్రీరాములు నాటి కథ. రాములవారరణ్య వాసమున నుండిరి. రామరాజ్యం, భరతుడి పట్టం. భరతుడు రాచకార్యములు చూస్తున్నాడు. దశరథుని నాడు ఎక్కువశిస్తులిచ్చి బాధలుపడిన రెడ్డి వారంతా యోచించి అయోధ్య భూములన్నీ భరతుని రాజ్యం పదునాలుగేండ్లూ కోరుకు పుచ్చుకున్నారు అందు భరతుని మోసగించినవారు చాలా ధనవంతు లయిరి. భరతుడు బీద యయ్యెను. రాములవారు మరల రాజ్యమునకు వచ్చి సంపన్నులయిన రెడ్ల నెల్ల సన్మానించిరి. అప్పుడు దశరథ ప్రత్యాబ్దికమునకు కానుకగ గుమ్మడి పండును రాములవారు గోన కాటమరెడ్డిగారి నడిగిరి. అతడు వేలకొలదిగా తెప్పించి యిత్తుననెను ఆయేడు గుమ్మడితీగ లన్నియు చీడపట్టి కాయలులేని వవుటచేత ఎంత వెదికినా రెడ్డికి గుమ్మడికాయ దొరకలేదు. గుమ్మడి కాయంత బంగారిత్తుననెను. శ్రీరాములవారి కోటలో నొక గుమ్మడితీగ కాయకాచెను. ఆ కాయతో తూచగా రెడ్డి కుటుంబములవారు భరతుని మోస గించి యార్జించిన బంగార మంతా వేసి చూచినా చాలకపోయెను. అప్పుడు రెడ్డిగారి పెద్దకోడలు పెదరాచమ్మ పరమ సాధ్వి తన తాళిబొట్టు బంగారు వేసి తూపించెను. దానితో తూకము సరిపడెను. అంతటితో రెడ్లు బీదలయి యా దేశమున నుండ లేక నొక కుంటి యెద్దుతోను, ఒక గ్రుడ్డి దున్న తోను దేశాంతరముల పాలయి వచ్చి, దక్షిణమున ఆంధ్ర దేశమున అడవిలో విడిసి క్రమముగా నక్కడ నొకయూరు నిర్మించు కొనిరి. అదే రాచూరు. (నేటి రాయిచూరు). అడవి కొట్టి, సాగుచేసి సంపన్నులై యక్కడ కోటకట్టిరి. అదే రాయిచూరు కోట. ఇత్యాదిగా నా కథ కొంత చరిత్ర, జాతికథాంశ సమన్వితమై యింకా యెంతో వింతతీరుతో నున్నది. ఇట్టి రచనలెల్ల సుద్ధరింప వలసి యున్నవి. మణిసన్ని రుచిగల తెలుగు పలుకు బళ్ళ నింతకుమును మెవ్వరూ సేకరించి వెల్లడింప లేదు. మాట వరుసను అట్టి వాటినికొన్నింటిని వినిపిస్తున్నాను. ఇప్పుడు నేనన్న 'మాటవరుస' అనేదికూడా ఒకమంచి పలుకుబడే. మంచి మంచి పలుకుబళ్ళను నానుళ్ళను చిలుకలు పండ్లపలుకులను కొట్టి పోసినట్టు కొట్టిపోసే జగజాణలు దేశమున పలువు రున్నారు. వారి పలుకుతునకలన్నీ సేకరించి ప్రకటింపవలసినవి.

## నానుళ్లూ పలుకుబళ్లూ

ఇంకా ఊరి ప్రొద్దు క్రుంకలేదు, ఏడీగానివేళ, చేతావాతా గాదు, గొడ్డూ బిడ్డా అన్నారు - ముత్యాల

ముగ్గులూ రత్నాల రంగవల్లులూను-పల్లెత్తు మాటైనా పలుకడు–బుగ్గపోట్లు పొడిచారు. పుంజు కూత పట్టింది–టాపిరి నలపకుండా పనివున్నది–ఆవూళ్లో వచ్చి మంచినీళ్లు కూడా దొరకవు–కాళ్లావేళ్లా పడి బతిమాలుకున్నాడు–రాళ్ల కడ్డాలు వస్తాడు-పదికాలాల పాటు బాగుండవలెను. కాలకులనీళ్లు గోళ్ళ చిమ్మి నాడు- పద్దాకా అదే వనా?–చేదోడూ వాదోడూను–పుట్టెడు సిరి మోసుకొస్తున్నది- చీమ చిటుక్కు-మంటే వినబడుతుంది- ఎదుటున్నవాడు పెళ్ళి కొడుకు- ఇత్యాదులు పలుకుబళ్లు త్రవ్వి తండములుగా తెలుగులో ఉన్నవి. ఇటువంటి వాటినన్నీ సేకరించేవారినీ ప్రకటించే వారినీ సముత్సాహపరిచి వారివారి సేకరములు ప్రచారమునకెక్కునట్లు చేయుట మిక్కిలి కావలెను. ❋

(ఆలిండియా రేడియో వారి సౌజన్యముతో)



ముత్త్యాలలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్సమావేశము చూ. పు. 11
అధ్యక్షస్థానంలో మల్లంపల్లివారు
వారి కుడిప్రక్కగా గురుదేవులు.



సోదరులతో గురుదేవులు
వెనుకవరుసలోనున్నవారు (ఎ. నుండి కు.)
1 శంకరశాస్త్రి [2 చల్లా సూర్యనారాయణ]
3 వెంకటశివశాస్త్రి 4 చంద్రశేఖరశాస్త్రి

# చాటుపద్య - మణిమంజరి

## వేంకటాచలవల్లభాష్టకము

శ్రీరమారమణీ మనోహర శీతభాను కళాననా  
వారిజాసనవంద్య దానవంశ సంక్షయకారణా  
వారిజాక్షిని గూడరా శుకవాణిరా పువుబోణిరా  
వీరసామజ సింహ తిరుపతి వేంకటాచలవల్లభా!

ఒంటగించి పుటింటిలోపల నొంటనుంట యెఱుంగరా  
బంటుపంతము మాని మాచెలి ప్రాణములు వడినిల్పరా  
గొంటుఁదనములు సేయనేటికిఁ గొమ్మరా నిను నమ్మెరా  
వెంటనే దయఁజూడు తిరుపతి వేంకటాచలవల్లభా!

కప్పురము కస్తూరిగంధము కానికలు నీకంపెరా  
ఒప్పుతోఁ గైకోర యిటువలె నోరఁజూపులు మానరా  
చెప్పరాదుర చెలియ విరహము చిత్తగించర దానినీ  
విప్పు లేటికి దిగువ తిరుపతి వేంకటాచలవల్లభా!

కన్నతల్లి మఱుంగుదానిని గాకుసేయుట న్యాయమా  
కన్నె ప్రాయపు వన్నెలాఁడిర కలికి నీరజనేత్రిరా  
నిన్నెకాని మఱన్నెమెఱుఁగదు విద్దురా నీకె ముద్దురా  
విన్నపం బిదిగోర తిరుపతి వేంకటాచలవల్లభా!

కోరి చెక్కిలి చీఱ డెందము గ్రుచ్చి యెదలో నూన్పరా  
చేరి చక్కెరక్రోవి యానర చిత్తతాపము మాన్పరా  
మేఱమీఱిన కాయసౌఖ్యము మీననేత్రికిఁ గాన్పరా  
వేఱుసేయఁగఁదగదు తిరుపతి వేంకటాచలవల్లభా!

ఎలమిఁ జంద్రుఁడు గాయఁగా మరుఁ డేయఁగా నలి మ్రోయఁగా
వెలఁగి కోకిల సద్దుసేయఁగఁ జిలుకపలుకులు దాయఁగా
మలసి చల్లనిగాలి వచ్చఁగ మారుతాపము నోర్వఁగా
వెలఁది యోర్వదు రావె తిరుపతి వేంకటాచలవల్లభా !

పలుకుపలుకున నీదు చక్కని పాడి పల్మఱుమెచ్చురా
కులుకు గుబ్బల చెమట జాఱఁగఁ గూర్మితో నినుఁ బిల్చురా
చెలులు దగ్గఱనుండి చూచిన సిగ్గు దోఁపఁగ నవ్వురా
వెలఁది యోర్వఁగలేదు తిరుపతి వేంకటాచలవల్లభా !

పొందలక్ష్యము సేయనేటికిఁ బొన్న పూవులపాన్పుపై
అందములరఁగ జాజిశయ్యను అతివ నేలుకో వేడ్కతో
ముంచు నీపని నమ్మియుండిని మోసపోతిని దానికిన్
విందవె దయసేయు తిరుపతి వేంకటాచలవల్లభా !



# జ్ఞాపకాలు

వేటూరి ప్రభాకరశాస్త్రి

తప్పట్లు వేయకండట్లా కుఱ్ఱల్లారా సరిగా చప్పట్లు వేయండి అంటూ

'రామరామ రామరామ। రామ యేల పలుకవు
పలుకుమన్న పలుకవు। పంచదార చిలుకవు—'

అని ఆరంభంగల రామాయణపదం నేర్పుతూ సరిగా చప్పట్లు వేయిస్తూ మా వూరి పెద్దలొకరు మమ్ము ఆడించడం నా యెఱుకకు ఆరంభకాలం. వారు తప్పు తాళపు చప్పట్లను తప్పట్లనడం నాకు బాగా జ్ఞాపకం.

ఎడెనిమిదేళ్ళవాడను—ఏదో తప్పు చేసినట్లున్నాను. మా అమ్మగారు గట్టిగా కొట్టిరి. ఎక్కడో ఉన్న నాన్నగారి దగ్గఱికి వెళ్ళి నా గోడు వెళ్ళబోసుకున్నాను. తల్లిప్రేమ వివరిస్తూ కాశీఖండంలోని గుణనిధి కథ చెప్పి ఈ పద్యం నాకు నాన్నగారు నేర్పినారు.

'అరుణ గభస్తి బింబ ముదయాద్రిపయిం
బొడతేరం గిన్నెలో
బెరుగును వంటకంబు వడపిందెలునుం
గుడుపంగ బెట్టు ని
ర్భర కరుణాధురీణయగు ప్రాణము ప్రాణము
తల్లి యున్నదే
హరహర! ఎవ్వరింక కడుపారసి పెట్టెద
రీప్సితాన్నముల్.'

నాడే నాకా పద్యం నోటికి వచ్చింది. తదాది శ్రీనాథ రచనలమీద నాకు గౌరవం కలిగింది.

మావూరి ఆంజనేయస్వామి గుడిలో, నేను పదేళ్ళవాణ్ణయి ఉండగా, బ్రాహ్మణ సంతర్పణ జరుగుతోంది. పండ్రెండు గంటల వేళ నేను భోజనానికి వెళ్ళినాను. గుడి తలుపుల సందుగుండా ఎవరో బైటనుండి తొంగిచూచారు భోంచేస్తున్నవారు గద్దించి కేకలు వేశారు భోజనాలయినవి. ఆరగించి తాంబూల చర్వణం చేస్తూ శిష్టతాభిమాని యొక బ్రాహ్మణుడు వాకిట ఉన్న బడుగు బైరాగిని చెడదిట్టినాడు. 'లోని సందడి సంతర్పణ మవునో కాదో అని చూచానండీ! మీరు కోప్పడ్డ తర్వాత చూడనే లేదండీ! ఎండబడి వచ్చితిని. ఇంత ప్రసాదం పెట్టించండి బాబూ. కడుపుమంట ఆర్చుకొని వెళ్ళిపోతాను' అన్నాడా బైరాగి. 'సంతర్పణ చెడగొట్టి యింకా భోజనం పెట్టమంటావా? పో భ్రష్టుడా శూద్రులిండ్లకు పో! ఇంకా ఇక్కడ భోంచేయవలసిన బ్రాహ్మణులున్నారు- ముందే నీ కెవరు పెడతారు?' అన్నారు ఆరగించిన బ్రాహ్మణులు కొందరు. ఆ బైరాగి మధ్యాహ్న సూర్యునికేసి చూసి, దోసిలి పట్టి 'సర్వము చూస్తున్నావు. నేనే పాపము ఎరుగను. ఇంతమాధవకబళం అడిగితే తిట్టుతున్నారు. ఆకటి మంట కంటె వీరి తిట్లమంట నన్ను దహిస్తోంది. నెత్తిన గుడ్డ వేసుకుపోతున్నాను,' అంటూ అదే పోకగా వెళ్ళిపోయినాడు. నా ఒళ్ళంతా కంపించిపోయింది. కళ్ళు బైర్లు కమ్మినవి. ఇళ్ళుచేరక ముందే నాకు తీవ్రజ్వరం వచ్చింది. కొంత సేప

టికి తిన్నదంతా వాంతి అయింది. నాల్గురోజులదాకా ఆ జ్వరం విడిచిపెట్టలేదు. ఆ జ్వరం రోజులలో బైరాగి, వానిని నిందించిన బ్రాహ్మణుడూ కనుల ముందు కనబడుతూ నన్ను గజగజలాడించేవారు. తరువాత నేటికికూడా ఏ భిక్షుకుడు అగపడితే నాకీ వృత్తాంతము లోనుండి పొడుచుకొనివచ్చి చీకాకు కలిగిస్తూ ఉంటుంది. కొన్నేళ్ళకు మావూళ్ళో ఆ బ్రాహ్మణుని వంశమూ అంతరించింది. ఆ బైరాగి సంగతి ఆనాడే తెలియరాలేదు. ఈ రేడియో ప్రసంగం వ్రాయదలచుకొన్న రోజున పది గంటల వేళ భోజనం చేస్తూ ఉండగా వాకిట ఎవరో అయ్యా అయ్యా అని పెద్దగా పిలవడం, భిక్షుకుడనుకొని పిల్లలు పొమ్మనడం, నేను అంతలో ఆరగించి బైటికి వచ్చి ఆ బాల్యకథ స్మృతికి రాగా ఉలికి పడడం జరిగింది. బైటి మనిషి 'అయ్యా నేనండి మీ దర్శనానికే వచ్చానండి. ఈ ఊళ్ళో మీరున విచారించబోతే ఒగ్గగాట్టాని ఎందరో నామాట వినిపించుకోకుండనే పో పొమ్మన్నారండి. నన్నెరుగరాండి బాబూ! మీరు చిన్నప్పుడు నన్నెంతో ప్రేమించారండి- జ్వరం వచ్చిందండి- నన్ను మీరే కాపాడారండి!' అని యేదేదో చెప్పడం సాగించాడు. వానిని చూడగా నా పసితనం నాటి బైరాగే పీడనిపించింది. ఒళ్ళు మళ్ళీ కంపించింది. నాడు నేనెన్మిదేండ్ల వాడను. ఆ బైరాగి యాభైయేండ్లు దాటినవాడు! సరిగా ఆనాటి వానివలెనే యాభైయేండ్లు దాటిన వయస్సులో ఉన్నప్పటికీ వాడే వీడెట్లా అవుతాడు అనుకొంటూ విస్తరి మడచగా నల్వైయేండ్లకు ముందు పోస్టు మాస్టరుగా ఉన్న మా అన్నగారి దగ్గర బాయి మెసెంజరుగా తానున్నాననీ, అప్పుడు జ్వరం రాగా వానికి నేనుపచరించితిననీ, వాడప్పటికి పంద్రెడేండ్లు దాటిన వాడననీ వివరించి చెప్పగా అంతా గుర్తించి వానికి వేన్నీళ్ళ స్నానము బట్టలు, తిండి ఇంట్లో ఏర్పాటుచేసి తొందరగా ఆఫీసుకు వెళ్ళితిని. అతడు పోస్టుమేనుగా ఉండి చాలా సర్వీసుచేసి జబ్బుపడి ఆలు బిడ్డలు చనిపోగా పెంషన్ తీసుకొని బైరాగివలె అయి నావల్ల తన జబ్బుకు మందో మాకో పొందగోరి వచ్చినట్లు చెప్పినాడు. ఆనాటి బైరాగి చనిపోయి మళ్ళీ పుట్టి, నా యిర్వైయవయేట పది పంద్రెండేళ్ళవాడై నా తోడ్పాటు పొందడం, నా అర్వైరెండవయేట యాభైయేండ్ల వాడై నేడు మళ్ళీ ప్రత్యక్షంగావడం జరిగిందంటే ఎవరూ నమ్మకపోయినా నామట్టుకు అది సత్య విషయమే! ద్వేషం ఎంత చెడుపు చేస్తుందో ప్రేమ ఎంత మేలు చేస్తుందో దీనివల్ల తెలుస్తుంది.

చిన్నప్పట్నుంచీ నాకు కావ్యాలు చదివినా, నాటకాలు చూచినా, అందులో వినోద విశేషములున్నా ఇవన్నీ కల్పిత కథలేకదా అన్న కొరత గోచరిస్తూనే ఉండేది. కాలం గడచను గడచను వాటి మీద ఆదరం అంతర్ధానమౌతూ వచ్చింది. గాంధిగారి పవిత్ర వర్తనం ప్రఖ్యాతమైన తర్వాత ఆలాంటి కావ్యాలు చదవడం నాటకాలు చూడడం కట్టిపెట్టినాను. సంస్కృతంలో భవభూతి ఉత్తరరామ చరిత్ర, హర్షుని నాగానందం, ధీరనాగుని కుందమాల, ఇవే నేను చదివేనాటకాలు. భారతంలో యుద్ధ పంచకం చదవబోయినా, యింకే యుద్ధ కథా కావ్యాలు చదవబోయినా నా కళ్ళు బరువెత్తి మూసుకుపోతై. ఇర్వై యేండ్లకు ముందు నాటక ప్రయోక్తలు నిర్బంధిస్తే శాకుంతల నాటకం చూడబోయినాను. దుష్యంత వేషధారి 'కిం శీతలైః క్లమవినోదిభిః' ఇత్యాదిగా గల కాళిదాస శ్లోకమును దాని తెలుగు పద్యమును రెట్టించి చదివి, శకుంతలా వేషధారి కాళ్ళ పిక్కలు పిసగసాగగా, మాతృదేవత లయిన స్త్రీలు— అందు కొందఱు వృద్ధ వితంతువులు, పసి బాలికలు కూడా ఉన్నారు నానా విధాల వైరస్యాలకు సారస్యాలకు పాల్పడడం చూచి రోతగొని యిక జన్మలో నాటకాలు చూడ

రాదని నిశ్చయించుకొన్నాను. అంతకు ముందే మిత్రులు గుండాడ అప్పారావుగారితో వెళ్ళి మాట లేని సినిమాలో విక్టరు హ్యూగో నావలు ప్రదర్శనం చూచాను. అంతే. టాకీ సినిమా నేనింతదాక చూడ లేదు. కల్పితేతి వృత్తములతో కథలూ, కబ్బాలూ కట్టడం ఎప్పుడో కట్టిపెట్టినాను.

నా పసితనంలో రెండేండ్ల వయసు సోదరికి జబ్బుచేసింది. ప్రాణాపాయ భయం కలిగి పిల్లల కందరికీ వడిగా అన్నంపెట్టించి బైటికి పంపివేశారు మా నాయనగారు. గుళ్లోకిపోయి దేవుణ్ణి ప్రార్థిస్తూ కూర్చున్నాను. పది గంటల వేళనుండి సాయం 5 గంటల దాకా నేనక్కడే నక్కి ఉన్నాను. పిల్ల రెండు విరేచనాలయి జబ్బుతగ్గి తేరుకుందిట! మా నాన్న నాకైవెదికి భయపడి పది మందికీ చెప్పగా నా ఉనికి తెలుసుకుని వచ్చి నన్నుచూచి పిల్ల సుఖంగా ఉన్నదని చెప్పి నన్ను గూర్చే దుఃఖించి నన్నింటికి తోడ్కొని వచ్చెను. అప్పుడు నా ప్రార్థనమేమో పనిచేసి ఉంటుందన్న యెఱుక నాకులేదు. మఱి పెక్కేండ్లయిన తర్వాత దేశాట నంలో ఒక ఊరి రాత్రివేళ శయనించి ఉండగా కడుపులో మంట, వికారము నాకు రేగెను గ్రామ మునసబు మేడ మీద నేనుంటిని. మునసబును లేపి దాహం తాగవలె నంటిని. రాత్రి రెండు గంటల వేళ అతడు మంచినీళ్ళకై బ్రాహ్మణు లింటికి లాంతరు మనిషి నిచ్చి పంపెను. వెళ్ళి చూడగా కుటీరములో దంపతులున్నారు. భర్త మరణ యాతనలో ఉన్నాడు. భార్య ఏడుస్తున్నది. ఆప ద్బంధువులెవరో వచ్చిరని భార్య వాకిటికి వచ్చింది. లాంతరు మనిషి మంచినీళ్ళకు వచ్చితిమనెను. నేను జబ్బు సంగతి వింటిని. వాంతులు, జ్వరము చాలా ఒడుదుడుకుగా ఉండెను. ఆయమ్మ యిచ్చిన మంచినీళ్ళు త్రాగక కాళ్లు కడుగుకొని వచ్చివేసితిని. ఆ రాతిరంతా నాకు నిద్రలేదు. ఊరంతా నిశ్శ బ్దము. ఆ యిల్లాలి యేడ్పువినే ప్రభువు లేడాయని నాక్షోభ. బాగా తెల్లవారేదింకా నేను లేచివెళ్ళి అడిగాను. 'మీరు వెళ్ళితిరో లేదో నిద్రపోయా రండి.' ఇప్పుడే లేచి ఎట్లా ఉన్నదని అడిగితే రాత్రి ఆ వైద్యుడిచ్చిన మందు జబ్బు కుదిర్చింది అంటున్నారు? రాత్రి మందెవ రిచ్చారండీ అంటే పిచ్చిదానా లాంతరుతో మనిషివెంట వైద్యుడు రాలేదుటే! నీవు మంచినీళ్ళు ఇచ్చావు కూడాను అంటున్నారు. మిమ్మల్ని వైద్యులనుకొన్నారల్లే ఉంది, అని నవ్వుతూ ఆమె చెప్పగా సంతోషించి వచ్చివేసితిని. అప్పుడూ నా అనుతాపమూ ప్రార్థనా ఏదోపని చేసిందని గుర్తించలేక పోతిని. తర్వాత కొన్నాళ్ళకు ఇట్టివి ఎన్నెన్నో విస్పష్టంగా గోచరించ సాగినవి. ఇవెందుకు చెప్పినా నంటే తీవ్రానుతాపముతోడి యీ ఈశ్వరు ప్రార్థన సర్వా పన్నివారకమనీ మహా మహిమగలదనీ వెల్లడించ డానికే.

శ్రీమద్రామాయణంలో 'స్మిత పూర్వాభి భాషీచ పూర్వ్వ భాషీచ రాఘవః' అన్నది చదవినప్పటి నుండీ, నాకు వివేకం కలిగినప్పటినుండీ ఎంతో తంటాలు పడుతూనే ఉన్నానుగాని, ఒక జబ్బు నాకింకా తిన్నగా కుదరకుండానే వుంది. కోపం వచ్చి అది దీర్ఘకాలం ఉండిపోయి చెడ్డపనులు చేయించడం లేదుగాని, అయినా దబీల్న కోపం వస్తుంది. అంతలో పోతుందికూడా. అదిరావడమే తప్పుకాదూ? చల్లని హృదయమైతే చల్లని మాటలే రావద్దూ? కొందఱు పైకి నవ్వులు, లోపల కొంప్పు లుగా ఉంటారు. అది నా చేతగాదు. లోనెంతో బైటా అంతే. అంతేకాదు, లోన తియ్యగా బైటికి కారంగా కూడా ఉంటాను. నాలోనే ఎంతో చెడుగు ఉన్నదన్నమాటేగా! స్కూళ్ళలో టీచర్లు కొందఱు విద్యార్థులను తిడతారు, కొడతారు. విద్యార్థుల

మేలుకే అట్లా చేయిస్తుంటూ అపలాపిస్తారు కూడా! పంతుళ్ళ కోపంలో ఈ శిక్షలు వారి దురుద్రేకపు దుడుకు తీర్చుకోవడానికే గాని విద్యార్థుల మేలుకు కాదు. జరిగిన విషయమే ఒకటి:- తిరుపతిలో కోతులెక్కువ. పిల్లలకు ఏటి సహవాసం! కొట్టేవాళ్లను చూస్తే కోతులెక్కువ గోలచేస్తై. మంచి బుద్ధి మంచిదే-అయితేనేం, మా వాడొకడు హైస్కూల్ టీచరు. పిల్లల్ని కొట్టేవాడు. ఒకనాడు కొట్టి కోపపడితే పిల్లలు గోలచేశారు. అంతట అందర్నీ చితగగొట్టినాడు. మరీ అల్లరి. సాయంకాలం అరడింకా రాకముందే ఆ అల్లరి వార్త నా దగ్గరికి పరుగెత్తుకు వచ్చింది. నాకూ కాస్త కోపం కలిగింది గనుక పదిమంది ముందర విదలించి అడిగినాను. కొట్టకుండా ఎట్లాగండీ అని తన్నేదో సమర్థించుకోబోయినాడాతడు. మాటాడనీకుండా మందలించినాను. పిల్లల్ని కొట్టినట్టు నన్ను కొట్టజాలక గొణుగొణులాడుతూ కోపోద్రేకంతోనే యింటికి వెళ్లిపోయినాడు. రాత్రి నిద్ర పట్టకపోవడంచేత అతనికి దోమకుట్టు తెలియవచ్చింది. ఈడ్చి ఎడమ జబ్బమీద కుట్టుతున్న దోమను కుడిచేతితో చరచినాడు. చరుపుకు ముందే దోమ దూసుకుపోవడం ఎప్పుడో పదేండ్లనాటి పాత డిస్లొకేషన్ జబ్బ మళ్లీ జారిపోవడం జరిగింది. కళ్ళు తిరిగినై. ఎట్లో సర్దుకున్నాడు. నిద్రరాలేదు. స్కూలుపని మిగిలి ఉంది. నాడాది వారం, పని అంతా ముగించాలి అని ఉదయం కాంపోజిషన్ పుస్తకాల కట్ట దిద్దుతుండగా రెండేళ్ళ తన బిడ్డవచ్చి ఫౌంటెన్ పెన్ సిరాబుడ్డి బోర్లించి సిరాతో పుస్తకాల నభిషేకించింది. ఈడ్చి చెంప మీద చరిచినాడు. పిల్ల స్మృతి తప్పిపడిపోయింది. ఒళ్లు సల్లబారింది. అత్త, ఆలు ఇంట్లో అన్నం తింటున్నారు. వారికి తెలియకుండా పిల్లను బుజాన వేసుకొని నా దగ్గరకు పర్వెత్తుకొని వచ్చాడు. ఏడ్చాడు. పిల్లను ఒళ్లోకి తీసుకొని నేనూ దుఃఖించి, ఉపచరించి, స్మృతిరాగా పిల్లనప్పగించినాను. అప్పట్నుంచీ స్కూలు పిల్ల లల్లరి చేస్తే కోపంవస్తే తన పసిపాప కథ ప్రత్యక్షమౌతుందట! చక్కబడ్డాడు.... తడిసి గుడిసె కట్టినాడు. ఈలాగంటి ఆప్తులు చుట్టు వారు ఉండడంచేత నేనూ, నావల్ల వారూ తప్పులు గుర్తించుకొంటూ దిద్దుకొంటూ ఉంటున్నాము.

(ఆలిండియా రేడియో సౌజన్యంతో)



# ప్రజ్ఞాప్రభాకరము - ఒక పరిశీలన

పోచిరాజు శేషగిరిరావు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి మహోదయుల జీవితోదంతము, ప్రజ్ఞాజీవితోదంతము రెంటిని దెల్పు స్వీయ చరిత్ర 'ప్రజ్ఞాప్రభాకరము[1]' తెలుగున స్వీయ చరిత్రలు వెలయించుకొన్న ప్రాచీనులు అందును కవులు లేరనియే చెప్పవచ్చును. పందొమ్మిదవ శతాబ్ది తుదిపాదమున కొందఱు కవులు స్వీయచరిత్రములను రచింపక పోలేదు. అవి పద్యగంధులైన రచనములు. మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారి (1886). 'ఆత్మ సపర్యాచర్య', మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి (1887) 'స్వీయ చరిత్ర', నేటికి నలుబది యేండ్ల క్రిందట శతావధాని చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి 'దినచర్య' ఈ కోవలోనివే. ఆదిభట్ల నారాయణదాసు గారు (1910) వచనమున స్వీయచరిత్రము రచించిరి. కాని అంతకుమున్నే రావుబహదూర్ కందుకూరి వీరేశలింగము పంతులు గారు (1903లో) స్వీయచరిత్ర రచనకుఁ దొడంగినారు. అందలి ప్రథమభాగము (1911 లో) విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి వారిచే ప్రచురింపఁబడినది. అటుపిమ్మట ముప్పదియేండ్లకు చిలకమర్తి వారి స్వీయచరిత్ర వెలువడినది.

'స్వీయచరిత్రమును రచించిన తెలుఁగువారిలో ప్రప్రథములు శ్రీ వెన్నెలకంటి సుబ్బారావు పంతులు గారు. వీరు కాశీయాత్రా చరిత్ర రచించిన ఏనుగుల వీరస్వామయ్యగారికి బంధువులు. శ్రీ సుబ్బారావుగారు తమ స్వీయ చరిత్రమును ఆంగ్లమున రచియించుటచే, తెలుఁగు భాషలో వెలువడిన మొట్టమొదటి స్వీయ చరిత్రము వీరిది కాజాలదు.'[2]

తనను గూర్చి తానే స్వయముగా చెప్పుకొనునది స్వీయచరిత్ర. ఆత్మ కథ వ్రాయుట కష్టసాధ్యము. ఒక్కొక్క పర్యాయము తనకు సమకాలికులైన వారి లోపములను ప్రకటింపవలసి రావచ్చును. తన్మూలమున వారి మనస్సునకు బాధ కలుగ వచ్చును. ఎంత ఉన్నది యున్నట్లుగా చెప్పి కొనినను, రచయితకు ఆత్మశ్లాఘా పరత్వము, పరనింద మున్నగు బలహీనత లాపాదింపఁబడును. ఇది లోక మార్గము.

రచనా ప్రణాళిక : శ్రీ ప్రభాకర శాస్త్రిగారు 1948లో (అది వారి షష్టిపూర్తి సంవత్సరము) అంతరుద్బోధము కలుగఁగా ప్రజ్ఞాప్రభాకర రచనమున కుపక్రమించిరి. దీనికి మరం మాడభూషి వేంకటాచార్యులుగారి యుద్బోధ ప్రేరకమయినది. అందు తొలి సంపుటమున తమ చరిత్రతోబాటు తమకుఁగల్గిన యోగానుభూతులను గూడ వివరించుచు వేయి పుటలుగలది వ్రాయ సంకల్పించినారు. మలి సంపుటమున వారు చేరిన మాస్టరు సి.వి.వి. యోగమార్గమున నుపకారము వడసిన మిత్రుల యొక్క, శిష్యుల యొక్క యనుభవములను - వారే వ్రాసిన వానిని - వెలయించుట ఈ

గ్రంథ రచనా ప్రణాళిక. కాని ఈ స్వీయ చరిత్రమున శ్రీ శాస్త్రిగారు తమ 28వ ఏటిదాక గడచిన యుదంతమును మాత్రమే వ్రాయుట జరిగినది. 1950లో వారు పరమపదించుటతో రచనమంతటితో నాగినది. వారాశించిన చొప్పున రచన మాసాంతము సాగియుండినచో స్వీయచరిత్ర రచనములో అది మేలుబంతియై యుండెడిదనుట నిస్సందేహము.

రచనా సముద్దేశము : 'సత్య జ్ఞానానందాత్మకమగు పరతత్త్వము, తత్ప్రతికూల గతితో అవివేక జీర్ణారణ్యమునఁ జిక్కి చీకాకు పడుచున్న యనను నన్ను త్రోవకుఁ దెచ్చి కాపాడిన తీరును మిత్రగోష్ఠిలో విన్నవించుట కొఱకే నా యీ గ్రంథ రచన ప్రయత్నము. దీని రచనమున నాకు పురుషోత్తముఁడగు గాంధి స్వీయచరిత్ర రచనా విధానము దారిదివ్వె. గులాబి మొగ్గను గడుపునఁ బెట్టుకొని దాని గ్రమ్ముకొని కఱకు నూగు తొడిమయే కే తొలుత గానవచ్చినట్లుగా, ఉపక్రమమున ప్రభాకర నామకుఁడనగు నేనే కానవత్తునుగాని నాలోని దివ్య తత్త్వపుఁబూవు వికాసము చెందిన పిదప, నది సువాసనను సౌకుమార్యమును వన్నెలను వెలార్పఁ జొచ్చిన పిదప, దాని గొని యానందింపఁ గోరువారికి నేను తత్ప్రదర్శకుఁడనుగానే, యంగుళీ గ్రాహ్యమగు తొడిమనుగానే యడుగునఁబడి యుండి కానవత్తును. అప్పుడిది ప్రజ్ఞా చరిత్రమే గాని, ప్రభాకర చరిత్రము గాదు. ప్రభాకర చరిత్రమయినను ఆ ప్రభాకరుఁడు తొల్లింటి నేనే గాక వేఱొకఁడే.'[3] 'పరుషము నిష్ప్రయోజన మబద్ధ మనార్యము చేఁరాదు నా విరచనలందు' అని ప్రమాణము చేసి యుపక్రమించిన విరచన.

పిండితార్థమిది : శ్రీ శాస్త్రిగారి లౌకిక జీవన వృత్తము ప్రధానముగాక, దివ్య ప్రజ్ఞామయమైన యనుభూతి విశేషము వెల్లడి చేయుటయే దీని లక్ష్యము. అట్టులయ్యు కొన్నియేని వారి జీవిత విశేషములను ప్రామాణికముగా దెల్పున దిది యొక్కటియే. రచనము సాంతము సాగకపోవుటకు బహుకార్య భారమగ్నత ప్రధాన హేతువు. అదే రచనా కాలమున తిరుపతిలో మ్యూజియము నిర్మాణ భారము వహించి శిలాలోహ విగ్రహములకై కడప యడవులనుండి మొదలిడి, నల్లగొండ గుట్టల వఱకు గాలించి తిరుగుటొకటి. కాళహస్తి సంస్థానాధీశుల పుస్తక భాండాగారమంతయు శోధించి వారి యనుమతితో ఎన్నో అముద్రిత గ్రంథములు, చిత్రములు, పూర్వపు వీరులు ధరించిన కవచ ఖడ్గాదుల సేకరణము మఱొకటి. ఇది యిట్లుండగా వేఱొకపట్టున అన్నమాచార్యులవారి వర్ధంతి నిర్వహణము, కాటమరాజు కథ—ధనుర్విద్యావిలాసాదుల పరిష్కరణ ప్రచురణములు, లక్షణోద్ధారమను బృహద్గ్రంథ రచనాభారము, ఇట్టి వెన్నో నిర్వహించుట మూలమున కూడ స్వీయచరిత్ర రచన పూర్తి కాకుండుటకు కారణములుగా పేర్కొనవచ్చును. ఇన్నింటిని ప్రక్కకు నెట్టి స్వీయ విషయమున నిర్లిప్తులగుట మఱియొకటి.

వ్యక్తిగత విషయములు : శ్రీ ప్రభాకరశాస్త్రిగారి నిశ్చితాభిప్రాయములు, ప్రవృత్తులు, వ్యాపకములు కొన్ని యిందు వెల్లడింపబడినవి. 1. బాల్యము నుండియు అంధవిశ్వాసముల యెడల నమ్మకములేదు. 2. పురోహితత అన్నచో వారికి సమ్మతము కాదు. అది వట్టి బూటకముగా సాగుట యిందులకు కారణముగా పేర్కొనఁబడినది. 3. శకున పరిగణనము అర్థములేనిది. 4. వృత్తిపరముగా ఏదియు దోషము కాదు. ఏదైన నిర్వంచనముగా ద్రోహములేకుండ సాగింపవలెను. పూటకూళ్ళ వ్యాపార ప్రస్తావనలో నిది వెల్లడింపఁబడినది. 5. ఖగోళశాస్త్ర విజ్ఞానము శ్రీ వేపారామేశం (మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి) గారి మూలమున నేర్చుకొనుట 6. న్యాయవాదులు వల్లూరి

సూర్యనారాయణరావు, కొండ వెంకటప్పయ్య పంతులుగార్ల ప్రేరణమున మదరాసు పయనము. 7. శ్రీ రామేశం పంతులుగారి నాదర్శముగా గొని నిరంతర పఠనోత్సాహము వారిలో పెల్లుబుకుట. ఒక్కటే చదువు. అప్పటికి వారి వయస్సు పదునెనిమిదేండ్లు. 8. దక్షిణ భారతమున 'హాలీస్ కామెట్' (ధూమకేతువు)ను తొలుత వీరేచూచుట, 9. వేశ్యాభినయ దర్శనమన్న బాల్యము నుండియు ఏవగింపు. 10. తనకు మేలొనర్చిన వారిని పిన్నలైనను, పెద్దలైనను, సకృతజ్ఞముగా స్మరించుట. 11. శ్రీమాన్ పండిత డి. గోపాలాచార్యులు, వేపా రామేశం, రెంటాల వెంకట సుబ్బారావు, గురజాడ అప్పారావు, వేదము వెంకటరాయ శాస్త్రి, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, టంగుటూరి ప్రకాశం పంతులు, పట్టాభి, అయ్యదేవర కాశేశ్వరరావు, పనప్పాకం ఆనందాచార్లు మున్నగు పెద్దలతో సన్నిహితత్వము.

సత్యకధనము : ఇందు శ్రీ శాస్త్రిగారికి గాంధిగారు మార్గదర్శకులు. అప్రియములైనను కొని మొగమోటమి లేకుండ చెప్పుట. తమకు న్యాయ్యేతరమనితోచినచో తుదకు తండ్రిని గూర్చియైన చెప్పుటకు జంకకపోవుట. తన లోపములను ధైర్యముగా వెల్లడింపగల మనోద్రఢిమ. బాల్యమున వారసత్యమాడినందులకు ఫల మనుభవించిన కరివేపాకు కధ, తుదకు వివేకము గొల్పిన కాకిపగ వాస్తవగాథ—బాల్యస్మృతులు-తొలికలయికనాటి వారి మనోమథనము చాటుమాటులు లేకుండ వివరించుట. తండ్రి సుందరశాస్త్రిగారు రోగులకడ కటువుగా సొమ్ము పుచ్చుకొనుట న్యాయముకాదని, అది లోపమని తెల్పుట, సాధువును సంతర్పణ భోజనమునకు రానీయనందులకై తమ అసంతృప్తి ఇట్లెన్నో యిందు వివరింపఁబడినవి.

సాహిత్యపరమైన సంఘటనలు : శ్రీశాస్త్రిగారు సంస్కృతాంధ్రముల ముచ్చటఁబడి ఇంగ్లీషు చదువు నిరాకరించుట-చల్లపల్లి, బందరులలో గురుకుల క్లిష్టులై విద్యాభ్యాస మొనర్చుట - మదరాసులోని సభలలో చిన్నవయసుననే ప్రసంగములు చేయుట-తాము రచించిన పద్యము లాయా సభలలోఁ జదువుట, బసవపురాణ గ్రంథపరిష్కరణ సందర్భమున వారికిఁగల్గిన వేదనా తీవ్రత. చెళ్ళపిళ్ళవారికడ విద్యాభ్యాసమును గూర్చి 'వారి దగ్గఱ పుస్తకముపట్టి చదివినదానికంటె వారి ముఖతః వినోదగోష్ఠిలో విని నేర్చినది చాలా' అని వ్రాసినారు. ఆనాటి ప్రాచ్య విద్యాధ్యయన పద్ధతులు. 1916-17లలో తాళపత్రగ్రంథసేకరణమునకై తెలుఁగుదేశయాత్ర.

భాషాయుద్ధములు : పాపులూరి మల్లన కాల నిర్ణయ విషయమున, కవులచరిత్ర రచించిన కందుకూరి వీరేశలింగముగారు, చిలుకూరి వీరభద్రరావుగారు మున్నగువారొక పక్షము-శ్రీప్రభాకర శాస్త్రిగారొక పక్షము వహించిరి. స్పర్ధాబుద్ధితో సత్య దూరముగా వ్యాసములు వ్రాసిన పెద్దలును లేకపోలేదు. ఆ వీరావేశమెంతదనుక పోయినదనఁగా, శ్రీ శాస్త్రిగారి యుద్యోగమునకు నీరుతోడు పర్యంతము. ఆనాటి వైస్రాయి కౌన్సిలు సభ్యులు శ్రీ బయ్యా నరసింహేశ్వర శర్మగారు కల్పించుకున్న మీఁదటగాని వారి యుద్యోగము నిలువలేదు. ఆ దినములలో వారిలో వాదప్రతివాదోత్సాహ మురకలు వేయుచుండెడిది. అప్పటికి శాస్త్రిగారి వయస్సు ఇంచుమించు ఇరువది.

అపూర్వ సన్నివేశములు : 1 శ్రీ వేపారామేశం పంతులుగారికి ప్రసిద్ధ పుస్తకవిక్రేతలు నటేశన్, రామయ్యర్ ప్రభృతులు మిత్రులుండేవారు. వారు అమ్మకానికి తెప్పించిన పుస్తకాలనన్నింటిని వారం వారం చదివి ఇవ్వటానికి రామేశం గారి కిచ్చేవారు.

ఆయన చదవటం మూలాన పుస్తకవిక్రేతల కధిక లాభాలు వచ్చేవి. 2. శ్రీ శాస్త్రిగారు ఆత్మహత్యా ప్రయత్నమునుండి ఆరోగ్య ద్వారము కుంభ కోణము చేరిన వాస్తవగాథ ఎట్టఎదుట జరుగుచునట్లు వర్ణింపబడినది. పరమగురువులు మాష్టరు సీ.వి.వి. గారి శిష్యతాలబ్ధి, నవజీవనప్రాప్తి, ఔషధ సన్యాసము మున్నగునవెన్నో గలవు.

నాడీగ్రంథములు : ధ్రువనాడి, సత్యసంహిత, శుక్రనాడి, చంద్రకళానాడి, భుజండనాడి మున్నగు జ్యోతిషగ్రంథముల పఠనము—అందలి తప్పొప్పులు గూర్చిన ప్రస్తావన యిందుకలదు.

తంజావూరు లైబ్రరీ :విచిత్ర విక్రయ గాథ : 1916లో మదరాసు రాష్ట్ర గవర్నరు పెట్లండుదొర. ఆయనను ఇంగ్లండువారో,జర్మనీ వారో ప్రేరేచిరట; తంజావూరు లైబ్రరీని కొనిపెట్టవలసినదని. అందులకై లైబ్రరీవిలువ కట్టుటకు గ్రంథముల పరిశీలనము జరుపవలసెను. ఈ రహస్యము పైకి పొక్కుటతో,గవర్నరుగారు తమ తంత్రము కట్టిపెట్టుకొనవలసి వచ్చింది. ఇట్టి సమకాలీన సంఘటనలు కొన్ని పేర్కొనబడుటొక విశేషము.

ఆధ్యాత్మికచింతన : ఈ గ్రంథ మాద్యంతము చదివిన నొకవిషయము తేటతెల్లము. ఆబాల్యము శ్రీ శాస్త్రిగారిలో అజ్ఞాతముగా నొక ప్రజ్ఞ పని చేయుట-కరుణామయ సన్నివేశములకు గుండె ద్రవించుట—లోకము శోకము తొలగింపవలెనను విచికిత్స-అంతర్లీనముగా ఆ దివ్యప్రజ్ఞ వర్తించిన తీరు నిందు వెల్లడింపబడినది.

అంతర్వీక్షణకై బాల్యమునుండియు వారిలో నొకతపన కన్పించును. తమకు పదియేండ్ల ప్రాయమున భావనఋషి యుత్సవమున గల్గిన మైమఱుపాటులోని ఆంతర్యము పెక్కేండ్ల తర్వాత వారికి గోచరమయ్యెను. చిన్నప్పుడు అద్దేపల్లి సోమనాథ శాస్త్రులవారి దగ్గర చదువుకొన్న పాతంజల యోగసూత్రములు శ్రీ శాస్త్రిగారిలో చొచ్చుకొనిపోయి యోచనలు గొల్పసాగినవి. బాల్యము నుండియు వ్యాధినిర్మూలనకై దైవప్రార్థన చేయు ప్రవృత్తి కలదు. 1910లో శ్రీ వేంకటేశ్వర స్వామి దర్శనము కాకపోగా, దానిని గూర్చిన యొఱుక 1930లోను, 1949 నాటికింకను నెన్నో విషయములు గోచరించిన ట్లుటంకించినారు. ధూమ కేతుసందర్శనము (1910) చేయుటలోని విశేష మును తాము 1948లో గుర్తించినట్లు తెల్పినారు.

ఇట్లెన్నో తావులందు వారికి కల్గిన దివ్యానుభూతి విశేషము లాయా సంవత్సరముల చరిత్ర వ్రాయు నప్పుడు తెల్పుదునని వ్రాసినారు. 'జీర్ణమంగే సుభా షితమ్' అనురీతి నదియెల్ల వారిలోనే యుండిపోయి నది. తలచుకొనిన దుఃఖము పెల్లుబుకును. కాని గ్రంథరచన 1917 వఱకు మాత్రమేసాగి అపర్యాప్తముకాగా, వారి ప్రజ్ఞామయ జీవితమున గల్గిన మహత్తరానుభవములను ప్రకటింపకుదుర లేదు.

శ్రీప్రభాకరశాస్త్రి గారిలో స్వతంత్ర భావములు, సత్యసంబద్ధత, నిష్కాపట్యము, మౌలికమైన ఆలోచనారీతి, సిద్ధపురుషుని వర్తనము, మూఢ విశ్వాస నిరాసము, దైవీసంపద్విభూతి, ప్రాణము నార్తసేవకై పంచు సమర్పణబుద్ధి, తృణమణి వివేచనము, ఇంతటి మహత్తర ప్రజ్ఞాశాలియైనను వినయ వర్తనము వీడమి మున్నగునవి కన్పించును. ఆయన సత్యవిక్రముడు. అంతర్యామి ప్రేరణ ప్రకార మాచరించిన కర్మయోగి.

సరళమయిన చిన్న చిన్న వాక్యములతో తిన్నని తేటతెనుగున రచన సర్వత్ర సాగినది. స్వీయచరిత్ర రచనలకిది ఒజ్జబంతి. సమకాలీన చరిత్ర కొంతేని

తెలిసికొనుట కవకాశము కల్పించినది. ప్రభాకరుల లోని ప్రజ్ఞామయస్వరూపము కొంత తెలియజెప్పినది. ఈ రచన సాగింపనిచో ఇది తేటపడక పోయెడిది.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారొక మహాసంస్థ, ఒక మహోద్యమము. ఆయన ప్రసరించిన వెలుగులు ఏనాటికి కందనివి, గాజువాఅని వని చరిత్ర ఋజువు చేయుచున్నది.

యోగమిత్రులు శ్రీ కొత్త వేంకటేశ్వరరావు, ఎం. ఏ. ఎం. ఎల్ గారీ స్వీయచరిత్రకు పీఠిక వ్రాయుచు గ్రంథము సాంతముపూర్తియైనచో నెట్లుండునో అని వారు చెప్పిన వాక్యము స్మర్తవ్యము.

'తెలుఁగున వచన రచనలో మెఱుగులను చూపు నదియేగాక యోగాధ్యాత్మిక సాధకులలోను, మన శ్శరీర తత్త్వవేత్తలలోను, రోగ చికిత్సకులలోను సంచలనము కల్గింప జాలినదిగ నుండెడిది' ఇంతకు మించి యేది చెప్పినను అది పునరుక్తి.

1. ప్రచురణ: యోగ మిత్రమండలి - మద్రాసు (1951) 153 పుటల గ్రంథము.

2. వీరేశలింగం-సమగ్ర పరిశీలన-పుటలు 270 271. డా॥ అక్కిరాజు రమాపతిరావు.

3. చూ. ప్రజ్ఞాప్రభాకరము పు. 1, 2



# నీవే శరణమిక తండ్రీ!

— వేటూరి ప్రభాకరశాస్త్రి

[ "ఆంధ్రదేశమున తుఫాను—బందరు బీభత్సపు వివరములు" అన్న వ్యాసాన్ని గురుదేవులు 1925 మే నెల 21వ తేదీ గురువారం ఆంధ్ర పత్రికలో ప్రకటించారు. ఆ వ్యాసమాధారంగా అందులో అచ్చుపడిన కవితాఖండికలను మాత్రమే ఇప్పు డిందులో ప్రకటిస్తున్నాము—సం॥ ]

[ మే నెల 14వ తేదీ రాత్రి గురుదేవులు సకుటుంబముగా బయలుదేరి 15 ఉదయం బందరు చేరిరి. అప్పుడు బందరులో వారి అన్నగారుండిరి. ఆ పూట అక్కడ ఆగి 16న పెదకళ్లేపల్లి వెళ్ళవలెనని తలచిరి. కాని—ఆంధ్రదేశమున తుఫాను తీవ్రత హెచ్చెను— ]

'ఎల్లర గుండెలలో గుబులుపుట్టెను. ఇంటి పై పెంకులెగురుచుండెను. ప్రక్కటిండ్లు గొన్ని పడుచుండెను. 'హా! జగత్ప్రభూ రక్షింపుము దండ్రీ' యని దీనాలాపములాడ దొడగితిమి. గుండె గుబులుతో నేనీ రెండు పదములు గూర్చితిని—

చూచి తలఁచి యెఱుంగ నెన్నఁడు
పేచుపనె గుండియలు హాహా!
నీ చమత్కృతి యిట్టిదియు నగు నే జగన్నాథా!
సైఁపఁగ నేర మీ బాధ!

ప్రళయ ఝంఝామారుతం బను
పలుకు నర్థము తెలిసె హృదయము
తలఁకు చున్నది యాపదంబుధి
వెలికిఁ జేర్పఁగదే—నేడీ
విలయ మార్పగదే!

సర్వలోక శరణ్య దేవా!
సర్వశక్త మహానుభావా!
సర్వథా శరణాగతుల మము
సాకుకొను తండ్రీ—నీవే
శరణ మికఁ దండ్రీ!

అల్లంతలో గొంచెము తెరపి యేర్పడినట్లయ్యెను. వాతావరణమందు నిశ్చలత దోచెను. సూర్యరశ్మి చూడనయ్యెను. ఇంచుక యుమ్మదముగూడ నేర్పడెను......... [ కాని అంతలోనే ప్రళయము ముంచుక వచ్చెను. ]

....అన్నము తిననుపక్రమించిన బాలు రయ్యో యని యార్పులిడజొచ్చిరి. ఇంటి పై కప్పు లెగురుచుండెను. అటక పరంబీ బల్లలు పటపట బడసాగెను 'నాన్నా! భయము వేస్తు న్నది. ఉప్పెన వస్తున్నది' అనుచు నన్నము మాని నన్ను జుట్టుకొని పసిబాలు రేడ్వ దొడగిరి.............

  

'తండ్రీ! సర్వజగత్ప్రభూ అభయ మత్యంతంబు ప్రార్థింతు మీ
తీండ్రం బార్పుము కల్పసంక్షయ సముద్గీపాభ్ర ఝుంఝూహతిన్
దండ్రుల్ తల్లులు బిడ్డలుం జకితులై తండోపతండంబులై
మండ్రాటంబున దూలుచుంటి మిది నీ మహాత్మ్యమా అక్కటా!

దుర్భరమయ్యె నీ భయము త్రోవ కనంబడకున్న దింక నీ
యార్భటి సాగెనేని మఱి యప్పటి యుప్పెన తప్పదందు రీ
యర్భకు లేడ్చుచుండి రడగారుచునున్నవి యిండ్లు వృక్షముల్
నిర్భయ మిచ్చి వేగ కరుణింపఁగదే జగదేకనాయకా!

  

[ 17వ తేదీ అర్ధరాత్రి 12 గంటల వేళ ప్రళయభీతి తగ్గినది. 18న ఎండకాయు చున్నది. తెఱపిగా నున్నది. ]

(రచనాకాలం—16-5-1925)

# ఆంధ్రదేశ వర్ణనము

వేటూరి ప్రభాకరశాస్త్రి

[ ఉడయనందివిలాస మని ప్రాచీనాంధ్ర ప్రబంధ మొకటి గలదు. అందు ఆంధ్రదేశ వర్ణనము హెచ్చుగా నున్నది. ఆ గ్రంథము పూర్వమెప్పుడో ఒకమారు ముద్రితమయినది. ఆ యచ్చుప్రతు లిప్పుడు దొరకవు. అందలి యాంధ్రదేశ వర్ణనలోని ప్రధాన భాగముల నిక్కడ కూర్చి యెత్తితిని. ఇట్టి వర్ణనలు మఱికొన్ని గ్రంథములలోఁ గూడఁ గలవు. క్రమశః వానినిగూడ సేకరింతును. ]

## కంచి

సీ॥ జంబీర ఫలములు శాకినీ శాకంబు పసుపురాచిన చాయ పెసర పప్పు
కలమాన్నమును మీఁగడల తోడి పెర్వును మినుపవడలుఁ నెయ్యి మిళముచారు
పలుచని యంబళ్లు పచ్చళుల్ శిఖరులు పండుటాకులు క్రొత్త భాగములును
రిపిగంధములు కిప్పురపుఁబలుక్కులల్లంబు పునుఁగుఁదావులు మల్లెపూల చెండ్లు
పట్టు బొందులు పలిప దుప్పట్లు చంద్ర-కావి తలగుడ్డలును వారకామినీ వి
లాస సంగీత సాహిత్య లక్షణంబు-లాదిగాఁ గంచి సౌఖ్యంబు లనుభవించి.

## కాళహస్తి

ఉ॥ చెంపల నొప్పు కొప్పులును జేరల మీఱు విశాలనేత్రముల్
కంపన మొందు కౌనులును గబ్బిచనుంగవ లబ్జబింబముల్
లంపట పెట్టు మోములు సలక్షణమై తగు దేహవల్లులున్
సంపద మీను చూపుగల చానలఁ జూచిరి కాళహస్తిలోన్.

## శ్రీశైలము

చ॥ పొదవగు దేహముల్ లతలఁబోలెడు బాహువు లబ్జ నేత్రముల్
గడగడలాడు కౌనులును గబ్బి చనుంగవ లొప్పు కొప్పులున్
నిడుదగు నవ్వుమోములు ననిందితమై చెలువొందు నంగముల్
కడువడిఁ గల్గు కాంతలను గాంచిరి శ్రీగిరి చెంత భూములన్

ఉ॥ పుల్లసితాంబుజాక్షులను భూరి కుచ స్ఫుట భవ్య వక్షలన్
బల్లవ పాణులన్ గుటల బంధుర వేణులఁ బువ్వుఁబోఁణులన్
హల్లక మిత్ర సన్నిభల నంబరమధ్యలఁ జారు మౌగ్ధ్యలన్
భిల్ల పురంధ్రులన్ గనిరి పెంపును సొంపును నింపు మీఱఁగాన్

ఉ॥ లింగము లాత్మ మధ్యముల లెన్స నటింపఁగఁ గంచుకంబులోఁ
బొంగెడు గబ్బిగుబ్బలును బూర్ణశశాంకుని బోలు మోము లు
త్తుంగ కటీతటంబులును దోయజ గంధము లొప్పు చున్న యా
జంగము కాంతలం గనిరి సంభ్రమ మొప్పగ శ్రీగిరిస్థలిన్

సీ॥ తప్తకాంచన నిర్మిత స్ఫుటాంచిత రత్న దీపితోన్నత భవ్య గోపురములు
శాతకుంభ స్తంభ సకలభేద వినోద మణి చిత్రపుత్రికా మంటపములు
ధర్మ నిర్మిత దిశాపతి విరాజిత పరివార.... దేవాలయములు
తపనీయ ధగధగ ద్ధగిత కాంతి విచిత్ర మధ్య ప్రకృష్ట సన్మందిరములు

నవ్య భృంగీశ చండీశ నందికేశ-కలిత పారిషదానేక గారవమును
గలిగి సద్భోగ మోక్ష ప్రాకార మగుచు-మహిమఁజెలువొందు మల్లేశు మందిరంబు.

## కొండవీడు

ఉ॥ కమ్మని కందిపప్పు తఱగమ్ముల నీళ్ళను జొన్నవంటకం
బిమ్మగు దోసకాయ పులుసెప్పుడు సంబళు లాజ్యధారయున్
గమ్ముల పచ్చడమ్ము లొడికంబగు నిడ్డెన లట్లు నూనె సా
రమ్మగు సారెపత్తులును రంగగు కుండినభూమి బొందుచున్.

## బెజవాడ

సీ॥ ఈ యింద్రకీలాద్రి నింద్రజుఁడభవుతోఁ బోరి పాశుపతంబు బొసగనందె
నీ పుణ్యగిరియందు నీళుండు భూమీసురున కర్థి సాయుజ్యమెనయ నిచ్చె
నీ పట్టణంబున నెలమి మాధవవర్మ ఘనముగా గురియించెఁ గనకవర్ష
మీక్షేత్రమున శమీవృక్షంబునను వహ్నిఁ బటుచేలచే గట్టెఁబండితయ్య

భవ్య కృష్ణానదీతట ప్రాప్తభోగ-దక్ష సన్మోక్షలక్ష్మి ప్రధానమనగ
చెలగె మల్లేశలింగ సంస్థితిని రూఢి-పుణ్యనిలయంబు బెజవాడ పురవరంబు.

సీ॥ క్రొత్తబియ్యము రాయగూరి రొబ్బట్లు సైదంపుబూరెలు పంచదార యావ
పడలు సల్లంబు మీగడలు తియ్యని పెర్గు కమ్మని చిరుపాలు గసగసాలు
చిరుసెనగలపప్పు తరిచు వీడ్యంబులు కంబళ్ళు దుప్పట్లు కంచుకములు
హింగు జీరకములు సెనసెన మిరియంబు పదము గొల్పెడునెయ్యి మాటదురుసు
లసునరిణాల మెప్పు గంధాక్షతములు-నందమింపొందు శిఖలు నొయ్యారినడలు
గలుగు కాంతలు పురుషులు గలిగి సిరులఁ-జెలగు నయ్యాంధ్రదేశంబు చెలువు గాంచి.

## ఏ క శి లా పు ర ము ( ఓ రు గ ల్లు )

సీ॥ మూరి పెడలుపైన ముప్పట్టె వలిపముల్ కట్టంగ నేర్తురు కాసె లమర
సీమంత వీధి భాసిల్ల సున్నగ దువ్వి మెలపనేర్తురు శిఖల్ మెడల మీద
జక్కవ కవ మీరు చనుదోయి రవికలో నడచంగ నేర్తు రొయ్యారి వగల
బింబాధరి స్ఫూర్తి పెంపొందఁ దాంబూలములు సేయనేర్తురు చెలువ మీర
ననుచు గంధేభయానల సబ్జగంధ-గంధిలాంగుల వికచ సత్కంజముఖులఁ
బరిమనాచికి నంబలి స్ఫురణఁజూపె-లాలితంబైన యేకశిలాపురమున.

## ధ ర్మ పు రి

ఉ॥ ధర్మ విచిత్ర పుత్రికలొ పంచశిరీషము మత్తదంతులో
యక్మలి పువ్వుదీపలొ మొయారి తెరంగు మెరుంగు దీగలో
రాక్మని ముంచు రా చిలుక గుంపులొ యంచును ప్రేమదీరగా
ధర్మపురింబులోని వనితాజనవర్గముఁ జూచి రింపుగన్.

## జ గ న్నా థ క్షే త్ర ము

ఉ॥ బొక్కిలి క్రింది కట్టు పరిపూర్ణములైన కుచద్వయంబులున్
టిక్కని కప్పు కొప్పులును జేరల మీరు విశాలనేత్రముల్
చక్కని పద్మహస్తములు చారుతరంబగు బాహుమూలముల్
మిక్కిలి నిగ్గు కాంతలను మానిని చూడు కళింగధారుణిన్.

సీ॥ జున్నుండలును దేనె సన్నపంటకములు లాజలు కుండ బెల్లంబు కొండ
కంది పప్పును జేదు గలసిన పచ్చళ్ళు నీళ్ళు సోకని పాలు నిమ్మపళ్ళు
వేపవిత్తులనూనె పిరిదండలల్లంబు పసుపుపూతలు లింగపల్లటాలు
నూనెరాచిన నీళ్ళు నుదిటిపై సిగలును నడుముక్కకమ్మలు గడుసుకురులు
పొగచుచును బెట్టు కూరలు భుక్తముష్ణ-మఖిలఫలములు మధురభక్ష్యమ వచ్చ
నైన ఘృతమును నొజ్జని నూనె కుడుపు-లును కళింగావనీస్థలి ననుభవించి

## దా క్షా రా మ ము

ఉ॥ కమ్మని గోఘృతంబు గరకంతున కర్పితమైన యన్నమున్
తిమ్మనముల్ రసావళులు తేనె తొలల్ బహు శాకపాకముల్
పమ్మిన పిండివంటలును భర్మరుచిం దగ గేరుపప్పు సా
రమ్మగు పెర్వుతోఁ గుడిచి ప్రస్తుతి సేతురు దక్షవాటికన్.

## కో న సీ మ

సీ॥ కదళీ ఫలంబులు గంగానదీ స్నానమును పచ్చిపోకలు పనస తొనలు
మామిడి పండ్లు కమ్మని గోఘృతంబును నొంకాయ పెంకాయ లొలుపు బప్పు
బహువిధ భక్ష్యముల్ పరమాన్నమును పైళ్ల కంద పెండలములు కాయగూర
లమృతోపమానంబులైన రసావళ్ళు శాల్యోదనము పెర్వు సకల రుచులు
గలుగు నూర్గాయలును పానకములు నప్పడములు వర్గులు వడియముల్ శ్రమముదీర
ననుభవించిరి వేదశాస్త్రార్థవాదములకు నలరుచుఁగోన భూస్థలమునందు.

## ప లి వె ల

ఉ॥ పంకజ పత్రనేత్ర విను పల్వెలలోపల వేశవాటిలో
రంకని యెవ్వఁడేఁ బలుకు రంగుగ వానిని బట్టి మీద ని
శ్శంకను శౌరి దూత లురు చంద్రకుఠార కఠోర శూల బా
ణాంక విశాల తోమర మహత్తర హేతుల ద్రుంతు రెంతయున్.

చ॥ కుసుమ సుగంధముల్ సొగసు గుల్కెడు చూపులు తియ్యమోవులన్
కసరని ప్రౌఢ వాక్యములు గంధకరీంద్ర సమాన యానముల్
కొసరి వణంకు కౌనులును గుత్తపు గుబ్బలు ముద్దు మోములున్
పొసగగ గల్గు కామినులె పొందుగఁ బల్వెల పట్టణంబునన్.

[ "ఆంధ్రదేశ వర్ణనము" అను నీ పద్యఖండిక మచిలీపట్టణము నుండి వెలువడిన 'ఆంధ్ర భారతి' అను సాహిత్య మాసపత్రికలో రెండు సంచికలలో ప్రచురింపబడినది. పత్రికా సంపాదకుడు—తల్లాప్రగడ రామారావు.

1. సంపుటం—3, సంచిక—6, సెప్టెంబరు, 1928, 2 పద్యాలు, పుట—3.
2. సంపుటం—3, సంచిక—7, అక్టోబరు, 1928, 15 పద్యాలు, పుటలు—5, 7.

—సేకరణ : ముదివేడు ప్రభాకరరావు ]

# మణిమంజరీ ప్రశంస

- ముదివేడు ప్రభాకరరావు

ఇది మణిమంజరి !
వేటూరి పండితమణి జీవితగాథా సుగుణమణిమంజరి !!

ఇది వాఙ్మయ-యోగ-పరిశోధన పత్రిక !
శ్రీ ప్రభాకర ప్రజ్ఞాప్రసాదిత విజయవైజయంతిక !!

ఈ పత్రిక షాణ్మాసిక !
షడానన సదృశ పాండిత్య యశోమంజూషిక !
సకల కళాప్రపూర్ణ విరాజిత సాలభంజిక !!

వేటూరి వంశ వంశీనికుంజ యోగానంద కందళి !
వేటూరి వాఙ్మయ మురళీరవ మధురగాథావల్లరి !!
—ఈ మణిమంజరి !

శ్రీయుత పీ.వీ.వీ. యోగచికిత్సా శితశిల్ప విమర్శిని!
శ్రీ గురుదేవుల కరుణారసప్లావిత కవితారసధుని !!
—ఈ సుగుణఖని !

అధునాతన పరిశోధన (క) పత్రికా (పండిత) మణిహారంలో
ఏకైక నాయకమణిగా
మనుగడ సాగించి (న ప్రభాకర యశో)
మణిదీపంలా నిలిచి వెలుగుతుంది ఈ 'మణిమంజరి' !

# 3

చాటుమాటులు లేని
వేటూరి కీర్తిమూర్తిని చాటు
చాటుపద్య మణిమంజరిలా-

మధుర మంజుల శింజినీ నాదాలను పలికిస్తూ
సహృదయ హృదయాంగణంలో నటించే
సుందర నర్తకీమణిలా—

తమోలోకాలను తపస్సుచే చీల్చి
వాఙ్మయాన్నీ పూర్ణ యోగాన్నీ సవ్యసాచిలా సాధించిన
శ్రీ అరవింద మహర్షిలా—

తన్ను తానుద్ధరించుకొంటూ
తాడిత పీడిత సోదరభారతీయుల్ని ఉద్ధరించిన
గాంధీ మహాత్మునిలా-

జగమెరిగిన ప్రభాకరుని అజరామరకీర్తినీ
జగజ్జేగీయమానమైన యోగానుభూతినీ
దశదిశలా చాటుతుంది :

విశాల భారతదేశంలో
విజయదుందుభి మ్రోగిస్తుంది::



# అభిప్రాయవేదిక

మొదటి సంచిక స్థాయికి ఏ మాత్రం కొరవడని తీరున ఈ సంచికను వెలువరించి నందుకు నీకు నా అభినందనలు. ఇంతవరకు తాత్కాలికంగా మరుగునబడ్డ ప్రభాకరి ద్యుతులు లోకమున మరల ప్రసరించునట్లు నీవు చేయుచున్న కృషి నిర్విఘ్నంగా సాగుగాక!

—వే. చంద్రశేఖరశాస్త్రి (విజయవాడ)

20-9-81

రెండు భాషలలో ముద్రించడం ప్రశంసనీయం. గెటప్పు ప్రింటింగు బాగుంది. ఇక అందులోని శీర్షికలు, వ్యాసాలు ఉన్నత ప్రమాణాలతో పాఠకుని ఉత్తేజపరిచేవిగా ఉన్నాయి....

—కా. విశ్వనాథం (వరంగల్)

25-9-81

నాలో అంతర్యామిత్వము వహించిన మాష్టరుగారి వెలుగుతో అభిన్నము తండ్రిగారి ప్రభాకరిజ్యోతి. ఇది నా చిరకాలానుభూతి. దీనికి సమన్వితముగా చేయు ప్రయత్నము ఏదియైనను జన్మలకు చరితార్థత కలుగజేయును.

ఉద్యమము పవిత్రము గనుక దానికి కావలసిన శక్తిసామర్థ్యములను అదే సమకూర్చ గలదు. భక్తియున్నచోట పూజించు విధానమును గూర్చి ఎక్కువ ఆలోచింప పనిలేదు. విధానము దాని రూపురేఖలను అదే తీర్చిదిద్దును.

—ఎక్కిరాల కృష్ణమాచార్య

14-7-81 (విశాఖ); 8-8-81 (శ్రీశైలం మకాం)

ఇవి 'ప్రజ్ఞా ప్రభాకరసర్వస్వాలు'గా ఉంటున్నవి.... ప్రతి సంచికలోను గురుదేవుల ఒక అముద్రిత కృతిని పరిచయం చేస్తే బాగుంటుంది. లేదా అవకాశం ఉంటే ఒక గ్రంథాన్ని ధారావాహికంగా ప్రచురించేటట్టు చూడగలరు.

శ్రీ రంగాచార్య (పాలెం)

2-12-81

'మణిమంజరి' రెండవ పత్రిక అందింది. ఇది ఇంకా అందంగా (విషయంలోను రూపంలోను కూడా) వచ్చింది.

—రాజేశ్వరి (దుర్గాపూర్)
30-10-81

నా విద్యార్థి కాలంనుంచి పూజ్యపాదులు ప్రభాకరశాస్త్రిగారు సాహిత్య ప్రపంచానికీ, ఆ రూపంలో నా యీ ఇతర లోకాలకూ దోవచూపిన పుణ్యమూర్తులు. మణిమంజరి సంచికలు చూసిన తరువాత ఇంతవరకు నివురు గప్పిన నిప్పులకు మల్లె నున్న నా ఆధ్యాత్మిక పరిసరాలను చక్కగా గుర్తించటానికి ఇంతవరకు లభించని అవకాశాలు లభిస్తున్నాయి....నా ఆధ్యాత్మిక చింతనకు మరింత శక్తి యిచ్చిన రచనలు ఇవే.

—డా॥ వి. యన్. శర్మ (మద్రాసు)
2-3-1982

చూచి సంతోషము ఆనందము పడ్డాను. మేము పెద్దవాళ్ళం అయిపోయినాము. శ్రీ ప్రభాకర పరిశోధక మండలి యింకా పైకి రావాలని నా కోరిక—

—కాజ శారదాంబ (బిలాస్‌పూర్)
(గురుదేవుల సహోదరి)
24-9-81



# manimanjari

Volume 2 - No. 1. February 1982
JAYANTI ISSUE

A bi - lingual Bi - annual
Literary Yoga Research Journal



**SRI PRABHAKARA PARISODHAKA MANDALI**

'SRINIVAS' 6/2RT (New)
Vijayanagar Colony,
HYDERABAD - 500 457.
Andhra Pradesh

About ourselves :

# "Like Holding A Candle To The Sun"

Nannichoda's "Kumara Sambhava" (1–49)

The bi-annual "Manimanjari" is devoted to the cause of literary research in Telugu and propagation of yoga. Manimanjari dedicated to the sacred memory of the late Veturi Prabhakara Sastri, will be published in a year on the occasion of his birth in February and his demise in August. In celebration of his 94th anniversary (Jayanti), this number is now before you.

| | | |
|---|---|---|
| Journal back numbers each (In land) | Rs. 15 | (with postage. Registration charges extra) |
| Annual subscription | Rs. 25 | |
| Annual subscription (Foreign) | $ 8 | |

Only a limited number of copies are available.

You may become a subscriber by sending money either by M.O or by a bank draft. Outstation cheques drawn in favour of Manimanjari, Hyderabad should include in addition Rs. 2/– towards bank charges.

In future "Manimanjari" will contain many new features. Sastriji's varied and original contributions will continue to appear in the journal.

Editors

MANIMANJARI
6/2RT (New) Vijayanagar Colony,
Hyderabad-500 457,
Andhra Pradesh,
India.



# CONTENT

The Prabhakara Parisodhaka Mandali

Conveys its heart felt Condolences to

the bereaved family of Sri V. Anjaneyulu,

Editor, English Section, Manimanjari,

at the sad demise of his wife Smt V. Sathyavati.

# C. V. V. Namaskaram

# PRAGNA PRABHAKARAM

*Translation* :
Dr. V. ANANDAMURTHY

VETURI PRABHAKARA SASTRI

( Continued from previous number )

## KNOWLEDGE & EXPERIENCE

I had great respect for the savant Somanatha Sastry. However, I did not think that I should follow him or that if I had followed him in his footsteps I would get self-realisation. When he was teaching Yogasutras, he told us that he had striven to attain perfection in it, but his health was spoilt by that and that he could not derive the sought after experiences through Yogic devices. It occurred to me as to why he should teach Yoga Sutras to us when they were unattainable to him. But I could not express my scepticism lest he should get angry. On an occassion Sastriji put the same question to himself and said :

"Just try whether any one of you could attain it. See whether you would get an appropriate guru. Don't think that simply because I could not experience it, the Yogic science is unauthenticated. But don't practice it by yourselves".

Those words went home. Somanatha Sastry was steeped in 'mantra-yoga,' and was ardently devoted to its practice but he never thought of its benefits. Since it has to be observed in practice, it has to be done. That was all. Recently when I thought of his Yogic practices, the verse in Upanishads that conveyed the same approach occurred to me as its answer.

At the age of twenty eight when I joined Bhriktharahitha Taraka Raja Yoga and was having wondrous experiences, Sastriji was alive shedding luster with his deep meditations. Whenever I frequented my village I used to go to Challapalli, and when he came to our village Peda Kallepalli to visit his son-in-law and daughter I called on him and acquainted him with my experiences. With great enthusiasm he used to feel that once he should accompany me to Kumbhakonam and discuss with the Master and benefit by it. I had also the desire that for Sastriji I should bring about contact with this Yoga. But it did not happen.

After he discarded the physical body in my thirty eighth year, in my meditation I had observed for a couple of minutes that Sastriji, my father, and my father-in-law joined me in prayer. I used to desire in my prayers many times that these three should have such experiences as I was having. As such this phenomenon delighted me.

# 8

## LEARNING FROM VENKATA SASTRY

Somanatha Sastri was a very good teacher, and none of us (me and my contemporaries) had any intention of leaving him But the name and fame of Chellapilla Venkata Sastri, who had just then joined as a Telugu Pandit in the newly opened High School at Bandar (Machilipatnam) had spread to the surrounding villages. People used to be crazy about his astounding calibre and scholarship. So three of us became enthusiastic to study under him at Bandar. My contemporaries Avvari Subrahmanya Sastri and Pisipati Venkatarama Sastri made the first move and promised to call me if opportunities were propitious. I agreed. I was probably sixteen years old when I joined them after a few days.

If I have acquired any knowledge in Telugu the credit should go to that great teacher, Venkata Sastri. I have learnt much through his casual literary discourses than from the regular study under him. In so far as spiritual guidance was concerned, I confess, I had no inspiration at all either during my stay at Bandar or in my association with Sastriji. Our association with Sastriji spurred us on to develop genius for literary prowess inAvadhaana-Vidya, flair for poetic composition, ecstacy in eloquence, exercises in prosody, literary constroversies, intellectual arrogance and allegiances had a free play and the spiritual quest within had almost vanished. Venkata Sastri was a plain person with a naive heart. Prior to his arrival at Bandar his attitude to life was similar to the verse"Desaatanam pandita mitrataacha"rooted in esoteric pleasures of life (chaaturya moolam). Often he narrated and we listened to his experiences concerning his rovings (Desatanam), contacts with scholars (Pandita mitrata) and his entry into royal courts (Raja sabha pravesha). But he would also go a step beyond and reveal to us in detail, without any inhibition, all about his affairs in between pandita mitrata and Rajasabha pravesha: namely the "Chaturya moolam". I was just sixteen and these uninhibited ribaldries made me feel so bashful and embarrassed on such occasions.

At that time the marriage of my elder brother took place. Lanka Nageswara Sastri, resident of the Chodavaram village in Divi taluk who was patron of music and literature and who performed the marriage was none other than the brother-in-law of my paternal uncle. He had great affection for me. He was a widower and had no children. He was not only a patron of learning but also a seeker of carnal pleasures. Sometime after my brother's marriage he adopted a boy as his son and performed the "thread ceremony" for him. On both the occasions of the marriage and the thread ceremony he arranged 'Bhogam-melams' (nautch parties) on a grand scale thrice a day morning, evening and at night. Several people including officials attended those sessions. After the thread ceremony he forced me to stay back at his place. In the company of the dancing girls my uncle was fondly asking me to narrate the stories of Kadambari and the other plays in Sanskrit. I was obliging him. But for how long could I stay there? After ten days I returned home.

The esoterics of those dancing girls, their songs and playful pranks, endearment when I regaled them with stories; and the appreciation showered on me by their clown, a learned old Brahmin and desire of my uncle that every year in summer I should go over to his village and stay with him since Venkata Sastry would be leaving Machilipatnam for vacation - all these fascinated me. Leaving my village for Bandar and living on 'Vaaraalu' (free food given by different householders on each day of the week (Vaaram) by prior appointment) bacame disgusting. Though I was used to leaving my home and trekking sixteen miles from my village to Bandar rather often, I felt it troublesome at that time. Even to walk two or three furlongs became an ordeal. I had to cross on the way a slushy puddle. For a while I thought of returning back. I sat for a while and thought. So many disturbing thoughts raged within me. I had read the burlesques (Prahasanams)and speeches of Veeresalingam Pantulu. All that he had written about the dancing girls occurred to my mind. I took a vow not to attend for ever such congregations This was in 1904. Since then I do not recollect of having witnessed any of the performances by the dancing-girls (Vesyabhinayam).

When I was studying at Bandar I stayed either with Konda Venkatappayya or with Valluri Suryanarayana Rao. They had great affection for me in those days. Suryanarayana Rao used to enquire about my welfare and progress till his death. It was mainly at his instance that I had come over to Madras. I was then eighteen years old. He wrote a letter introducing me to Rentala Subba Rao.

## SIGHTED A COMET

In Madras my brother-in-law, Kaja Venkata Seshayya, was working as a clerk under Vepa Ramesam. With his support I established myself in Madras. On reaching Madras, Pandita Gopalacharyulu, and Puranam Nagabhushanam became my friends. Through Gopalacharyulu I got acquainted with Panappakam Ananta Charlu and his son Srinivasacharlu. I joined the Wesley Mission High School as a Telugu Pandit after reaching Madras. I worked there for two years. During that period I used to visit the Oriental Manuscripts Library frequently and study the books there.

Frequently, I had literary pastime in the enlightened company of Vepa Ramesam. He had a fund of knowledge. He had profound proficiency in Mathematics, Astronomy, history and other disciplines. I used to learn many astronmical intricacies from him. He had a telescope with him. On occasion, when his noble wife, was in the family way and was away from home at her parent's place, I used to spend months with him engaged in scanning the skies for several nights observing the wonders of the inter stellar phenomena. He used to explain and divulge to me a lot of information on astronomy which I imbibed. In his library he had several important volumes of historical source material like Epigraphica Indica' Indian Antiquary; Epigraphical reports etc. I used to borrow them and read them.

It was the year 1910. Halley's comet appeared on the horizon. A few days

before it was visible to the naked eye both of us used to scan the sky with the aid of binoculars and te'escope during the early hours of the dawn. The comet appeared at first at the time of sun-rise, on the eastern horizon; but it ceased to be visible with the spread of the sun's rays One day, when I got down from the upstairs with binoculars in hand and went out into the street and observed it appeared to me in the form of a luminous broom. Running up (lest the sun's rays should spread in the meantime) I wanted to show it to Ramesam. In that haste I struck against the steps of the stair-case, bruised my knee and blood was oozing out; I did not notice it; but was adjusting the telescope for a clear vision of the comet. On seeing the blood Ramesam asked me what it was. It was only then that I noticed the bruise. At the same time I sighted the comet cleary through the telescope. Ramesam was stunned at my excitement and my being totally unaware of the hurt; and bleeding. When he got over his amazement and tried to locate the comet through the telescope the bright rays of the morning sun concea'ed the object. The next morning we got up early to locate it when I carefully identified the direction in the horizon where I saw it the previous day and showed it to Ramesam. He clearly discerned it and wrote about it immediately to "The Hindu" (English daily). The next day he received a few telegrams from others seeking more information. Thereafter another four or five days later the comet was visible to all.

I was the first person in South India to locate the Halley's Comet. I have recently come to believe that there is some great significance behind my being the first person to identify it. It is because of this belief that I have dilated on this topic. Its significance will be known later.

(to be continued)



# Reminiscences of a Renegade Nephew

VETURI ANJANEYULU

I was born on the 26th of June 1916. My birth star is Bharani. My father's was Krithika. The belief is that if the birth stars of father and son are in sequence, it would not augur well for the parent. When I was an infant my father had typhoid which had relapsed. In those days medical science was not advanced, and in remote villages like Pedakallepalli medical treatment had its severe limitations, My grand father was doing his best, being an Ayruvedic Physician of calibre. My father's life was hanging in balance. Naturally, the ire of my grand parents etc, which was the product of anxiety for the survival of their eldest son was turned against the ill-starred infant that was me. To add to this. I was a continuously crying child. My mother was torn between frightful anxiety for my father's survival and the affection for her infant who was the target of the family's wrath. She would carry me in her arms and attend to domestic chores listlessly. I was told by my dear mother that the only person who showed compassion and consideration was my uncle – Prabhakara Sastri. Unaccustomed to handle infants, he would try his best to make me stop crying with all endearment. It appears he used to say that I would bring fame to the family and would be its mainstay (Vamshoddharaka). The reference obviously was to the family branch of which my father was the progenitor. In a way it had come true. Though I had brought neither name nor fame, being the only surviving son of my parents the continuance of this family lineage depended on me

On one occasion when I was rather argumentative and impertinent, my uncle recalled how he fondled me and sheltered me from the wrath of other members of the family in my childhood.

It was the year 1929 or 1930. The place was Gudivada. My father was working there as Sub-Post Master, Uncle Prabhakara Sastry came to Gudivada on a visit from Madras where he was working. He stayed for a few days. I was studying in the local High School and my elder brother, Kamalakaram, was studying in P. R. College, Kakinada. we bought the pictures of Bhagat Singh, Batukeswara Datta, Sukhadev and Rajguru and hung them on the walls. My brother had left for Kakinada. My father never bothered himself about what we were doing. Uncle saw these pictures and was upset. He told me that they were conspirators who did violent deeds He advised me to remove the pictures I did not listen to him.

One day he asked me whether I would like a poem to be composed in my name, I said I very much would. Then he asked me whether we had a

Telugu Dictionary with us, I produced a dictionary entitled "Andhra Pada Parijatham". He asked me to refer to the word "nenjili" and its meaning. I referred and told him that it meant trouble or hardship Then he wrote down on a piece of paper a poem the gist of which is broadly as follows.

[అంజలి ఘటించి మ్రొక్కెద
నెంజిలి లేకుండ శుభము లెసగుచునుండన్
సంజీవినిచ్చి కావుమ
అంజనగారాపు బిడ్డ హనుమా! మమ్మున్]

"With folded hands, I pary; to avert evil and to ever increase our happiness, give us manna and protect us; O, Hanuman : the beloved son of Anjani."

This token of affection, I cherish to this day.

It was in 1939. I came to Madras for securing admission in the Presidency College for Post - Graduate Course in Economics. I was staying with my Uncle. Prof. Kallukaran was the head of the Economics faculty. I met him. He plainly told me that he was admitt ing an Anglo-Indian girl who passed in third class and not me. Significantly he enquired whether Andhra was known for Alfansoes. I was thick headed; did not take the hint and so my admission question was closed. I sought my uncle's good offices for admission in the Presidency College. He said that he would speak to Dr. Suryanarayana Sastry, Reader in Philosophy in the University of Madras. But that gentleman was in Ooty for summer vacation. Only on his return would uncle be able to put in a word to him. The sands of time were running out. I became restive

I began trying on my own in other Colleges. I went to Pachaiyappa's College, in the first instance, since it was in George Town at that time. I met the Principal, Prof, D S Sarma, who was an imposing and austere personality. He said that he was averse to admitting students for post-graduate course since they would leave the studies in the midst of the course when they get a job· I tried to assure him that I was keen on completing the Post-Graduate course, and that I would not leave in the middle. I could not convince him. He, however, looked at my application. He wanted to know the initial 'V' stood for what. I said it stood for "VETURI". The next question was whether I was related to Prabhakara Sastri. I told him that he was my uncle. A smile came over the austere visage, and he wanted to know whether I would be staying with my uncle or would reside in the hostel in Chetput I said I would be residing in the hostel. I was asked to pay the college fees. That was how I joined the Pachaiyappa's College for Post-Graduate Course.

I was chagrined that my personal credentials did not count and that my uncle's name was the 'Open Sesame' for my entry into the college. My ego was hurt; there was no other go but to reconcile myself to it

It was the year 1942 probably. I was doing research for the M. Litt degree under the late Dr. P. S. Lokanathan. I

